






ముఖచిత్రం: వన్నెవన్నెల చిన్నెల చిన్నది

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య


యువ సాలుచందా రూ. 18-00

దీపావళి సంచికతో రూ. 23-00

యువ వడపళని మదరాసు-26




ఆర్యా,

ఆగస్టు నెల ముఖచిత్రం చూడ ముచ్చటగా వున్నది. కథలు చదువుతుంటే మళ్ళీమళ్ళీ చదవాలన్పించింది. సులోచనారాణిగారి కలం నుండి వెలువడుతున్న "మీనా" సీరియల్ అడుగడుక్కీ ఉత్సుకత కల్గిస్తూ హుషారుగా సాగుతూంది.

——నాని రజా ప్రియ, బరంపురం

"క్షితిజరేఖలను దాటి...." అన్న కథ నాకు ఎంతో నచ్చింది. అదే సంచికలోని "మొండివాడు", "మనకీ జీవితం చాలు!" కథలు కూడా మాకెంతో నచ్చేయి.

——జమ్ముల రామారావు, తుమ్మూరు

ఆగస్టు సంచికలోని మదిగొండ శివప్రసాద్ గారి "క్షితిజరేఖలనుదాటి" అను కథానిక చదివిన తరువాత యీ వుత్తరం రాయాలనిపించింది. కథ కల్పితమైనా ఎన్నుకున్న వస్తువు చాల ఆదర్శవంతంగావుంది. శైలి కూడా దానికి తోడై కథని చాల రక్తి కట్టించింది ముగింపులో దీక్షితులు రామూకు వ్రాసినలేఖ ఎంతో భావ సౌందర్యాన్ని

సంతరించుకునివుంది. భాష కూడ ఏమీ చదువుకోని రామూకు అర్ధమయ్యేలాలేదు. ఇంకో విషయం - డాక్టర్ జంకిన్స్ పునర్జన్మను ఎనిమిదో వింతగా తానూహించినట్లు దీక్షితులు రాముకు రాయడం. ఒక వేళ రాము ఆభావనని అర్ధం చేసుకొన్న పక్షంలో అనేక మానసికాందోళనలకు తప్పక గురికాగలడని నేననుకుంటాను. డాక్టర్ జంకిన్స్‌కు వున్న పుట్టుమచ్చ అతని మరో జన్మలో కూడా వుంటుందా అనేది వివాదాంశమూ, హాస్యాస్పదమూ అవుతుంది. —జి. సీతయ్య, కడప

ఆగస్టు నెల యువ చదివాం. ముఖచిత్రం చాలా బ్యూటిఫుల్‌గా వుంది. "మనిషిగా బతకాలి" సింపుల్ అండ్ స్వీట్‌గా వుంది. మొండివాడు, మనకీ జీవితం చాలు, లలాటలిఖితం చక్కగా వున్నాయి. సీరియల్ "మీనా" గురించి రాయాలంటే పేజీలు సరిపోవు.

—స్వప్నసుందరి, సేవిక, మిర్యాలగూడ-3

యువ అట్టమీద బొమ్మ, అట్టలోపలి బొమ్మలు ఆకర్షణీయంగా వుంది మమ్మల్ని ఆకట్టుకున్నాయి.

"మనిషిగా బ్రతకాలి" "మనకీ జీవితం చాలు" "మొండివాడు" చాలా బాగున్నాయి.

—ఆర్. విజయలక్ష్మి, బర్లా.

కుటుంబంలో అందరికీ నచ్చే
ఒక అందాల పాప సాహసగాథ!

వాసంతి సమర్పించు
శ్రీకల్పనాలయా

# భలే పాప



దర్శకత్వం కె. ఎస్. ప్రకాశరావు
శ్రీఫిలింస్
నిర్మాత వాసంతి B A

SUVARNA

# ఒకటే సబ్బు-లాభాలు మూడు

# నికో క్రిమినాశక సబ్బు

# చర్మ సంరక్షణలో సబ్బు లన్నిటిలో సాటి లేని మేటి

**1** నికో చర్మక్రిములను సంహరిస్తుంది

**2** నికో చెడు వాసనలను అరికట్టుతుంది

**3** నికో చర్మమును [illegible] సంరక్షిస్తుంది

చర్మమును ఆరోగ్యవంతంగా ఉంచుకొనుటకు, నికో సబ్బుతో ప్రతి రోజూ స్నానం చెయ్యండి. దాని యాంటి సెప్టిక్ గుణం గల నురుగు చర్మ క్రిములను సంహరిస్తుంది. నికో యొక్క ఔషధ గుణాలు చర్మంనుండి చెమట వాసనలను హరిస్తాయి మీ చర్మ ఆరోగ్యం దినదినాభివృద్ధి చెందుతుంది

నికోలో ఉన్న శక్తివంతమైన క్రిమినాశక పదార్థం చర్మ వ్యాధులను నిరోధించి, మీ చర్మమును తేజోవంతంగా, చైతన్యవంతంగా నిత్యనూతనంగా ఉంచుతుంది. చెమట పొక్కులు, మొటిమల నరికట్టి నికో మీ చర్మమును రక్షిస్తుంది. నికోతో ప్రతిరోజూ తల రుద్దుకుంటే, చుండ్రు రాకుండా కాపాడుతుంది

మీ చర్మపు ఆరోగ్యమును, లావణ్యమును రక్షించుకొనుటకు, మూడు విధముల లాభదాయకమైన నికో వాడటం నేడే ప్రారంభించండి

**TRIPLE ACTION**

# NEKO®

**The Original Germicidal Soap**

**PARKE-DAVIS**




® Regd Trade Mark, Regd Users – Parke Davis (India) Ltd Bombay

JAISONS 1174

# యువ

సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు చక్రపాణి

సంపుటి 24 సెప్టెంబరు—1971 సంచిక 9

స్వాతంత్ర్యం వచ్చి ఇరవై నాలుగేళ్ళు గడిచిపోయాయి. ఇరవై అయిదవఏడు ప్రారంభమైంది. గడిచిపోయిన ఇరవై నాలుగేళ్ళలోనూ మనం సాధించినది ఏమిటి? సుమారు ముప్ఫయి సంవత్సరాలు బ్రిటిషు ప్రభుత్వంతో పోరాడి, స్వాతంత్ర్యం సంపాదించుకున్న తరువాత, మనం స్వాతంత్ర్యాన్ని ఎందుకు కోరామో, ఆ ఆశయాలను సిద్ధింపచేసుకున్నామా?

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత రెండేళ్ళకు మనకు స్వాతంత్ర్యం వచ్చింది. ప్రపంచ యుద్ధంలో మనం ఏ విధమైన నష్టాన్నీ పొందలేదు. పైగా, బ్రిటనులో విశేషంగా విదేశీ మారకపు నిలువలను పోగుచేసుకున్నాము కూడా. రెండవ ప్రపంచ యుద్ధంలో విశేషంగా నష్టపడిన జపాను, జర్మనీలు, యుద్ధవిరమణ అయిన పదేళ్లలో తమ పరిశ్రమలను బాగా వృద్ధిచేసుకొని, ఆర్థికంగా దృఢమైన వ్యవస్థను నెలకొల్పుకో గలిగాయి. యుద్ధ చర్యలవల్ల ఆర్థికవ్యవస్థ చెడిపోయిన, బ్రిటను, ఫ్రాన్సు, అమెరికా, రష్యా దేశాలు, మళ్ళీ నిలవద్రొక్కుకో గలిగాయి. జపాను ఆక్రమణలోనూ, తరువాత దేశంలో రాజకీయ విప్లవంలోనూ చాలా దెబ్బ తిన్న, చైనా నేడు ఒక బలవత్తరమైన దేశమయింది.

యుద్ధ చర్యలవల్ల ఏ మాత్రం దెబ్బతినకపోగా, యుద్ధానంతరం ఒక భాగ్యవంత

మైన దేశంగా స్వాతంత్ర్యాన్ని పొందిన మనం, ఇరవై నాలుగేళ్లలో శక్తివంతమైన దేశంగా లెక్కలోకి రాలేకపోయాము. దానికి పెద్ద కారణం, మనలో మనకు ఐకమత్యమూ, దేశాన్ని బాగుపరచాలనే దీక్ష లేకపోవడమే.

ఐకమత్యతతోనూ, దీక్షతోనూ కృషిచేసినట్లయితే, యీనాటికీ మనం విదేశాలనుంచి అహారధాన్యాలు దిగుమతి చేసుకోవలసిన అవసరం వుండేది కాదు; స్వాతంత్ర్య రక్షణకు అవసరమైన ఆయుధసామగ్రికోసం ఇతర దేశాలమీద ఆధారపడవలసిన అవసరం వుండేది కాదు. రావణాసురుడి కాష్టంలాగ ఇరవైనాలుగేళ్లగా మండుతూ వున్న కాశ్మీర్ సమస్యను ఒక తలనొప్పిగా యీనాటికీ భరించవలసిన అవసరం వుండేది కాదు. అంతరంగిక రాజకీయ కల్లోలంవల్ల, తూర్పుపాకిస్తాన్‌నుంచి కోటి మంది ప్రజలు కాందిశీకులై మనదేశంలోకి వచ్చేస్తే పాకిస్థాన్‌కు పాఠం చెప్పలేక నిస్సహాయులంగా వుండే అవసరం వుండేదికాదు.

ఈనాటి మన శోచనీయ స్థితికి కారకులు, మన రాజకీయ నాయకులే. తమలో తమకు వున్న వ్యక్తిగతద్వేషాలు, అసూయలు కారణంగా దేశాన్ని అభ్యుదయ పంథాలో ముందుకు తీసుకురాలేకపోయారు. నాయకుల మధ్య అంతఃకలహాలు వున్నంతకాలం, ప్రజలకు సక్రమమైన నాయకత్వం లభించదు. అభ్యుదయ కార్యక్రమాలు నిరాటంకంగా సాగవు. ప్రజలలో ఐకమత్యం చెడడానికీ, ప్రజలలో నిర్మాణ కార్యక్రమ దీక్ష చెడడానికీ కారకులు, నాయకులే. నాయకులలో ఐకమత్యం లేనందువల్లనే, నాయకులుగా పరిణమించిన ప్రతివారికీ అగ్రనాయకత్వం చేపట్టాలనే ఆకాంక్షవల్ల వారిలో వారికి వచ్చిన కలహాలవల్లనే, ప్రజలకు సరియైన నాయకులు అసలు లేకుండాపోయారు. నాయకుల పరస్పర కలహాలవల్ల గ్రామగ్రామంలోనూ వర్గకలహాలు ఏర్పడ్డాయి. పట్టణాలలో పరిపాలన సరిగాలేదు. రాష్ట్రాలలో ప్రభుత్వాలు స్థిరంగా వుండటం లేదు. దేశం బాగుపడటం లేదు. ఈనాడు, దేశాన్నీ, ప్రజలనూ అయోమయస్థితిలో ముంచిన నాయకులు, తమ పరస్పర కలహాలకు స్వస్తిచెప్పుకొని, తమ స్వార్థాన్ని పూర్తిగా చంపుకోకపోయినా, అహంభావత్వాన్ని కొంత అణచుకొని, తమలో సమర్థుడైన ఎవరో ఒకరికి అగ్రనాయకత్వాన్ని ఇచ్చి, ఆ తరువాత ఒక క్షణంకూడా ఆ అగ్రనాయకుని గొంతుకోసే ఆలోచన లేకుండా, ఏకోన్ముఖంగా కృషి చెయ్యకపోతే, మనం ఏ మాత్రం ముందుకు రాలేకపోగా, అనేక త్యాగాలతో సాధించుకున్న స్వాతంత్ర్యానికే ముప్పు తెచ్చుకున్నవార మవుతాము.

*　　*　　*

ఆగస్టు నెలలో, ప్రపంచ రాజకీయాలలోనే ఒక అసాధారణ పరిణామం అని

చెప్పవలసిన, సంఘటన జరిగింది. అది రష్యా, భారతదేశాల మధ్య జరిగిన శాంతి సంధి. మనకు స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచీ, మనదేశానికీ రష్యాకూ మధ్య మైత్రి వర్ధిల్లుతూనే వుంది. ఇదే విధంగా, అమెరికాకూ మనదేశానికీ మధ్య మైత్రి వర్ధిల్లుతూనే వుంది. అయితే, యీనాడు రష్యా మనతో ఒక సంధి చేసుకున్నది. ఈ సంధి వల్ల, రష్యా భారతదేశాలలో ఏ దేశంపైన నయినా ఇంకొక దేశం దౌర్జన్యం జరిపినట్లయితే, రష్యా, భారతదేశాలు అన్యోన్యంగా ఒకరికొకరు సహాయపడతారు. ఇలాటి ఒప్పందము, మనకూ రష్యాకూ మధ్య ఏర్పడడం, ప్రస్తుత పరిస్థితులలో చాలా సంతోషించవలసిన విషయము.

ఏమంటే, మనల్ని ఎలాగయినా యుద్ధంలోకి లాగాలని పాకిస్థాన్ ప్రయత్నం చేస్తోంది. ప్రస్తుతం పాకిస్థాన్ సంపూర్ణ వినాశనం పొందే స్థితిలో వుంది. తూర్పు బెంగాల్‌కూ, పశ్చిమ పాకిస్థాన్‌కూ మధ్య సౌజన్యం కుదరడం ఇక కల్ల. ఎలాగయినా తూర్పుబెంగాల్‌ను పూర్తిగా తన అధీనంలోకి మళ్ళీ తెచ్చుకోవాలని పాకిస్థాన్ ప్రయత్నం. ఆ ప్రయత్నం ఫలించాలంటే, తూర్పుబెంగాల్‌నుంచి భారతదేశానికి వచ్చిన కోటిమంది కాందిశీకులను మళ్ళీ తూర్పుబెంగాల్‌లోనికి రానియ్యకూడదు. కాని, ఈ కాందిశీకులను శాశ్వతంగా భారతదేశం భరించలేదు. అంచేత, వారిని మళ్ళీ తూర్పుబెంగాల్‌కు పంపించడానికి తగిన పరిస్థితులు ఏర్పడాలని భారతదేశం పట్టు పడుతోంది. ఈ తగాదా కారణంగా భారతదేశాన్ని ఎలాగయినా యుద్ధంలోకి లాగి, చైనా సహాయంతో భారతదేశాన్ని గట్టిదెబ్బ కొట్టాలని పాకిస్థాన్ ఆలోచన. దానికి తగినట్టు, చైనా పాకిస్థాన్‌కు మద్దతు ఇస్తోంది. ఆసియా ఖండంలో యుద్ధం వస్తే, అమెరికా జోక్యం కలిగించుకోవడం సందేహమే. కనుక, పాకిస్థాన్‌తో కలిసి ముందు భారతదేశం పైన దెబ్బకొడితే, తరువాత పాకిస్థాన్‌ను లొంగదీసుకోవడం చైనాకు సులభం. చైనా తరువాత, ప్రపంచంలో అత్యధిక జనాభాగల దేశం భారతదేశమే. అలాటి భారతదేశమే లొంగిపోయినట్లయితే, ఆసియా ఖండంలోనే కాక ప్రపంచం అంతటిలోను బలవత్తరమైన దేశం అవుతుంది చైనా. అలా అవాలనిచైనా కోరిక.

చైనా, పాకిస్థాన్‌లు రెండూ కలిసి యుద్ధచర్యలకు దిగితే, నిలబడడం భారతదేశానికి కష్టమే. అంచేత, రష్యా మనకు మిత్రుడుగా వుండటం, చాలా సంతోషకరమైన విషయం. రష్యా తోడ్పాటు కల భారతదేశంతో తగాదా పెట్టుకోవడానికి, చైనా ఎక్కువ ధీమాతో ముందుకు రాజాలదు. చైనా సహాయం లేకపోతే మనతో తగాదా పెట్టుకోడానికి పాకిస్థాన్ జంకుతుంది.

అంచేత, రష్యా, భారతదేశాల శాంతిసంధి, పాకిస్థాన్ భారతదేశాల మధ్య

యుద్ధం రాకుండా చేస్తుందని మనం ఆశించవచ్చును.

ఒక వేళ, భారత్ పాకిస్తాన్‌ల మధ్య యుద్ధమే వచ్చినట్లయితే, రష్యా సహాయం చాలా ముఖ్యమైనదవుతుంది. తూర్పు పాకిస్తాన్‌లో యుద్ధ చర్యలు జరగాలంటే, చైనాద్వారా సైన్యాలను తూర్పు పాకిస్తాన్‌కు పంపడమే కాక, అరేబియన్ సముద్రం గుండా, బంగాళాఖాతం ద్వారా నౌకల ద్వారాగూడా సైన్యాలను పంపడానికి. బొంబాయి, మదరాసు, విశాఖ పట్టణం, కలకత్తా రేవులపై నౌకా యుద్ధం సాగించడానికి పాకిస్తాన్ ప్రయత్నిస్తుంది. ఈ ప్రయత్నాన్ని విఫలం చెయ్యడానికి, మనకు రష్యా నౌకాదళం చాలా సహాయపడగలదు. అరేబియన్ సముద్రం, బంగాళాఖాతాలలో రష్యన్ నౌకాదళం, మన నౌకాదళానికి సమర్థమైన సహాయాన్ని ఇవ్వడమే కాక, నౌకా విమానాల సహాయంతో తూర్పు పాకిస్తాన్‌కు చైనాద్వారా పాకిస్తాన్ సైన్యాలు రాకుండా కూడా అడ్డుపడగలదు. పాకిస్తాన్‌తో యుద్ధం జరిగితే, భారత్‌కు ఈ సహాయం అమూల్యమైనది.

---




అయిదేళ్ల ప్రాయంలో వుండగా పిల్ల అందం చూసి బాదల్ గ్రామపు శ్రీమంతుడు గౌరవదాసు అధికారి మురిసిపోయాడు. సౌందర్యవతి అయిన ఆ కుసుమని తన కొడుకు బృందావనుడికి చేసుకున్నాడు. పెళ్ళేమో బాగానే అయిందిగానీ, కొన్నాళ్ళకి ఓ అవాంతరం వచ్చి పడింది. పిల్ల తల్లిని గురించి అదోరకమైన అపవాదులు చెవిని పడడంతో గౌరవదాసు మనస్సు విరిగి, కుసుమని వదిలిపెట్టేసి కొడుక్కి మరో పెళ్ళి చేశాడు.

* * *

కుసుమ అన్నగారు కుంజవైష్ణవుడికి చెల్లెలి జీవితం గురించి తలుచుకుంటే అమితమైన దుఃఖం కలుగుతుంది. కుసుమ చిన్నప్పుడే తండ్రి పోయాడు గనుక, ఆమె తల్లే పడరాని పాట్లు పడి కొడుకునీ కూతుర్నీ పెంచి పెద్ద చేసింది.

అయిదేళ్ళ కుసుమకి వివాహమూ, అందునుంచి విడుదలా కూడా జరిగిపోయాయి.

కాసుకి గతిలేని పేదరాలు కుసుమ తల్లి. ఈ సంఘటన ఆమెని ఆవేదనలో ముంచింది. ఏమున్నా ఏమి లేకపోయినా, ఆమెలో అభిమానం మిగిలిపోయింది. గౌరవదాసు విడిచి పెట్టేసిన అదే నెలలో, తన కూతుర్ని ఇంకో చోటికి తీసుకు పోయి ఓ ఆసామీకి యిచ్చి ముడి పెట్టేయించింది. అయితే, ఆర్నెల్లు తిరక్కుండానే ఆ బైరాగీరామ్ హరీమన్నాడు.

అయితే ఆ బైరాగీరామ్ ఎవరు? ఆయనది ఏ వూరు? అసలింతకీ వివాహం జరిగిందా. ఈ వైనాలన్నీ ఆమె కన్నతల్లికి తప్ప—ఆమె అన్న కుంజనాధుడికి కూడా తెలీదు.

ఇంత భారతం కుసుమకి ఏడేళ్ళు రాకండానే జరిగి పోయింది. ఇది టూకీగా కుసుమ చిన్ననాటి జీవిత చరిత్ర.

ఇప్పుడు కుసుమ పదహారేళ్ల తరుణి. సౌందర్యం తొణికిసలాడే నవయవ్వనవతి. చదువు సంధ్యలు చక్కగా నేర్చింది. పనిపాటలు చకచకా చేసేస్తుంది. ఎంత పెద్ద యింట్లో పడినా నెట్టుకుపోగల నేర్పుగలది. ఇదీ—బాల వితంతువు కుసుమ కథ!

* * *

ఇహ అక్కడ బృందావనుడి స్థితి—

తండ్రి గౌరవదాసు గతించాడు. మళ్ళీ చేసుకున్న తన రెండవ భార్య మరణించింది. అతని వయస్సు చూడబోతే ఇరవై అయిదుకి మించి లేవు. ముందు చేసుకున్న కుసుమని తెచ్చుకుందామా అని అన్పించింది. ఆమె అన్న కుంజుకి కొన్ని కాసులు పంపి, పని సానుకూలం చేసుకుందామా అన్న ఆలోచన కూడా తట్టింది.

ఈ వర్తమానం చెవిని పడేసరికి కుంజునాధుడికి కుతూహలం కలిగింది. చెల్లెలు ఇందుకు ఒప్పుకుంటే బాగుండునుగదా అనుకున్నాడు. కాని, కుసుమకి ఈ ఆలోచనే లేదు.

* * *

కుంజు, కుసుమలు సయానా అన్నా చెల్లెళ్లు కారు. ఇద్దరూ ఓ పూరికొంపలో వుంటున్నారు. అన్న ఉద్దేశ్యం తెలుసుకున్న కుసుమ మండిపడింది.

''నా కదేం తెలియదన్నయ్యా నేను విధవని. నీ ఇష్టం వచ్చినట్లు చేద్దామను



కుంటున్నావు కాబోలు. నేనేం పశువుని కాను....బాదల్ వారికీ, నాకు సంబంధ మేమిటి? వాళ్ళు నాకేం కారు. నాభర్త పోయాడు. నేను విధవని. అంతే!!'' అన్నది.

ఇలా అనేసరికి ఆమె ముందు తలెత్తలేక పోయాడు కుంజా. అయితే, అతని ఆలోచన వేరు. తను నిరుపేద, ఉన్న ఆస్తి అంతా రెండు కొంపలూ, ఆ చిన్న మామిడితోటా! ఇటువంటి స్థితిలో—బృందావనుడి సంబంధం అంటే—ఇంత రొఖ్ఖం, వెండి బంగారాలూ కలిసి రావడమన్నమాటే!

''మా సంఘంలో పుస్తె మార్చుకునే సాంప్రదాయం వున్నది. ఆ సంస్కారం మా అమ్మే చేసి చచ్చిపోయింది. మా చెల్లి కుసుమకు భర్త బృందావనుడే. అతడే కోరి, మళ్ళీ తీసుకెళ్తానని ఇంతగా బతిమలాడ్తూ వుంటే, ఇలాంటి గొప్ప అవకాశాన్ని ఆమె యె. కు జారవిడుస్తూందో అర్థంకాదు. సంఘపెద్దల అనుమతి తీసుకోవడం, వాళ్ళకి కాస్త నైవేద్యం పెట్టడం! అంతేగా!! పెళ్ళి ఖర్చంతా బృందావనుడే భరిస్తాడు. ఆ తర్వాత మా కుసుమకి కష్టాలే వుండవు. ఒక మహారాణీలా సుఖంగా వుంటుంది, ఇలాంటి అవకాశాన్ని కుసుమ ఎందుకు కాలరాస్తూ న్నదో....!''—ఇవే అస్తమానం కుంజుడి ఆలోచనలు.

కుంజునాధుడు వీధి వీధి తిరుగుతూ ''నూలుండలు, ఊలుపిడులు, అద్దాలు, దువ్వెనలు, కుంకం బరిణలు, పాపాయిలకి ఆటబొమ్మలూ....!'' అంటూ ఒక గంప

నె త్తివి పెట్టుకుని రోజూ రెండు పూటలా అమ్ముతుంటాడు.

సాయంకాలమయ్యే సరికల్లా అందిన డబ్బంతా చెల్లిలి చేతికిస్తాడు. ఆ వచ్చే కొద్దిపాటి లాభంతో సంసారాన్ని ఎలా నిగ్రహించుకు వస్తూందో అన్నకి తెలియదు. తెలుసుకోటానికి అతడెన్నడూ ప్రయత్నించనూ లేదు....

నెత్తిన గంపతో కుంజు ఇవాళ బాడవ్ గ్రామం వచ్చాడు. దార్లో అతనికి బృందావనుడు ఎదురయ్యాడు. కుంజు పై వాడేం కాదుగా! స్వజాతీయుడు, ఆత్మబంధువూ గనక అతన్ని ఎంతగానో ఆదరించి ఇంటికి తీసుకుపోయాడు. కాళ్లు కడుక్కోమని నీళ్ళిచ్చేడు. 'ఇంత ఎండలో యిప్పుడు వెళ్లడానికి వీల్లేదు. కాస్త చల్లబడగానే బయల్దేరుదువుగాని' అని చెప్పి వెళ్ళనియ్యకుండా అతన్ని బృందావనుడు అపు చేశాడు. ఇంతలో అతడి తల్లి నాలుగు కూరల్తో సహా వంటచేసి వడ్డించింది.



సాయంకాలానికల్లా కుంజు ఇల్లు చేసుకున్నాడు. కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు. ఇన్ని వేపుడు శెనగలు నోట్లో పోసుకు నములుతూ, ఆ రోజు జరిగిన భోగట్టాలన్నీ పూస గుచ్చినట్టు చెల్లెలితో చెప్పేడు. అన్నీ చెప్పేక, చివరికి ఇలా అన్నాడు.

"చూడు, చెల్లాయ్! అతడు శ్రీమంతుడు. తోటా దొడ్డీ—పొలం పుట్రా—డబ్బూ దస్కం—ఇంతకంటే ఏం కావాలి? అన్నీ వున్నాయి లక్షణంగా. దేనికీ కొదవ లేదు. కనక, యిప్పుడైనా ఒప్పుకో. కాదనకు!" అంటూ ప్రారంభించేడు.

అన్నగారి మాటలన్నీ శ్రద్ధగా విన్నది కుసుమ. దేనికీ సమాధానం చెప్పలేదు. ఇదీ బాగానే వుందనుకుని బృందావనుడి ఘనతను గురించి ఇంకా వివరంగా, గొప్పగా చెప్ప నారంభించాడు కుంజు.

వాళ్ళమ్మ బ్రహ్మాండంగా ఇన్ని కూరలు చేసి పెట్టిందన్నాడు. ఎంతగానో ఆదరించిందనీ చెప్పాడు. "ఇంత ఎండలో వెళ్లొద్దు నాయనా, తలనొప్పి వస్తుంది, మూల పడ్తావు సుమా!" అంటూ కదలనిచ్చిందే కాదన్నాడు. ఇంకా ఏమేమో ఏకరువు పెట్టాడు.

చిరునవ్వుతో అన్న మొహంకేసి చూసింది కుసుమ. "అయితే—ఇవాళల్లా ఇదే పనితో వుండిపోయావన్న మాట. కడుపు నిండ భోజనం ..కంటి నిండా నిద్ర! ఇంకేం? భేష...చాలా బాగుంది!" అన్నది. అంతలోనే మొహాన్ని గంభీరంగా పెట్టి 'సరేలే. అయిందేదో అయింది. కానీ, మరెప్పుడూ నువ్వు ఆ వూరు వెళ్లకు. తెలిసిందా." అని ఖచ్చితంగా చెప్పింది.

కుంజుకీమాట అవగాహన కాలేదు. "ఎందుకనీ?" అని ప్రశ్నించాడు

"ఎందుకనా?—ఎప్పుడు దార్లో కనబడినా ఇప్పటిలాగే నిన్ను తీసుకుపోయి మర్యాదలు చేస్తారు. వాళ్ళకేం? వాళ్ళు కలవాళ్ళు. వాళ్ళలాగా మనకి ఎలా జరుగుతుంది?" అని అంది.

చెల్లెలి మాటకి కుంజు చాలా బాధ పడ్డాడు. గ్రహించింది కుసుమ. మళ్ళీ ఇలా అన్నది: "అది కాదన్నా! నేనేం తప్పుగా అనలేదు. ఒకటి రెండుసార్లు వెళ్ళినంత మాత్రాన వచ్చిన బంది యేం లేదులే .వారు కలిగిన ప్రభువులు. మనం లేని వాళ్ళం అటువంటి గొప్పవాళ్ళతో మనలాంటి వాళ్ళం స్నేహం పెంచుకోవడమంటే కుదురుతుందా? బాగుంటుందా?" అనడిగింది.

"ఆ మాటకొస్తే మరి ఆ బ్రాహ్మణ పిల్లల్తో నీకంత దోస్తీ యెందుకు చెప్పూ? వాళ్ళంతా కలవారి పిల్లలేగా! అక్కడికెందుకు వెళ్తున్నావు నువ్వు?" అనడిగేడు.

అన్న వేసిన ప్రశ్నలో భావాన్ని ఇట్టే గ్రహించిన కుసుమ నవ్వి ఇలా అంది:

"బాగానే అడిగావు, అన్నయ్యా! ఆ బ్రాహ్మణపిల్లల మధ్యని నేను పుట్టినప్పటి నుంచీ మసులు తున్నాను. నీకు తెలుసుగా. వాళ్లు మన కులం వాళ్లు కాకపోయినప్పటికీ,వాళ్లతో నేస్తం కట్టడానికి సిగ్గుపడాల్సిన పనిలేదు!' అని చెప్పింది.

"నిజం మాటాడేవమ్మా చెల్లీ! మరైతే వారితోస్నేహం చెయ్యడానికి నేనూ సిగ్గు పడాల్సిన పనిలేదూ! వారు శ్రీమంతులు. అయినా నరే వారిలో కొంచమైనా అభిమానముందా, అహంకారం వుందా? వారి హృదయం నిష్కళంకం, అబృందావనుడి తల్లి నా చేతులు రెండూ పట్టుకునీ .. "

మాట సాంతంగా చెప్పనివ్వలేదు కుసుమ. మధ్యలో ఆపేసి యిలా అడిగింది:
"ఆ పాత గొడవలన్నీ మళ్లీ ఎందుకు ఎత్తేవన్నయ్యా? ఒద్దని చెప్పినా వినవేం?—మన అమ్మమీద వాళ్ళు ఎంతలేసి అపవాదులు వేశారో, అవన్నీ, మరిచిపోయావా?"

వాదనకి దిగేడు కుంజు.

"చెల్లీ! అమ్మనిగురించి వారు ఎవళ్ళతోనూ ఒక్క ముక్క విరసంగా చెప్పగా నే విన్లేదు. ఎవళ్లో కిట్టనివాళ్లు అపవాదులు వేస్తూవుంటారు. అప్పుడూ అలాగే జరిగి వుంటుంది. అంతే!" అన్నాడు.

"లోకులు అంటేనే గామాలు. వారు మనల్ని ఇంటోంచి గెంటివెయ్యడం, వైభవంగా యింకో పెళ్ళి చేసుకోవడం జరిగింది. ఊరుకో అన్నయ్యా. ఏం మాటలూ?"

"నువ్వేమన్నా అనుకో. మళ్ళీపెళ్ళి జరిగినమాట నిజమే. కాదనను. అందులో బృందావనుడి తప్పేం లేదు. తప్పంతా అతడి తండ్రి గౌరవదాసు అధికారిదే." అని కొంచెం అసంతృప్తిగా అన్నాడు కుంజు.

కాసేపు మౌనంగా వుంది కుసుమ. ఆ తర్వాత శాంతంగా అన్నది: "సర్లే అన్నయ్యా! తప్పెవరిదైతేనేం? జరిగిపోయినదాన్ని గురించి పదిసార్లు అనుకొని ఏం లాభం? అయినా నీతో వాదించటానికి నాకు శక్తి లేదు!"

అన్న మళ్ళీ అందుకున్నాడు గంభీరమైన స్వరంతో—"అమ్మాయ్ చెల్లీ! నాకు తెలిసిన పెద్దలందరితో ఈ విషయం కదిపి చూశాను. మీ అత్తగారి ఉద్దేశ్యంకూడా అడిగి తెలుసుకున్నాను. వారంతాకూడా ఎంతో సంతోషంతో సమ్మతించేరు. తెలుసా?"

కుసుమ ముఖవిన్యాసం ఒక్కసారి కఠినంగా వున్నట్టు అగుపించింది. ముక్తసరిగా "ఆc—ఎందుకు తెలీదు!" అని అనేసి, మాటాడక వూరుకుంది.

"ఇపుడు సంఘంలో నన్ను గురించీ, మా అమ్మనుగురించీ, నా పుస్తె మార్పు గురించీ రకరకాల చర్చలూ, విమర్శలూ జరుగుతున్నాయి. పెద్దల అభిప్రాయం అడిగి తెల్సుకున్నారు". ఈ మాటలు కుసుమ మనస్సులో మెదిలి చాలా వేదనని కలిగించాయి. అయినా ఆమె ఆ బాధని పొక్క నీయలేదు. పైకిమాత్రం "అన్నయ్యా!—భోజనంలోకి ఈ పూట యేమిటీ?' అనడిగింది.

· చెల్లెలి మనోభావం గ్రహించాడు అన్నగారు. మొహం గంపంత చేసుకుని "ఏమీ వద్దు. నాకీపూట ఆకలిగా లేదు" అన్నాడు.

కుసుమకి మరీ కోపం వచ్చి తన గదిలోనికి వెళ్ళిపోయింది. ఓ చుట్ట ముట్టించి, కుంజ అక్కడే పొగ వదుల్తూ కూర్చున్నాడు. కాస్సేపయాక "కుసుమ్" అని పిలిచేడు.

లోపలనుంచే "ఏం?" అన్నది కుసుమ.

"ఇంత పొద్దుపోయింది కదా, వంటా గింటా ఏంలేదా?"

"లేదు."

"ఎందుకనీ?"

"ఇప్పటికప్పుడే వందసార్లు చెప్పాను' అన్నది విసుగ్గా.

చెల్లెలి మాటకి ధుమధుమలాడాడు కుంజు. సరాసరి ఆమె కూచున్న గదిలోకి వెళ్ళి అరవటం మొదలెట్టేడు: "ఇదుగో కుసుమ్! నన్నిలా యాతనపెట్టి, ఇంకా కోపం తెప్పించేవంటే నా యిష్టంవచ్చిన చోటికి పోతాను."

"పో. ఇప్పుడే వెళ్ళిపో! ఇక్కడమాత్రం అరవకు. బజారుకి పోయి గొంతు చించుకుని అరుచుకో!" అన్నది కుసుమ కళ్ళలో అగ్గి కురిపిస్తూ.

చెల్లెలి మొహం చూసేసరికి కుంజుకి మనస్సులో భయం పుట్టింది. కొ స్త



యువ

మెత్తబడి స్థాయి తగ్గించేడు. "ఏం చేశాననీ నేను?" అన్నాడు.

"ఇంకేం చెయ్యాలి? నాతో చెప్పకుండా, చెందకుండా, అక్కడికి పోయి ఎందుకు భోంచేశావు, చెప్పూ?" అన్నది.

"ఏం ఇందులో తప్పేముందీ?"

"తప్పేముందని మెల్లిగా అడుగుతున్నావా? ఇంతకు మించిన తప్పేముంది? పోనీ అని ఇవాల్టికి ఊరుకున్నా, మరెన్నడూ అక్కడికి పోబోకేం?" అని గద్దించింది.

పోట్లాటలో తను లొంగిపోయినట్టు ఒప్పుకోవడం అతడికి సిగ్గనిపించింది. "నా మీద పెత్తనం సాగిద్దామని చూస్తున్నావే! నాకంటే నువు పెద్దదానివా? నా ఇష్ట మొచ్చిన చోటికి పోతా!" అన్నాడు.

ఇప్పుడు కుసుమకూడా గట్టిగా అరుస్తూ చెప్పింది! "అన్నయ్యా! ఇదే చెప్పటం. ఇక్కణ్ణించి నిన్ను కాలు కదపనివ్వను. తెలిసిందా! మళ్ళీ ఇలాంటి పిచ్చిమాటలు అనబోక, బాగుండదు!"

ఈ మాటు నిజంగానే భయపడ్డాడు కుంజు. అయినా పైకి ధైర్యం నటిస్తూ "వెళ్తే యేం చేస్తావేం?" అన్నాడు.

చేతిలో గుడ్డ అవతల పారేసి, చివ్వున లేచింది. "ఇదే చెప్పడం. నాకు కోపం రానివ్వకు. పో. వెళ్ళిపో!"—అన్నది బిగ్గరగా.

కాస్త తటపటాయించి ఇవతలికి వచ్చేశాడు కుంజ. తలుపుచాటున నించుని మెల్లిగా అన్నాడు: "నువ్విలా భయపెడితే వెళిపోతాన్లే. అక్కడికి వెళ్తే ఏం చేస్తావ్?"

మాటాడలేదు కుసుమ. వత్తి ఎగసందోసి, దీపం పెద్దది చేసి, మళ్ళీ కుట్టుపని చూసుకోసాగింది.

"అయితే అన్నయ్యా, కంసాలి దుకాణం దగ్గరికి వెళతావుగా?' అనడిగింది అక్కణ్ణించే.

"ఆఁ"—అన్నాడు కుంజ తల ఆడిస్తూ.

కుసుమ అతడితో లాలిస్తున్నట్టు ఇలా చెప్పింది: "సరే వెళ్లు. పొద్దుపోయేదాకా మాత్రం వుండకు. నా వంట చప్పునే అయిపోతుంది. ఆలస్యమేం కాదు!"

చేతిలో చుట్టతో కుంజనాధుడు మెల్లిగా బయటికి నడిచాడు.

## 2

కుంజనాధుడు తన చెల్లెలు కుసుమతో ఆనాడు కొన్ని గొప్పలు చెప్పాడు గదా

బృందావనుడి గురించీ, అతని ఇల్లూ వాకిలి గురించీను। అయితే అందులో అతిశయోక్తి ఏమీలేదు. ఆ కుటుంబంలో అతిశయం గాని, అహంకారం గాని ఏ కోశానా అగుపించదు.

బృందావనుడు చాలా నిరాడంబరుడు. వాళ్ళ వూళ్లో బడి అనేది లేకపోయింది. అందుచేత చిన్నప్పు డతడు కొద్దో గొప్పో, రాతా చదువూ స్వయంకృషివల్లనే నేర్చాడు. తన వూళ్లో బడి లేని లోపం బృందావనుడిని బాధించింది. గ్రామంలో ఒక పాఠశాల వుండి తీరాలి అనే సంకల్పం అతడికి గట్టిగా పట్టుకుంది. అయితే— అతడి తండ్రి గౌరవదాసు ఘటికుడు. ఆదాయం లేని ఉద్యమం అతనికి నచ్చదు. అటువంటి పిచ్చి పన్లు ఎవరైనా తలపెడితే అతను ప్రోత్సహించడు.

ఈ కారణంచేత తండ్రి జీవితకాలంలో ఆ వూరి పాఠశాల స్థాపనకి అవకాశమే లేకపోయింది. తండ్రి మరణించాక బృందావనుడు తన ఇంటిలోనే ఒక ధర్మ పాఠశాల స్థాపించాడు. వాళ్ళ వీధిలోనే పెన్షన్ తీసుకు కాలక్షేపం చేస్తున్న ముసలి పంతులు ఒకాయన వున్నాడు. ఆయన్ని బృందావనుడు తన పాఠశాలలో పిల్లలకి ఇంగ్లీషు నేర్పటం కోసమని నియమించేడు. ఆయన రాత్రిపూట వొచ్చి పాఠాలు చెప్పి పోతుంటాడు.

బృందావనుడి రెండవ భార్య ఆ ఘుదేళ్ళ కిందట పోయింది. ఆ తర్వాత అతడు ఈ చదువూ, పాఠశాలా వ్యాపకంలోనే మునిగివున్నాడు.

''మళ్ళీ పెళ్ళి చేసుకోరా నాయనా'' అంటూ అతడి తల్లి బలవంతపెడుతూ వచ్చింది. అటువంటప్పుడు ఆ పసిబిడ్డల్ని చూపెట్టి, తల్లితో ''అమ్మా, ఎవరికోసమైతే పెళ్ళి చేసుకోవాలో వాళ్ళు నా దగ్గరే వున్నారు కదా, మరి వేరే పెళ్ళి చేసుకోమంటా వెందుకు?'' అని ప్రశ్నవేసి జవాబు చెప్పేవాడు.

ఎంతయినా తల్లి ప్రాణం కదా, ఏడ్చేది. తనమాట వినమని మొత్తుకునేది. ఏమైనా కానీ, ససేమిరా అనేవాడు. ఇలా రెండేళ్లు గడిచిపోయినై.

* * *

అనుకోకుండా ఓ రోజున చిత్రమైన సంఘటన జరిగింది, కుంజవైష్ణవుడి ఇంటి మీదుగా వెళ్ళేటప్పుడు కుసుమ బృందావనుడి కంటబడింది.

ఏటిలో స్నానం చేసుకుని, నీళ్ళబిందె చంకని పెట్టుకుని ఇంటికి పోతూ కనిపించిందామె. ఇప్పుడే కుసుమకు యౌవనం అంకురమవుతూంది. ఆ నవయవ్వన సౌందర్యానికి ముగ్ధుడైన బృందావనుడు ఆమెకేసి దృష్టి నిలిపి అలానే చూస్తూ వుండిపోయాడు.



కుసుమ తన మానాన తను ఇంటోకి వెళ్ళిపోయింది. తర్వాత అతడు మెల్లిగా సాగిపోయాడు. ఈ వూరేం కొత్తకాదతడికి. కనుక, ఆ వెళ్తున్న సుందరి యెవరో ఇట్టె గ్రహించాడు.

* * *

బృందావనుడు తన తల్లికి ఒక్కగానొక్క సంతానం. ఆ తల్లీ బిడ్డలకి పరస్పరం వుండే అనురాగం, మమకారం అవధుల్లేనివి.

అతనింటికి వచ్చాక, మనస్సులో ఎట్టి దాపరికమూ లేకుండా, నిస్సంకోచంగా కుసుమ సంగతి తల్లితో చెప్పాడు.

అందుకు తల్లి అన్నది: "అదెలా కుదురుతుందిరా నాయనా? వాళ్లని గురించి

బోలేదన్ని అపవాదులు విన్నాం కదా!''

''ఉండనీ అమ్మా, ఎన్నయినా వుండనీ! ఎన్ని వాదులున్నా ఆమె నీ కోడలేగదా! పెళ్ళి సమయంలో మరి, ఇదంతా యెందుకు ఆలోచించలేదు?''

''అదంతా మీ నాన్నకు తెలుసురా బాబూ! అప్పుడు ఆయన మంచిదనుకునే చేశారు.''

''సరేలే అమ్మా! మీ యిష్టం, నే నిలాగే వుండిపోతా. ఇహముం దెప్పుడూ నా పెళ్ళిగొడవ మాత్రం ఎత్తకు! ఇదే చెప్పటం!'' అని చెప్పేసి బృందావనుడు బయటికి వెళ్ళిపోయాడు . . ఇది జరిగీ మూడేళ్ళు గడిచిపోయింది.

* * *

ఈ మధ్యకాలంలో, కుసుమను ఇంటికి తెచ్చుకుందామని బృందావనుడి తల్లి శతవిధాల ప్రయత్నించింది. కాని ఫలితం శూన్యం!

ఏ విధంగా చూసినా, కుసుమ యిందుకు ఎంతమాత్రం ఒప్పుకోలేదు. ఆమె నిరాకరించటానికి రెండు కారణాలున్నాయి. తన అన్న కుంజు అసమర్థుడూ, తెలివి తక్కువవాడున్నూ. అతగాడిని వంటరిగా వదిలి తను ఎక్కడికి పోయినా సుఖంలేదు. మనశ్శాంతి వుండదు.

ఇహ రెండవ కారణం—జాతి భేదాలు ఎప్పుడు పుట్టాయో వాటితోపాటే సంఘాలూ, శుద్ధి సంస్కారాలూ కూడా పుట్టుకొచ్చాయి. ఆమె భర్త దగ్గరికి వెళ్ళదలిస్తే, ఇప్పుడు మళ్లీ ఆ శుద్ధి సంస్కారాలన్నీ జరగాలి. ఇందుకోసం యెంతో మంది సమావేశమవుతారు. తన తల్లిని గురించి లేని పోని చర్చలెన్నో బయల్దేరాయి. మరి ఎన్నెన్ని సంగతులు ఆ సంఘం మధ్యకి వస్తాయో తెలియదు. ఈ గల్లంతు యిరుగు పొరుగులకి వేడుక. తన నేస్తాలు చాటుగా నవ్వుకుంటారు. గుసగుసలాడ్తారు. ఇవి తలుచుకుంటే ఆమె సిగ్గుతో కుంగిపోతుంది గాని మరేమన్నా వుందా?

''నేను డబ్బులేని పేదదాన్నే. అయినప్పటికీ నాతో కూడా చదువుకొని పెద్దవాళ్ళయిన గొప్ప యింటి పిల్లలకంటే—ఆచారంలోగాని, వ్యవహారంలోగాని నేనేం పేదదాన్ని కాదు!'' అని ఆమె మనస్సులోవున్న గట్టి నమ్మకం!

* * *

కుసుమ నిన్న సాయంత్రం అన్నగారితో పేచీపడింది. కోపంతో పెట్టె తాళం చెవులు అతడి కాళ్ళదగ్గరకి విసిరికొట్టింది.

ఇవాళ పొద్దున్న ఏటికిపోయి స్నానం చేసుకురాగానే చూస్తే—అన్నగారు కనబడదే! అతడూ లేడు, అతడు వస్తువులు పెట్టుకు తిరిగే అమ్మకపు తట్టా లేదు.

తనలో తనే నవ్వుకుంది కుసుమ. "రాత్రికి రాత్రి చీవాట్లు తిన్నాడుగా. అందుకని పొద్దుటే మరి కంటికగపడకుండా ఉడాయించాడు." అనుకుంది.

రోజూ పువ్వులు కోసుకొచ్చి ఎంతో శ్రద్ధాభక్తుల్తో పూజకి కూర్చోవటం ఆమెకు నిత్యకృత్యం. ఈ రోజున కూడా అలాగే పువ్వులు కోసి తెచ్చుకొని పూజాగృహంలో కూర్చుంది. కూర్చోగానే, వాకిటిముందు ఎడ్లబండి వచ్చి నిలబడ్డ అలికిడయింది. మరుక్షణమే ఒకామె—వయస్సు మళ్ళిన యిల్లాలు తలుపు నెట్టుకొని లోపలికి వచ్చింది. కొత్తవాళ్ళకి మల్లే వాళ్ళిద్దరూ కొద్ది క్షణాలు ఒకరి నొకరు చూసుకుంటూ వుండిపోయారు. ఇంతకుముందెప్పుడూ కుసుమ ఆవిణ్ణి చూసివుండలేదు. ఆమె నొసట విభూతి, చేతిలో జపమాల కనబడగానే, ఆమె ఎవరో తమ జాతికి చెందినదే అయివుండాలని అనుకున్నది కుసుమ.

వెంటనే ఆ పెద్దావిడ కుసుమ దగ్గరికి వచ్చింది. "అమ్మాయ్! నే నెవరో నువ్వెర గవు కాబోలు. కానీ మీ అన్నయ్య మాకు బాగా పరిచయమే. ఏదీ కుంజు ఎక్కడా?" అంటూ పలకరించింది, నవ్వుతూ.

"ఇవాళ, బయటి కెక్కడికో ఉదయాన్నే వెళ్ళిపోయాడు. పొద్దెక్కగాని రాడు!" అన్నది కుసుమ.

ఆ వచ్చినావిడ అమిత ఆశ్చర్యంతో యిలా అంది: "ఆఁ!—పొద్దెక్కగాని రాడూ? నిన్నటిరోజున వచ్చి బావనీ, బావ స్నేహితుల్నీ విందుకి పిలిచాడు. అందుకనే కదా, యివాళ పొద్దున్నే నేను మా బృందావనుడితో "నాయనా బృందా! బండీ కట్టుకు రమ్మనమని బండీవాడితో చెప్పరా. నేను కూడా వచ్చి కోడల్ని చూస్తాను. దీవించి వస్తాను! అని మరీ మరీ చెప్పాను?"

ఈ మాటకు కుసుమ నిశ్చేష్టురాలై పోయింది. అయినా వెంటనే తమాయించుకుంది. నెత్తిపైకి ముసుగు తీసుకొని గదిలోంచి చాప తెచ్చి వేసి, ఆమెకు నమస్కరించి నిలుచున్నది. పెద్దావిడ చాపమీద కూర్చొని యిలా ప్రసంగం మొదలెట్టింది.

"నిన్నను భోజనాలైనాక మా బృంద నవ్వుతూ అన్నాడు కదా—కుంజనాధుడు నా కెంతో ఆత్మబంధువూ దగ్గర చుట్టం. అయితేనేం, "మా ఇంటికి వచ్చి గుక్కెడు మంచినీళ్ళు తాగి వెళ్ళవయ్యా అని మాటసామెతకైనా అనలేదూ" అని! ఈ మధ్యనే మా ఆడబిడ్డా, పిల్లలూ కూడా వచ్చి, మా యింటోనే వుంటున్నారు. దానిమీదట కుంజు సంతోషంకొద్దీ "నువ్వొక్కడివే కాదు. అందరూ కలిసి రండి!" అంటూ విందుకి పిలిచాడు. అందుకోసమని వాళ్ళంతా వస్తున్నారు!" అని చెప్పింది.

మాటాడక తల దించుకుని నించుంది కుసుమ.

బృందావనుడి తల్లి సామాన్యురాలేం కాదు. అవలి స్తే పేగుల్లెక్కట్ట గలదు. ఏదో గొడవ జరిగివుంటుందని పసిగట్టింది. అందుకని సందిగ్ధంగానే—"ఏం అమ్మాయీ! కుంజ నీతో ఏమీ చెప్పి పోలే?" అనడింది.

ముసుగులోనించే తల వూగిస్తూ, లేదన్నట్టుగా సౌంజ్ఞ చేసింది. కాని పెద్దామె అది గ్రహించలేదు. కుంజ చెల్లెలితో చెప్పే వెళ్ళివుంటాడని అర్థం చేసుకుంది. సంతోషంతో "అయితే సరే" అన్నది.

"అదుగో, మనవాళ్ళంతా రానే వచ్చారు" అన్నది.

బయటినుంచే బృందావనుడు 'కుంజనాధ్' అని పిలిచి, పిలుపుతో పాటే వాకిట్లోకి వచ్చి నించున్నాడు. అతనివెంట మరి ముగ్గురు అబ్బాయిలున్నారు.

"కుంజ యిప్పుడే బయటికి వెళ్లాడు." అని చెప్పింది బృందావనుడి తల్లి. "అమ్మాయ్. లోపల చాప వెయ్—వీళ్ళు కూచుంటారు." అని అన్నది కుసుమతో.

కుసుమకు గుండె బేజారుగా వుంది. అన్న గదిలో చాప పరిచి తను వంటింట్లోకి వెళ్ళింది. ఆమె వెళ్ళటం చూశాడు బృందావనుడు. కుసుమ వంటింటోకి పోయి స్తంభాన్ని అనుకుని మెదలకుండా నిల్చుంది.

ఎంత తెలివిమాలినవాడు తన అన్న! తన నెలాంటి చిక్కులో పెట్టి వెళ్ళి పోయాడూ! కోపమొచ్చేసింది. అభిమానపడింది. సిగ్గుతో కుంగిపోయింది. ఎలారా దేవుడా—అని భయం! వీటన్నిటితో ఆమె కళ్ళవెంట గిర్రున నీళ్లు తిరిగేయి. చూదామంటే పిడికెడు బియ్యం కూడా కొంపలో లేవు. ఇవాళ పొద్దున స్నానం చేసుకురాగానే బియ్యంకోసం అన్నని బజారుకి పంపుదామనుకొంది. కాని, ఏదీ అన్న? పోయినవాడు మళ్ళీ ఏ రాత్రికి వస్తాడో! అతడి మాటకేం? ఇప్పుడు వెంటనే కనబడే గొప్పచిక్కు—ఆమెచేతిలో కానీ డబ్బు లేదు. ఏ ఉపాయమూ తోచక కాసేపు అలాగే నిలబడిపోయింది. తరవాత ఆమె కోపం అంతా బృందావనుడి వేపు తిరిగింది.

నిజం ఆలోచిస్తే తప్పంతా బృందావనుడిదే! తన అన్నను ఇంటికి పిలిచి భోజనం ఎందుకు పెట్టాలి? ఇద్దరికీ ఏం సంబంధం! ఏవో వంకల్తో అతనిటు వేపు ఎందుకు రావడం? వీళ్లు పేదవాళ్లనీ, ఎంతో దుస్థితిలో వుంటున్నారనీ అతడికి బాగా తెలుసు. అన్నీ తెలిసే—అవమానించాలని వచ్చివుండాలి. తనొక్కర్తే ఈ స్థితిలో ఏం చేయగలుగుతుంది?

బృందావనుడి తల్లి లేచింది. లోపలికి వెళ్ళి అక్కడ పిల్లల్తో మాటాడుతూవుంది.



బృందావనుడి చూపులు వంటింట్లో వున్న కుసుమ పైన పడ్డాయి. చూపుల్లో చూపులు కలిపిందామె.

తనను గాని పిలుస్తోందా—అనుకున్నాడు బృంద. కుసుమ నిజంగానే అతనివేపు చూస్తూ వుంది. చేత్తో సైగచేసి పిలిచింది కూడాను. తడబడే నడకతో బృంద వంటింటి గుమ్మం దగ్గరికి వెళ్ళాడు. "నన్ను పిల్చేవా?" అన్నాడు మెల్లిగా. కుసుమ "అవును" అంది కోమల స్వరంతో.

"ఎందుకు?"

"మేం పేదవాళ్ళమని తెలుసుకదా మీకు? మమ్మల్నిలా బాధించడం తగునా? కాస్త చెప్పండి!"

"ఏమిటీ అభాండం!"

"మా యింటి సంగతి తెలుసు, మాకెల్లా గడిచేదీ కూడా మీ రెరుగుదురు. ఇంతమంది నిలా భోజనానికి తీసుకు రావడ మేమన్నా బాగుందా మీకు?"

ఈ అభాండానికి ఏం సమాధాన మివ్వాలో బృందకు తోచలే. కాసేపాగి "కుంజ ఎక్కడా?" అనడిగేడు.

"తెలియదు. ఎక్కడికి పోయాడో!"

"పోనీ నేనున్నానుగా, ఏం వంటకమే లేదా ఇంట్లో?"

"ఏముంది? అంతా అయ్యవార్లంగారి నట్టిల్లు. చేతిలో ఎర్రని ఏగానీ కూడాలేదు!"

"సరే. బాధపడకు నాకీ వూళ్లో అందరూ తెలిసిన వాళ్ళే. కావలసినవన్నీ కొని

మోతీ చేతికిచ్చి పంపిస్తాను. ఓ తుండు ఇవ్వు నాకు. అమ్మ అడిగితే ఏటికి స్నానానికి వెళ్లానని చెప్పు. త్వరగా!'' అన్నాడు.

లోపలి కెళ్లి తుండు తీసుకొచ్చి ఇచ్చింది.

కుసుమ తెచ్చిన తుండు సరదాగా తలకు చుట్టుకున్నాడు. బృందావనుడు నవ్వుతూ ఇలా అన్నాడు: ''నువ్వు కుంజుడికి చెల్లెలివి గదా? అంచేతనే అతడు నిన్ను వది లేసి పారిపోగలిగాడు. మరొహరెవరన్నా అయితే—నిన్నిలా వదిలిపెట్టి పారిపో గలిగే వారా?''

'మీరన్నట్టు అందరూ అలా చెయ్యరేమో గానీ—మహదానందంతో వదిలి పెట్ట గలవారూ కొంతమంది లేకపోలేదు!'' అంది నెమ్మదిగా కుసుమ.

''నీ భ్రమ ఎప్పటికైనా తొలగిపోతుంది. మీ తల్లి కళంకానికి నువ్వు బాధ్యు రాలివి కాదు గదా! అలాగే మా తండ్రి తప్పిదానికి నేను బాధ్యుడినిగాను. అయినా, ఇప్పుడా గొడవెందుకు? నన్నయితే నీ ఇష్టమొచ్చినట్టను. నేనేమీ అనుకోను. ఈ కోపంతో మీ అత్తగారిని మాత్రం యేమీ అనబోకు!'' అన్నాడు.

''నే నేమంత బొత్తిగా పశువు ననుకున్నారా? నాకూ కాస్తో కూస్తో బుద్ధీ, జ్ఞానం వున్నది!'' అంది కోపంగా.

''అది తెలుసులే. వాటికన్నా నీకు కోపం ఎక్కువన్న సంగతి కూడా తెలుసు. అన్నట్టు అమ్మ స్నానం చేసుకు వచ్చింది గాని పూజ యింకా కాలేదు. ఆ ఏర్పాటు చూడు! నే వెళ్తున్నా.'' అని వెళ్ళిపోయాడు.

బృందావనుడు వెళ్ళిపోయాక, కుసుమకి పాతపురాణాలన్నీ గుర్తొచ్చేయి. ఒళ్ళంతా కంపించిపోయింది. వంటింటోకి వెళ్ళి స్థిమితంగా కూర్చుంది.

ఇప్పటిదాకా తన విద్యాగర్వంతో, ఎవరినైతే చదువురేని పల్లెటూరి హైతుగా ఎంచిందో, ఎవరినయితే లక్ష్యం లేకుండా మసులుకుందో, ఆ వ్యక్తి ఈ నాడు తనతో ఎంతో చక్కగా హితవుగా మాటాడాడు. అతడి మాటతీరూ, ప్రవర్తనా ఆమె మన స్సుకి హత్తుకున్నాయి. ఇప్పుడు కుసుమకు బృందావనుడి గురించి ఒక కొత్త వుత్సాహం, కొత్త ఆనందం కలిగాయి.

# 3

విందు భోజనాలయ్యేక బృందావనుడి తల్లి కుసుమను దగ్గరసా పిలిచింది. ''ఇక్క డున్నంతసేపూ ఎంతో హాయిగా గడిచింది అమ్మాయీ! ఎప్పుడూ నువు క్షేమంగా సుఖంగా వుండాలనేదే నా కోరిక. అదే నీకు నా ఆశీర్వాదం తల్లీ!'' అని



చెబ్తూ, తన పైట చెంగు నుంచి ఒక బంగారపు గాజుల జత తీసి ఎంతో అభిమానంగా కుసుమ చేతులకి తొడిగించి. కుసుమ ఆమెకి నమస్కరించి, పాదధూళి తీసుకు శిరస్సున వుంచుకుంది.

తిరుగుప్రయాణం కోసం అత్త బండీమీద కూర్చున్నాక, కోడలితో ఇలా అంది: ''కుంజు యివాళల్లా కనబడనేలేదే అమ్మా! రేపోమాటు మనింటికి రమ్మను'' అన్నది.

* * *

బృందావనుడి తాతగారు మంచి భక్తుడు. ఇంట్లో ప్రార్థనకోసమని ఆయన గౌరాంగ మహాప్రభు విగ్రహాన్ని ప్రతిష్ఠించివున్నాడు. రోజూ బాగా పొద్దు పోయేదాకా తల్లి ఆ విగ్రహంముందు కూచుని, జపం చేసుకుంటూ వుంటుంది.

రోజూలాగే యివాళ ఆవిడ జపం చేసుకుంటూ వుంటే, మనవడు ఒళ్ళో పడుకుని నిద్రపోయాడు. ఈ లోగా బృందావనుడు కూడా అక్కడికి వచ్చాడు. మోకరించి కూచుని విగ్రహానికి నమస్కరించేడు. లేచినిలబడే సమయాన అతడికి తల్లి అక్కడున్నట్టు దృష్టి గోచరమైంది.

''ఈ చీకట్లో కూర్చున్నావేమిటమ్మా?'' అన్నాడు నవ్వి.

"మరేం లేదురా నాయనా! అవునుగానీ ఇలా దగ్గరగా రారా బాబూ!" అంటూ ప్రేమగా పిలిచింది.

ఈ నాడు బృందావనుడి హృదయం ఆనందంతో పరిపూర్ణమయింది. తన ఆశకు మీరిన అదృష్టం కలిసొచ్చిందని అతని భావన.

"నాయనా బృందా!—తల్లిలేని ఈ బిడ్డదిని వొదిలిపెట్టి, ఎక్కడికీ నేను కాలు కదపటానికైనా వీల్లేదుగదా! వెళ్ళి ఆమెని తొందరగా యింటికి తీసుకొచ్చెయ్. ఈ వేళంబం అంతా ఆవిడకి అప్పచెప్పి, నేను కొన్నాళ్ళపాటు కాశీ, బృందావనం యాత్రలు చేసుకువస్తానురా, బాబూ!" అన్నది ఆమె.

బృందావనుడిలోకూడా ఈనాడు ఆశాలతలు పెనవేసుకుని చుట్టుకుంటున్నాయి. ఒకవంక సిగ్గు వెనక్కి లాగుతున్నది. "ఆమె మనింటికి ఎందుకు వస్తుందమ్మా?" అన్నాడు.

"ఎందుకు రాదురా, బృందావన్? ఆమె వస్తేనే నాకు మనశ్శాంతి. ఇన్నాళ్లూ మనం అక్కడికి వెళ్ళకపోవడం మనదే పొరబాటు. వచ్చేప్పుడు—ఆమె చేతులకి బంగారు గాజులు తొడిగి ఆశీర్వదించి మరీ బయలుదేరాను. నా పాదధూళి శిరస్సున పెట్టుకుని ఎంతో వినయంగా నించుంది. అలాగే చూస్తూ వుండు. మంచిరోజున గృహలక్ష్మిని మనింటికి తీసుకు వచ్చేస్తా" నన్నది బృందావనుడి తల్లి.

అతడూ కొంచెంసేపు వూరుకొని, తర్వాత ఇలా అన్నాడు: "అవును. తీసుకొస్తావ్. బాగానే వుంది. ఆమె వచ్చి నీ మనవడిని చేరదీస్తుందా అని?"

"చేరదియ్యకేం? తప్పక తీస్తుంది. నాకా నమ్మకం వుంది. అవునుగాని బృందా, కోడలు నీతో ఎప్పుడయినా మాటాడుతుందా?"

"లేదమ్మా, ఎప్పుడూ మాటాడదు. కాని ఇవాళమాత్రం చిక్కనపడే ..." అంటూ నవ్వి వూరుకున్నాడు.

"నిజమేనురా నాయనా, అదంతా నిజమే! అందులో ఆమె తప్పేం లేదు. మనిషికి కష్టసమయంలోనే తనవాళ్లు జ్ఞాపకానికొస్తారు. సాటి ఆడదాన్నయినా, నాతో ఏమీ చెప్పకుండా, నీతో చెప్పింది చూడూ!" అన్నది.

ఏమీ బదులు చెప్పకుండా వింటున్నాడు బృంద.

"ఇదే గాకుండా మరో పనికూడా వుంది నాకు. కుంజూడి పెళ్ళి చెయ్యాలి." అని చెప్పి ఆవిడ తనలో తను నవ్వుకుంది. "ఊరందర్నీ విందుకు పిలిచేసు వెర్రి నాగమ్మ. తీరా పిలిచి, ఏమైనా కానిమ్మని ఇల్లు వొదిలిపెట్టేసి పారిపొయ్యాడు!" అన్నది.

నవ్వుకున్నాడు బృందావనుడు.

"కుంజుడికి మన కోడలంటే చెప్పలేని భయంట. అన్నయ్య చెల్లెలికి ఝడవటం యెక్కడైనా వుందా? ఒక్కొక్కళ్ళ రేఖ అంత ఘనంగా వుంటుంది, బృందా! ఎంతో శాంతస్వభావం గల మనిషి, అయినా నిక్కచ్చి. నా కలాంటివాళ్లే నచ్చుతారు. ఆమె నెత్తిన మనం భారం వేస్తామనుకో, దాన్ని ఎత్తి మోయగల సత్తా వుండొద్దూ? ఆనాడే గదా నేను సంసారం వదిలేసి, నిశ్చింతగా ఎక్కడికైనా వెళ్ళగలగటం?!" అంది.

కాసేపు మౌనంగా వుండి మళ్ళీ చెప్పింది—"ఒక్కమాటు చూసేసరికే, ఒక్క రోజు సంభాషణ తోటే ఆమె మీద నాకెంత మక్కువ కలిగిందో చెప్పలేనురా, నాయనా! కోడల్ని ఎప్పుడు తీసుకువస్తావా, మళ్ళీ ఎప్పుడు చూస్తానా అనే ఆలోచనే, సాయంత్రం నుంచీన్నీ "

ఈ ప్రసంగంతో లోలోపల సిగ్గుపడ్డాడు బృందావనుడు. మాట మార్చటానికి ప్రయత్నిస్తూ ఇలా అడిగేడు: 'అమ్మా!—ఏమిటో కుంజునాదుణ్ణి గురించి చెప్ప బోయావ్?"

"అవున్రా బాబూ, మర్చేపోయాను. చూడూ! కోడల్ని మనం ఇంటికి తెచ్చు కునే ముందు కుంజుని ఒక ఇంటివాడిని చేయడం మనవిధి. రేపుదయం గోపాల్‌తో బండి తెమ్మను. నేనోసారి నాపడంగా వెళ్ళి వస్తా. ఆ గోకుల్ బైరాగీ కూతురు నాకు బాగా నచ్చింది. చూపులకీ బాగానే వుంటుంది. అదీగాక ..!"

మాట పూర్తి కాకుండానే బృందావనుడు నవ్వి ఇలా అన్నాడు: "అదీగాక— ఆమె ఒక్కగానొక్క కూతురు. అవునా అమ్మా? ఆ బైరాగీ బాగా గడించి పోయాడు కూడా."

తల్లి నవ్వింది. "మరేన్రా నాయనా! నువ్వన్నది నిజమే. ముందు డబ్బు అవ సరం కుంజుకు. ఊరికే పెళ్ళి చేసేసి వూరుకుంటే సరిపోతుందా! తిండికీ బట్టకీ వుండాలిగా కాస్త? ఆ అమ్మాయి కూడా గుణవంతురాలేనుట. ముఖంలో లక్షణ మైన కళవుంది. రేపుదయం అక్కడికి వెళ్ళొస్తాను!"

తల వంచుకున్నాడు బృందావనుడు "సరేనమ్మా, మంచిదే. ఆ శుభఘడియ కోసమే నేనూ ఎదురుచూస్తున్నా. నువు బయల్దేరి వెళ్లావంటే ఊరికే రావని నాకు తెలుసులే" అని చెప్పాడు.

## 4

చండీ మండపం దగ్గర పిల్లలంతా ఒక పంక్తిగా నిలబడి ఎక్కాలు ఏకరువపెట్టు

న్నారు. ఓ పక్కని నించుని బృందావనుడు జాగ్రత్తగా వింటున్నాడు. ఇంతలో బండి వచ్చి ఆగింది. ఆగగానే బృంద కొడుకు చరణుడు దిగి, గల్లంతు చేస్తూ తండ్రి దగ్గరకు పరుగెత్తాడు. మామకి పిల్లని కుదర్చటానికి మనవడు కూడా నాయనమ్మ వెంట వెళ్లాడన్నమాట! - పసివాడిని చంకనెత్తుకుని బండి దగ్గరకు వెళ్ళాడు....నవ్వుతూ బండి దిగుతూ వుంది బృందావనుడి తల్లి. ''లగ్నం ఎప్పుడు కుదిరిందమ్మా?' అంటూ ఆత్రంగా అడిగాడు.

''వ్యవధికూడా ఎంతో లేదురా నాయనా! ఈ నెలాఖరులోగానే. దా లోపలికి'' అంటూ నవ్వుముఖంతో ఇంటోకి వెళ్ళింది.

''నాయనా బృందా!—వంటసంగతి ఇహ సాయంకాలమే, నిజంగానే అంటున్నా. పెళ్లికి వ్యవధి ఆట్టే లేదని తెలుసుకదా నీకు? పాపం, ఆ వెర్రివాడు కుంజు చేత డబ్బులేదు. కనక అన్నివిధాలా అదంతా మన నెత్తిమీదే వుంది....ఆ అమ్మాయి తల్లి మహాగడుసు. ఓ పట్టాన ఒప్పుకోలేదు దేనికీ....అదిగో, మాట లోనే వచ్చాడు. నా తండ్రి! వెయ్యేళ్లాయుస్సు. నీ గురించేరా కుంజూ ఇప్పుడు చెప్పుకుంటున్నాం. రా కూర్చో. తలవని తలంపుగా వచ్చేవే ఏమిటీ సంగతీ?''

గదిలోపలికి వెళ్ళగానే తనకి జరిగిన ఆదరసత్కారాలకు పరవశమైపోయాడు కుంజు. పరధ్యానంగా ఆమె దగ్గరికి వచ్చి నమస్కరించి కూర్చున్నాడు.

''బాబో అది నాకు చెల్లెలు కాదు. బ్రహ్మరాక్షసి'' అన్నాడు కుంజు కళ్లు చిట్లించుకుంటూ.

ఇది విని బృందావనుడు మొహం తిప్పేసుకుని, నవ్వు దాచిపెట్టుకున్నాడు. వచ్చే నవ్వు ఆపుకొంది అతడి తల్లి. ''కోడల్నేమన్నా అన్నదా యేం?'' అనడిగింది.

''యింకా నయం. కుసుమ చూసింది గనుక సరిపోయింది. ఇంకెవరి దృష్టి పడినా దొరికేవా!''

కుంజు చెప్పినదాంట్లో ఒక్కముక్క కూడా ఆమెకి అర్థం కాలే. అలాచూస్తూ వుండిపోయింది.

''నీదేమయినా పోయిందా?'' అనడిగాడు కుంజు మళ్ళీ.

''నాదేమీ పోలేదే'' అన్న ఆమె మాటలకి కుంజు పకపకా నవ్వేడు. చెంగు లోంచి ఒక బంగారు గాజుల జతతీసి ''అయితే యివి మీవి కావూ?'' అన్నాడు.

అవి తను ఆశీర్వదిస్తూ కోడలి చేతులకి తొడిగినగాజులు! అవి తన అన్నగారి చేతికిచ్చి తిప్పి కొట్టింది కోడలు!! ఒక్కక్షణం వాటికేసి చూశాడు బృందావనుడు. తల్లివేపు చూశాడు. తనని తాను సంబాళించుకుని, తల్లి దగ్గరగా జరిగి, శాంతంగా

 యు: వ



" గురూ, నేను నీకు గుర్తున్నానా? సంవత్సరం కిందట ఇదే హోటల్లో ఇదే కుర్చీలో కూర్చుని తిన్నాను. బిల్లు ఇవ్వడానికి డబ్బుల్లేకపోతే—నువ్వే నన్ను ఆ మురిక్కాలవలోకి విసిరేసేవ్...."

" అవునండి. ఏదో పొరపాటు అయిందండి "

" ఫర్వాలేదులే. మళ్ళీ మరోసారి నన్నలా బైటికి విసిరెయ్యి."

---

ఇలా చెప్పాడు : "అమ్మా. ఇదీ మన అదృష్టమే అనుకో. మన సొమ్ము మనకే చేర్చాడు ఆ భగవంతుడు, ఇవి నీ చేతి గాజులు కదా! వీటిని పెట్టుకునే యోగ్యత ఆమెకు ఉండొద్దూ?"

ఇలా అంటూ "పద, కుంజ్!—మనం బైటికి పోదాం?" అని చెప్పి చెయ్యి పట్టుకుని అవతలికి తీసుకువెళ్లాడు.

"పోయిన వస్తువు మళ్ళీ దొరికిందనేప్పటికి వారెంత సంతోషిస్తారో" అనుకున్నాడు కుంజు. కాని ఇప్పుడు జరిగినదంతా అందుకు విరుద్ధంగా వుంది. ఇందు గురించి బృందావనుడి నోటివెంట ఒక్క మంచి మాట వెలువడలేదు. దాంతో కుంజు మాటాడక కూర్చుండిపోయాడు. బృందావనుడూ ఏమీ మాట్లాడలేదు. అతడి హృదయం అప్పుడు అవమానాగ్నితో దహించుక పోతూంది.

సాయంకాలపు చీకటి ఇంకా దట్టంగా అలముకుంటూంది. కుంజు మెల్లిగా బృందావనుడితో యిలా అన్నాడు: "అయితే, మరి వెళ్ళి వస్తాను బావా!"

"సరే వెళ్ళిరా! ఎప్పుడయినా వచ్చి పోతూండు" అని కుంజు వేపు వెర్రిగా చూస్తూ జవాబు చెప్పాడు.

కుంజునాధుడు వెళ్ళిపోయాడు.

* * *

నిన్నటి పగటిపూటంతా తన ఆత్మీయుల మధ్య ఎటువంటి అరమరా లేకుండా

గడపడంతో కుసుమ హృదయం ఆనంద పరవశమై పోయింది . .ఆ బంధాన్ని ఇవాళ తన చేతుల్తో తనే తుంచేసింది! అత్త ఆశీర్వాదంతో తను బహుమానంగా పొందిన ఆ గాజుల జతను తిప్పి పంపిద్దామన్న పెద్ద సంకల్పం కలిగింది. అవి తీసుకెళ్ళి తన తెలివితక్కువ అన్న చేతికిచ్చింది. ఈ చేష్ట వారిని నిరాశలో, నిస్పృహలో ముంచి వేసినట్టు స్పష్టంగా ఆమె కళ్ళకి కట్టింది. కనకనే భరించరాని బాధతో గదిలోకి పోయి ఎంతగానో ఏడ్చింది!

పొద్దు పోయేసరికి అన్నగారు కుంజనాధుడు తిరిగి వచ్చాడు.

లాంతర్లో చమురు పోసి దీపం వెలిగించింది. రోజూలాగే అన్నకు అన్నం వడ్డించి దూరంగా కూర్చున్నది. ఎప్పుడూ వటవట వాగే కుంజు మౌనం కుసుమలో సందేహం రేపింది. ఏదో అనిష్టకార్యం జరిగిందని దృఢపర్చుకుంది. భోజనం ముగించిన అన్నతో ఇఖవుండ బట్టలేక ''అన్నయ్యా!—ఆ గాజులు ఎవరి చేతికిచ్చావ్?'' అనడిగింది.

''ఇంకెవరికి! అత్త చేతికే!'' అన్నాడు.

''ఆమె ఏమన్నది?''

''ఏమీ అనలేదు!'' అంటూ అతను బయటకి వెళ్ళిపోయాడు.

*  *  *

మర్నాడు—

వ్యాపారం మీద బేరానికని వెళ్తూ వెళ్తూ అతడు కుసుమను పిలిచాడు.

''అంత విలువైన వస్తువు చేతిలోపెట్టాను గదా, మీ అత్తగారు నోరు విప్పి ఒక్క మాటైనా అనలేదే! అయితే బృంద మాత్రం సంతోషించాడు. తల్లితో ఇలా అన్నాడు : ''నీ చేతి గాజులు పెట్టుకునే యోగ్యత మాత్రం ఉండొద్దూ! పోనీ—మన వస్తువు మనకే చేరిపోయిందిలే. అదీ మన అదృష్టమే!''—అని ... ఇందులో అర్థమేమిటో నీకేమన్నా తెలుసా చెల్లీ?'' అనడిగాడు.

కుసుమ ముఖం ఒక్కసారిగా నల్లబడిపోయింది. ''ఏమీ లేదులే. ఆయనే అన్నాడా ఈమాట?'' అంది.

''అవును. అతనే అన్నాడు. అత్త అసలు పలకనే లేదుగా. అదీగాక—ఉదయాన్నే, ఎక్కడికి వెళ్ళివచ్చిందో యేమో, నేను వెళ్ళేప్పటికింకా స్నానం లేదు. భోజనం లేదు. నేనేం చెప్పానో—చేతికి ఏమిటి యిచ్చానో అర్థం కానట్టుగా చూసింది'' అని చెప్పి కుంజు గంపనెత్తుకుని బయటికి వెళ్ళిపోయాడు.

*  *  *

మూడు నాలుగు రోజులు గడిచిపోయినై.

వంట సరిలేదని చెప్పి నిన్నా, మొన్నా కుంజు మొహం ముడుచుక్కూచున్నాడు. ఇవాళ తెగించి అడిగేటప్పటికి, ఇద్దరి మధ్యా పేచీ బయల్దేరింది.

"నీ మనసు ఎక్కడ వుంటూందేం?" అని సణగడం ప్రారంభించాడు కుంజు.

కుసుమకి చాలా కోపం వచ్చింది. "ఇంతకంటే నా చేతకాదు. బాగా వండే వాళ్ళెవరైనా వుంటే చూసి తెచ్చుకో!" అనేసింది.

కుంజుకి ఆకలి దహించుకు పోతూంది. ఇదివరకట్లా ఇవాళ చెల్లెలికి భయపడ లేదు. వేలెట్టి బైటికి చూపిస్తూ....ముందు నువ్విక్కడ్నుంచి వెళ్ళిపో—పో! అప్పుడు చూతువుగాని నే తెస్తానో లేదో!—" అంటూ ఆవేశంతో పెట్టె నెత్తిన పెట్టుకుని తొందర తొందరగా బయటికి వెళ్ళిపోయాడు.

అన్నగారికి వడ్డించిన కంచం ఆ మట్టునే పడుంది. ముందు వాకిలి అలానే తెరిచి పెట్టి వుంది. కుసుమ మాత్రం వంటింటి వాకిట్లో గుమ్మం మీద కలపెట్టు కుని ఏడుస్తూ వుంది.

# 5

పది గంటలైంది. అప్పటిదాకా కుసుమ ఏడుస్తూనేవుంది. ఏడ్చేడ్చి సొమ్మసిలి పోయింది. ఆ స్థితిలో ఆమెకు నిద్ర పట్టేసింది.

ఆ నిదట్లో ఎవరిదో పిలుపు వినిపించింది. లేచి చూస్తే బృందావనుడు. అతడి వెంట అందాల పసివాడొకడున్నాడు. ఆ చక్కటి పిల్లవాడికి అయిదారేళ్ళుంటాయి.

తొలి చూపుకే కుసుమ గ్రహించింది—ఆ పసివాడు తన పతి సంతానమని! కళ్ళ నీళ్ళు తిరిగి హృదయం ఆర్ద్రమైంది. ఆ పిల్లవాడికేసి చూస్తూ శిలాప్రతిమలా వుండి పోయింది.

తన పిలుపుకి ఎలాంటి అలికిడీ లేకపోయేటప్పటికి, బృందావనుడు ఆశ్చర్యపడ్డాడు. కుంజుతో అవసరమైన పనివుండి వచ్చాడతను. చరణుడు కూడా సరదాగా తండ్రి వెంట పడ్డాడు.

"ఇంట్లో ఎవరూ లేరా?" అన్నాడు బృంద మళ్ళీ.

ఈ మాటూ సమాధానం రాలేదు.

"నాన్నా, దాహం. మంచినీళ్ళు కావాలి!" అన్నాడు చరణుడు.

"దాహం లేదు. నీళ్లూ లేవూ. ఇహ పోదాంలే. దార్లో ఏరుంది. ఏట్లో తాగుదువు గానీ!" అని చెప్పి కుర్రవాడిని వూరడించాడు తండ్రి.

బిక్క మొహం వేసి వూరుకున్నాడు పిల్లవాడు.

ఇపుడు కుసుమ శరీరమంతా సిగ్గుతో కుంగిపోతూవుంది. కుఱ్ఱవాడు మంచినీళ్ళు అడగబట్టిగాని, యివతలికి వచ్చేదే కాదేమో! మరుక్షణంలో ఓ చిన్న చాప తెచ్చి వరండాలో వేసింది. వెంటనే పసివాడిని చంకనేసుకొని లోపలికి వెళ్ళిపోయింది!—

కుఱ్ఱవాడు కుసుమను వింత చూపులు చూస్తున్నాడు. ఇప్పుడిప్పుడే తనకి తండ్రి విదిలింపులు తగిలాయి. రెండోది: అలా గభీమని వచ్చి తనని యెత్తుకున్నవారెవరు? ఇదేం తెలియక పసివాడు కొత్తగా చూస్తున్నాడు....పసివాడికి మిఠాయిలు పెట్టింది కుసుమ. వాడ్ని కాసేపు అదేపనిగా చూసి, గుండెకు అదుముకుని ఏడ్చింది. ఆమె బంధం నుంచి తప్పించుకోవాలని కుఱ్ఱాడు పెనగులాడాడు. అది చూసి కుసుమ కన్నీళ్లు తుడుచుకొంది. "రారా, రాజా!—నేను మీ అమ్మనురా!?" అన్నది.

ఇప్పుడామె హృదయం బద్దలైపోతూ వుంది. ఈ అందాల బిడ్డడు—చరణుడు—తన కడుపున పుట్టిన బిడ్డడు కావలసింది. కాని కాలేదు. ఎవరు కానివ్వలేదు? బిడ్డను ఎంతగానో హత్తుకుంది కుసుమ అయినా ఆ మాతృ హృదయానికి ఊరట కలగటం లేదు.

"వదిలెయ్!" అన్నాడు పసివాడు.

వాడి మొహం రెండు చేతుల్లోనూ యిముడ్చుకుంది.

"అమ్మా! అను ఒదిలిపెడ్తా!" అన్నది.

తల అడ్డంగా తిప్పి అంతలో మళ్ళీ ఏమనుకున్నాడో ఏడుపు మొహం పెట్టి "అ....మ్మా...." అన్నాడు.

కుసుమ మరోసారి వాడ్ని వక్షానికి అదుముకుంది.

"బాబూ, ఇంకా మంచినీళ్ళు తాగలే?" అన్నాడు బృందావనుడు బయటినుంచి.

కుసుమ కన్నీళ్ళు తుడుచుకు వచ్చింది. "ఇవాళ చరణుడు మా యింట్లో వుంటాడు!" అని చెప్పింది.

"అదెలా కుదుర్తుంది? వాడింకా తిండి తినలే!"

"అఁహఁ. వాడిక్కడే వుంటాడు. బండిని పంపేయండి. బాబుని తీసుకెళ్ళి ఏట్లో స్నానం చేయించుకొస్తా?" అంది.

నూనె గిన్నె, అంగాస్త్రం తీసుకొని, పసివాణ్ణి చంకనేసుకొని ఏటికి వెళ్ళిపోయింది.

* * *




వాళ్ళింటి వెనకాలే ఒక చిన్న ఏరు పారుతూంది. అది చూడగానే కుర్రవాడు ఉబ్బొంగిపోయాడు. ఒడ్డున కూర్చుని చక్కా నూనె రాయించుకున్నాడు. తనివితీరా నీళ్ళలోకి దుమికాడు. అటూ యిటూ గెంతాడు. స్నానమయింది. కుసుమ చంక నెక్కాడు.

బిడ్డని చంకనేసుకొని కుసుమ బృందావనుడి ఎదుటికి వచ్చింది. "సరే, మీ రెళ్ళి స్నానం చేసిరాండి" అంది.

'ఆ తర్వాత?"

"భోంచేద్దురుగాని."

"ఆ తర్వాత?"

"విశ్రమిద్దురుగాని."

"ఆ తర్వాత—?"

"అదేమో నాకు తెలీదు. ఇదుగో అంగాస్త్రం. వెళ్ళి వేగిరం రండి" అంటూ అంగాస్త్రం అతనిమీదికి విసిరింది.

"బాబుకి చప్పున అన్నం పెట్టెయ్యి. నే నింటికి వెళ్ళాలి."

అతనిలా అనగానే కుసుమ ముఖం నల్లబడిపోయింది. అతికష్టంమీద కన్నీళ్ళాపు కొంది. బిడ్డని చంకనెత్తుకొని గది లోపలికి వెళ్ళిపోయింది....

ఓ గంట గడిచేక—

తండ్రీ కొడుకూ బండిమీద యింటికెళ్తున్నారు. దార్లో పిల్లవాడు అడిగాడు. "ఎందుకు నాన్నా, అమ్మ అలా ఏడుస్తుందీ?"

ఈ ప్రశ్నకు చకితుడయ్యాడు బృంద. "ఆవిడ మీ అమ్మ అని యెవరు చెప్పార్రా బాబూ?"

"అది మా అమ్మే కదు, నాన్నా!" అన్నాడు నమ్మకంగా.

"అయితే బాబూ, నువ్వు మీ అమ్మదగ్గర వుండిపోగలవూ?" అనడిగాడు.

తల ఆడిస్తూ "ఓ వుండగలను" అన్నాడు పసివాడు, పట్టరాని సంతోషంతో.

* * *

మర్నాడు మూడు ఝాముల వేళప్పుడు ఏటికని బయల్దేరింది కుసుమ. అంతలో ఓ పన్నెండేళ్ళ కుర్రాడు ఎదురై "పంతులుగారు వుత్తరమిచ్చి పంపారండి. బాడల నుంచి వస్తున్నానండి" అని చెప్పి, ఓ వుత్తరం తీసిచ్చేడు

ఉత్తరం పైన అన్నగారి పేరుంది. రాసింది బృందావనుడు. అందులో బోలెడు గ్రంథం వుంది. కుసుమకు నెత్తురు వుడుకెత్తింది. "అబ్బాయీ, ఎవర్ని నువ్వు పంతులుగారంటున్నావ్? ఉత్తరం యిచ్చిందెవరూ?" అనడిగింది ఆత్రంగా.

దిగాలు పడ్డాడు కుర్రవాడు. "పంతులుగారు యిచ్చారండి!" అన్నాడు మళ్ళీ.

పాఠశాల గొడవ కుసుమకి అసలేం తెలియదు. అంచేత కుర్రవాడి మాట ఆమె కేమీ అర్థం కాలేదు.

"చరణ్ తెలుసా? వాడి తండ్రి నెరుగుదువా?" అంది.

"ఎందుకు తెలీదండి? వారేగా పంతులుగారు!"

ఇప్పుడీ మాటలు వినగానే కుసుమకి మరెంతో కుతూహలం కలిగింది. ఆ అబ్బాయిని లక్ష యక్ష ప్రశ్నలు వేసింది. ఎన్నెన్నో భోగట్టాలు అడిగి తెలుసుకుంది.

"పంతులు గారింటోనే బడి. అందులో చదువుకునే పిల్లలకి జీతాల్లేవు. పైగా వాళ్ళకి కావలసిన పలకా బలపాలూ, పుస్తకాలూ అన్నీ పంతులుగారే కొనిస్తారు. పొలం పని చేసుకొనే రైతు బిడ్డలకి పగలు తీరిక దొరకదు. వాళ్ళకి రాత్రిపూట చదువు చెప్పిస్తారు. ప్రత్యేకించి ఇంగ్లీషు చదివే పెద్ద వయస్సు కుర్రాళ్ళు కూడా యిద్దరున్నారు!"

ఈ విషయాలన్నీ కుసుమ ఆ కుర్రవాడినుంచి తెలుసుకొంది. కాస్త చిరుతిండి పెట్టి పంపించేక, ఉత్తరం తీసి చదవటానికి ప్రారంభించింది....

* * *

ఉత్తరం చదివేక——

తను కంటూన్న తియ్యటి కలలన్నీ చెరిగిపోయినట్టనిపించింది.... ఇది ఆమెకు అతడు రాసిన మొట్టమొదటి వుత్తరం. ఇందులో శ్రీరాములు దగ్గర్నుంచీ చిత్తగించ

వలెను వరకూ ఒకే విషయం వుంది. కుంజనాథుడి వివాహ విషయం!

నిన్ననే బృందావనుడు యిక్కడికి వచ్చింది, ఈ సంగతి మాట్లాడ్డానికే!

"కుంజునాథుడి వివాహం అమ్మ నిశ్చయించింది. పెళ్ళి ఖర్చంతా తనే పెట్టుకుంటుంది. ఈ పెళ్ళి వెంటనే జరగడం అన్నివిధాలా మంచిది, క్షేమకరం! దీంతో కుంజనాధుడి కష్టాలు గట్టెక్కుతాయి. కుసుమ దుఃఖాలు తొలగిపోతాయి ..." అని వుత్తరంలో స్పష్టంగా రాసివుంది

ఉత్తరం ఒకసారి చదివింది కుసుమ. మళ్ళీ చదవాలనుకోగా, కళ్ళముందర అక్షరాలు నాట్యం చేస్తున్నట్టు కనిపించాయి .ఉత్తరం మూసేసింది ...ఉత్తరంలో వున్న ఈ శుభవర్తమానం కుసుమలో ఏపాటి సంతోషాన్నీ కలిగించలేక పోయింది!

# 6

ఇప్పటికి సరిగ్గా కుంజనాథుడి వివాహం జరిగి నెలరోజులైంది.

ఆనాడు రావడమే తప్ప బృందావనుడు మళ్ళీ రాలేదు. అతడికి జ్వరం వచ్చిందిట. అయితే అతడి తల్లిమటుకు చరణుడిని వెంటపెట్టుకుని వచ్చింది. చరణ్ ఆ తర్వాత కూడా అయిదారు రోజులుండిపోయాడు. కొత్తగా అమ్మ దొరికిందిగా! పైగా ఆ వూళ్ళో ఏరుంది. అందులో ఈతలు కొట్టవచ్చు. ఈ ఆకర్షణలవల్ల ఇక్కడే వుండి పోతానని మంకుపట్టు పట్టేడు. ఇంటికి బలవంతాన తీసుకుపోవల'

వాడు వెళ్ళిపోయిన క్షణంనుంచీ కుసుమ జీవితం దుర్భరమై

* *

అన్న సంగతి కుసుమకి బాగా తెలిసిందే. తన ఆసరాతో నడుస్తు భారాన్ని ఏ క్షణమందైనా ఇట్టే కాలదన్ని, అత్తగారింటికి పోతాడ! అనుకుంది. సరిగ్గా అదే జరిగిందిప్పుడు.

మునుపటిలా తట్ట నెత్తిపై పెట్టుకొని తిరుగడానికి అతను ఇష్ట —వనుడి తల్లి ఇతని పెళ్ళి సమయంలో కొంత పైకమిచ్చింది. అందులో ... సొమ్ము పెట్టి సరుకు కొన్నాడు. తక్కినదాంతో బజారుమొగిని ఒక వసారాలాంటిది వేసుకొని అందులో గాజులదుకాణం పెట్టుకుని గౌరవంగా వృత్తి సాగించాలనుకున్నాడు. దుకాణమైతే పెట్టాడుగానీ కానీ అమ్మకమైనా లేకుండాపోయింది. పెళ్లయిన ఈ కొద్దికాలంలోనే కొత్తబట్టలు కట్టుకొని, కిర్రుచెప్పులు తొడుక్కుని, అత్తారింటికి మూడు నాలుగుసార్లు వెళ్ళొచ్చేశాడు! మొదట్లో అతడు చెల్లెలంటే ఎంతో భయపడే వాడు. ఇప్పుడదంతా యెగిరిపోయింది.

ఇదివరకటిలాగా కుసుమ "అన్నయ్యా! ఇంట్లో బియ్యం నిండుకున్నాయ్!" అంటే ఇప్పుడేం పట్టించుకోడు. మౌనంగా ఏ దుకాణంమీదికో పోయి ఊసులెట్టు కుంటూ కూర్చుంటాడు. ఒకో అప్పుడు రోజంతా ఇంటికి రాకపోవడం కూడా కద్దు.

ఈ వాలకమంతా చూడగా ఆమె చాలా భయపడింది. గుండె బేజారైంది. ఆమె వెనకేసుకున్న నాలుగురాళ్లూ సంసారంలోనే పడిపోయినై.

పగటిపూటంతా చుట్టలు కాల్చడం. కాలుస్తూ అత్తారిగురించి గప్పాలూ బడాయిలూ కొట్టడం. ఇదీ కుంజనాధుడి వరస!

* * *

పొద్దుట లేవంగానే కుంజు కిర్రుచెప్పులకి చమురు రాస్తూ కూచున్నాడు. వంటింట్లోంచి బైటికి వచ్చిన కుసుమ అన్నకేసి మిర్రి చూసింది. "మళ్ళీ ఇవాళ నాకడాంగా ప్రయాణంలాగే వుందే!" అనడిగింది. "అవును" అనేసి కుంజు మళ్ళీ తన ధ్యాసలో మునిగిపొయ్యాడు.

కొంచెం సేపయ్యాక, కుసుమ ఎంతో మంచిగా ఇలా అంది: "అన్నయ్యా! మొన్ననేగా వెళ్ళొచ్చావ్. కుర్రవాడి సంగతులు తెలిపి చాలా రోజులైంది. మనసేం బాగులేదు. ఒక్కసారి వెళ్ళి వరణ్ బాబుని చూసివద్దూ!"

ం చిట్లించుకున్నాడు. "వాడికేం? వాడు బాగానే వుంటాడు!" అని

ళ్ళే. సరే. అయినా ఒక్కసారి వెళ్ళి చూసి రారాదూ? అత్తా

చ్చులే!" అన్నది కోపంగా.

అన్నందుకు కుంజు మండిపడ్డాడు.

చ్చులే అంటావా? రేపెత్తే ఎలా అనుకున్నావ్? అక్కడేం మగ

బరువుబాధ్యతలన్నీ ఎవరివనుకున్నావ్? నేనొక్కణ్ణే అన్నీ ఎలా

!"

"అన్నీ చూసుకోగలవులే. నీ పాదాలు పట్టుకుంటాగానీ ఒక్కసారి చూసి రా అన్నయ్యా! ఎంచేతో ఇవాళ వాడికోసం మనస్సులో చెప్పలేనంత ఆత్రంగా వుంది." అన్నది కుసుమ.

చేతిలో చెప్పులు అవతలికి తోసేశాడు కుంజు. "నన్నవమానం ఎందుకు వెళ్ళమంటావ్? నేను వెళ్ళను. బృందావనుడు నా పెళ్లికి రాలేదు. ఆయన గొప్పవాడనా? ఏమిటో ఆ బోడిగొప్ప!" అన్నాడు ఖచ్చితంగా.

ఈ మాటలు వినటానికి ఎంతో అసహ్యంగా వున్నాయి. అయినా, కుసుమ




''అమ్మా, నా విలువ ఎంత వుంటుందమ్మా ?''

**''ఏకేంరా బాబూ! కోటిరూపాయలు పెడితే మాత్రం నీలాంటి కొడుకొస్తాడా ?''**

''సరేగాని, దానిమీద నాకో రూపాయి అప్పుపెట్టమ్మా. టిక్కి సినిమా చూడాలి!''

---

ఓర్పుతో శాంతంగానే జవాబిచ్చింది : ''ఆయనకి జ్వరం వచ్చిందిగా!''

''జ్వరం లేదు. గిరం లేదు. మా అత్తగారు అప్పుడే చెప్పింది. ''ఇదంతా వట్టి నటన....మోసం....'' అనీ! ఆమేం సామాన్యురాలా? ఆమెను మోసగించటం బ్రహ్మతరం గాదు. ''నమక్‌హరామ్'' లంటే ఎవరో కాదు. వీళ్ళే! వాడి మొహం కూడా నేను చూడదల్చుకోలేదు! ఛీ!'' అనేసి, గంభీరంగా నుంచుని చెప్పులు తొడుక్కోసాగేడు.

కుసుమకి ఈ సంభాషణ నెత్తిమీద పిడుగుపడ్డట్టు అయింది. స్తబ్ధురాలై కాసేపలాగే వుండిపోయింది. తర్వాత తన హృదయంలో రగుల్తూన్న వేదన నిలా వెలార్చుకుంది :—

''వారిని నమక్‌హరామ్ అంటావా? మోసకారులా? వారిని నువ్వు విందుకి పిలిచి పారిపోయిన రోజు జ్ఞాపకం లేదూ? ఆ రోజున వారికి ఉప్పు బాగా వేసివుంటాను. అందుకే వారు నమక్‌హరామ్‌లు అయ్యేరు. నువ్విలా అంటావని నేను కలలోకూడా అనుకోలేదన్నయ్యా!''

ఏమీ వినబడనట్టే మౌనంగా నిలబడ్డాడు కుంజు.

''నువ్వు ఎవరిని నమక్‌హరామ్ అంటున్నావో తెలుసా? నీ పెళ్లి చేసిందెవరో

అప్పుడే పరగడుపై పోయిందా?'' అంది మళ్ళీ.

వెనక్కి తిరిగి నిల్చున్నాడు కుంజు.

''ఎవరి పెళ్ళి ఎవరు చేస్తారూ? వికసించే పువ్వుని ఆపగలవారెవ్వరూ....అని అంటుంది మా అత్త. కలిసొచ్చే సమయం వస్తే పెళ్ళి అదే అవుతుంది'' అన్నాడు.

మరి మాటాడలేదు కుసుమ. మౌనంగా తన గదిలోకి వెళ్ళిపోయింది.

''ఛీఛీ—వారి మాటలన్నీ వింటే ఇంకేమైనా వుందా? అన్నా చెల్లెలూ 'ఒక్కటే మచ్చు!' అనుకోరూ?!'' అని తలచి తలచి బాధ పడింది.

*　　　*　　　*

ఇరవై నిమిషాల తర్వాత—

కిర్రుచెప్పుల చప్పుడు వినబడింది కుసుమకి. వెంటనే ఇవతలికి వచ్చింది. ''మళ్లీ ఎప్పుడు తిరిగిరావటం?'' అనడిగింది.

''రేప్పొద్దున్న.''

''అపును గానీ, ఇంటిదగ్గర నన్నొక్కదాన్నీ వొదిలిపెట్టేసి నీ మానాన నువ్వెళ్లి పోతున్నావే! సిగ్గులేదూ, భయం లేదూ?'' అని గద్దించింది అన్నగారిని.

''భయమెందుకనీ? నిన్ను మింగటానికి ఇక్కడేమైనా పెద్ద పులులూ, సింహాలూ ఉన్నాయా? ఉదయానే వచ్చేస్తాలే ఇంతలోనే ఎందుకూ బెంగ?'' అని చెప్పేసి కుంజనాధుడు పూలరంగడిలా అత్తవారింటికి బయల్దేరాడు.

మండుతూ మండుతూ వున్న పొయ్యిలో ఇన్ని నీళ్లు పోసి కుసుమ ఆర్పేసింది. ఆనక పోయి పడుకున్నది.

## 7

బృందావనుడి మనస్సు సుతిమెత్తనిది. తల్లి ఇబ్బంది పడటాన్ని చూసి ఎంత మాత్రం సహించలేడు. ఇప్పుడతను జంకుతూ తల్లితో ఒకమాట చెప్ప బోయాడు—

''అమ్మా, ఈ సంసారభారాన్ని ఇంకా ఎంతకాలం మోస్తావ్? నువ్వు ఊ అంటే చాలు సమర్థురాలైన ఒక దాసీదాన్ని తెస్తాను.''

పరధ్యానంగా వున్న అతని తల్లి ''ఏమిటి తెస్తావ్?'' అనడిగింది.

''ఒక దాసీదాన్ని నీకు చేసాయంగా వుండేందుకు తీసుకు వస్తానమ్మా. నీకు సాయంగా వుంటుంది. చరణుడినీ చూసుకుంటూ వుంటుంది. నువ్వు వూ( అనమ్మా?''

కొడుకు మాటల్లో వుండే అంతరార్థం గ్రహించిందామె. ''ఈ మాట నువు

నిజంగానే అంటున్నావా?'' అనడిగింది.

''నిజమే''

''సరేలే. ఆ సంగతి ఆలోచించి చెప్తా!'' అనేసి మళ్ళీ తన పనిలోనిమగ్నమై పోయింది

''దీనికి ఆలోచనెందు కమ్మా? సరేనను. వెళ్ళొచ్చేస్తాను.''

''అదేమిట్రా అబ్బాయ్, అంత తొందరెందుకూ? అయినా బృందా!—అనుజ్ఞ యిచ్చి ఇదివరలో బతిమిలాడిన రోజున నువ్వు వినసే లేదుగా!''

''తెలుసునమ్మా. ఆ పాపఫలం వల్లనే అన్ని విధాలా అధోగతికి వచ్చి ఈ దుస్థితికి వచ్చేను. . ' అని చెప్పి తలవంచుకున్నాడు.

''ఇప్పటికీ వూరుకో బృందా! రెండు రోజులాగితివంటే చెబుతాను!'' అన్నది. తల్లి.

అయినా బృందావనుడు ఆగలేదు.

''అమ్మా! నువ్వు అనుమానిస్తున్న విషయం.... రెండు కాదు, పది రోజులకైనా తేలదు. నిన్ను అవమానించిన వాళ్ళని నువ్వు క్షమించగలవేమోగాని నేను క్షమించ లేను. సరే—ననమ్మా నిశ్చింతగా వెళ్ళొస్తాను.'' అన్నాడు.

కాస్సేపాలోచించి ఒక నిట్టూర్పు విడిచిందామె.

''సరే—అనుజ్ఞ యిస్తున్నాను. వెళ్ళిరా!'' అంది.

తల్లి నిట్టూర్పులో గల అంతరార్థం తెలుసుకున్నాడు బృందావనుడు. మౌనంగా తల్లికి నమస్కరించి, బయటికి వచ్చేసి నించున్నాడు.

* * *

ఇంతలో బృందావనుడి దగ్గరికి ఒక విద్యార్థి వచ్చి ఒక ఉత్తరం చేతికిచ్చాడు.

''ఎవరి వుత్తరం బృందా?'' అని తల్లి ఆత్రంగా కేకవేసింది.

''తెలీదమ్మా. అదే చూస్తున్నా'' అనేసి పరధ్యానంగా తన గదిలోకి వెళ్ళి పోయాడు. ఉత్తరం చించి చూస్తే ముత్యాల్లాంటి అక్షరాలు కనబడ్డాయి. ఇదివర కెన్నడూ కుసుమ దస్తూరీ చూసి వుండకపోయినా, ఈ ఉత్తరం కుసుమదే అని గ్రహించేడు బృంద.

ఇహ, ఆ వుత్తరంలో విషయం :

''మా అన్నయ్యని మీ రిప్పుడు గుర్తించలేరు. ఇంతలో ఎంత మార్పు ఎలా వచ్చేసిందో! ఈ సంగతి మీకు నోరు విడిచి చెప్పలేకుండా వున్నాను. ఆయనగారు మళ్ళీ ఇవాళ ఒత్తారింటికి వెళ్ళాడు. రేపైనా వస్తాడో లేదో నమ్మకం లేదు.

వన్నొకతెనీ వొదిలేసి వెళ్ళావుట్రా అన్నయ్యా—అనడిగితే—ఇక్కడేం సింహాలు లేవులే నిన్ను మింగటానికి—అన్నాడు. మీ కేమన్నా ధైర్యంవుంటే నా చరణుడిని నాకిచ్చి వెళ్ళండి''—అని రాసివుంది.

*   *   *

అన్నగారి మీద కోపంతో ఇవాళ ఉదయాన మండుతూన్న పొయ్యిలో నీళ్ళోసింది కుసుమ. మళ్ళీ వెలిగించనే లేదు. పగలంతా ఆకల్తో అలాగే పడుకుంది. భయం తోను, విచారంతోను ఇంటోనుంచి బయటికి అటూ యిటూ వెయ్యిసార్లయినా పచారు చేసింది.

ఇహ సాయంకాలం అయ్యేసరికి ఎవరైనా వస్తారేమో నన్న నమ్మకం పూర్తిగా పోయింది. జనసంచారం లేని ఈ గృహంలో రాత్రంతా తను ఒంటరిగా గడపాలి. ఈ మాట తల్చుకునేప్పటికే కుసుమ శరీరం ఒక్కసారిగా కంపరమెత్తి పోయింది.

ఇంటి బయటనుంచి ''అమ్మా అమ్మా'' అని పిలుస్తున్నట్టుగా చరణుడి గొంతుకి వినిపించింది. ఒక్క పరుగున ఇంటోకి వచ్చేసింది కుసుమ. గభాల్న చరణుడిని చంకని ఎత్తేసుకుంది. వాడి మొహం మీద మొహం పెట్టి మనసారా అదుముకుంది. నే నొంటరిగా లేను అని ఆమె మనస్సుకి ధైర్యం చెప్పినట్టు తోచింది.

ఇక్కడికిప్పుడు పసివాడు చరణ్ ఒక నవుకరు వెంట వచ్చాడు. రాత్రివేళ భోజనాలూ అవీ అయ్యేయి. ఆ తర్వాత కుంజనాథుడి కొత్త షాపులో నవుకరు పడక్కిదానికీ ఏర్పాట్లు జరిగేయి.

చరణ్‌ని పక్కలో పడుకోబెట్టుకుని, గుండె దగ్గరకి లాక్కుంది కుసుమ. వాడిని ఎన్నెన్నో ప్రశ్నలు వేసింది. చివరికి మెల్లిగా యిలా అడిగింది. ''అవును గాని చరణ్!—మీ నాన్నగారు ఏం చేస్తున్నార్రా బాబీ?''

గభీమని లేచాడు చరణ్. లేచి వెళ్ళి, తన కోటు జేబులోంచి చిన్న పొట్లమొకటి తీసుకొచ్చేడు. ''నే మర్చేపోయానమ్మా! ఇది నీ కివ్వమన్నాడు నాన్న!'' అని చెప్పి, కుసుమ చేతికిచ్చాడు.

ఆ పొట్లం చేతికి తగలగానే అందులో డబ్బున్నదని గ్రహించింది కుసుమ: అంతేనమ్మా!—''ఇది నా చేతికిచ్చేసి వెళ్ళిపోయాడు నాన్న!'' అన్నాడు చరణ్.

దాంతో కుసుమ కంగారు పడింది. ''నాన్న ఎక్కణ్నించి వెళ్ళారు చరణ్?''. అని మళ్ళీ అడిగింది.

అప్పుడు చేత్తో చూపించాడు చరణ్. ''అదుగో అక్కణ్నించి ...'' అని చెప్పాడు. ''అక్కణ్ణించా?!'' అని ఆశ్చర్యపోయింది కుసుమ.



"అయితే ఏటి యివతలిదాకా వచ్చారా ఆయన?"

"ఆఁ. వచ్చారు!" అన్నాడు చరణ్ తల వూపుతూ.

మరేం ప్రశ్నించలేదు కుసుమ. చెప్పలేని అభిమానం పట్టుకుంది మనస్సులో స్తబ్ధురాలై పడివుంది. ఏమీ?—

* * *

ఆ రోజు మధ్యాహ్నం గుర్తుందిగా?

గుక్కెడు మంచి నీళ్ళయినా గొంతుకలో పోసుకోకుండా చరణ్‌ని తీసుకు పోతున్నప్పుడు కూడా కసుమ కోపంతోనే వున్నది. అంచేత బలవంత పెట్టడం మానేసింది. అటుపైన కటువుగా ప్రసంగించింది.

ఆనాటినుంచి మరి బృందావనుడు కనిపించనే లేదు. అంతకు ముందు ఏదో పని మీద తరచు ఇటొచ్చేవాడు. ఇప్పుడు అవేవీ లేవు కాబోలు. అదిగాక, అన్న గారి పెళ్ళికీ రాలేదు. ఇవాళ—ఇక్కడ ఏటివరికి వచ్చీకూడా, వాకిట్లోంచి అలానే చల్లగా జారుకున్నాడు.

ఇప్పుడు కుసుమకి మళ్ళీ ఆ రోజు—గాజులు తిరిగి ఇవ్వటానికి అన్నగారు కుంజు వెళ్లిన ఆ రోజు—"దేవుడు మన సొమ్ము దక్కించాడు" అని బృందావనుడు అన్న రోజు—అన్నీ ఒక్కసారి జ్ఞాపకానికి వచ్చాయి. అవి గుర్తు రాగానే—నిజంగా అతడి మనస్సులో భావం ఇదే అయివుంటుందా?—అని ఆలోచన కలిగింది. మళ్ళీ ఆమె మనస్సు తర్కంలో పడసాగింది.

"ఇదేం నా చేత్తో నేను ముడెట్టుకున్న సంబంధమా? కాదూ అంటే అంతటితో వదిలిపోతుందా? ఆయన నా భర్త కాదనే అనుకుందాం. అయితే నా మనస్సులోని ఈ భక్తీ, కోర్కెలూ ఈ విధంగా ఆయనమీదే యెందుకు లగ్నమవుతున్నాయ్?

"మా మధ్యని సాంసారికమైన సంభాషణ ఒక్కరోజు జరిగింది. ఆపాటిదానికే అతడి హృదయంలో ఇంత ప్రేమ ఎక్కణ్ణించి వచ్చింది? నా అపవాదుకను గురించి ఆయన లక్ష శపథాలు చేసివుండవచ్చు. అప్పటికీ నిజం కాదు!" అని మాటిమాటికీ అనుకుంటూంది కుసుమ.

కాసేపటిదాకా మాటాడక పడుకుంది. కాని మనస్సులో ఆలోచనలు మళ్లీ మళ్లీ తరుముకు వస్తూనేవున్నాయి—

"నా తల్లి పోయింది. కాబట్టి నిజం రుజువు కావాలంటే అందుకు మార్గమేదీ లేదు. నా అంతట నేనేం చెప్పనక్కర లేకుండానే ఆయనకు తెలుసుకదా—నేనే వారి ధర్మపత్నినని! అటువంటప్పుడు అనవసరమైన ఆ మొండితనపు వాదనలన్నీ ఆయనగారెందుకు లక్ష్యపెట్టడం? నాలో వున్న గర్వాన్నీ, అహంకారాన్నీ కాలికింద అణిచేసి నన్ను లాక్కుపోయే హక్కు వుందిగా వారికి? అలా యెందుకు చెయ్యరూ? ఆయన మాట వ్యతిరేకించటానికి నేనెవర్ని?!"

ఈ ప్రశ్నలతో కుసుమ ఒళ్లంతా ఓసారి కంపించింది. ఆమె పడ్తున్న క్షోభలో పక్కన పడుకుని నిద్దరోతున్న పసివాడు చరణుడికి మెలకువ వచ్చేసింది. "అమ్మా... ఏమిటమ్మా?" అనడిగాడు.

వాడిని తన హృదయానికి హత్తుకుంటూ, మెల్లిగా అడిగింది : "అవున్రా బాబూ, చరణ్! నీకు ఎవరిమీద ఎక్కువ ప్రేమరా నాన్నా?"

వాడేం తడుముకోకుండా "నీ మీదే!" అన్నాడు.

"మరి అలాగైతే, నువ్వు పెద్దయ్యేక మీ అమ్మకి బువ్వ పెడతావా?"

"ఓ"

"ఒకవేళ మీ నాన్న నన్ను వెళ్లగొడ్తారనుకో, అప్పుడుకూడా నువ్వు అమ్మకి అన్నం పెడ్తావా?"

"ఓ తప్పకుండా!"

ఇలా ధీమాగా చెప్పాడే గాని, ఏ పరిస్థితిలో తల్లికి ఏం పెట్టాలో వాడికేం తెలుసు, కుర్రకుంక! కుసుమ కళ్లవెంట అశ్రుధారలు ప్రవహించేయి. చరణుడికి కునుకు పట్టడం చూసి, ఆమె కన్నీళ్లు తుడుచుకుంది. వాడివేపే అలా చూస్తూ, ఇలా అనుకుంది మనస్సులో : "నేనెందుకు భయపడాలి? ఇంకెవరు చూసినా చూడకపోయినా, నా బిడ్డ చరణ్ నన్ను చూస్తాడు. తప్పకుండా కనిపెడ్తాడు!"

* * *

మర్నాడు—



తల్లీ బిడ్డలిద్దరూ యేటికి వెళ్లి స్నానంచేసి వస్తున్నారు. వస్తూంటే ఇంటి వాకిట ఒకామె నుంచుని ప్రశ్నల వర్షం కురిపిస్తున్నది. ఆ ప్రశ్న పరంపరకి కుంజనాధుడు సవినయంగా సమాధానాలిస్తున్నాడు. ఆమె వయస్సు ముదిరిన ప్రౌఢ స్త్రీ. ఆమె కుంజ అత్తగారని కుసుమ యిట్టే గ్రహించింది.

ఆమె తన ఒక్క పుత్రికారత్నాన్ని పంపటానికి ఈ ఇల్లు అన్నివిధాలా నదుపాయంగా, యోగ్యంగా వుంటుందా లేదా, కళ్ళారా చూసుకుందామని వచ్చింది.

ఇప్పుడు హఠాత్తుగా ఏటినుంచి కుసుమ రావటం చూసింది. నోరు మెదల్చకుండా అలా ఆమెనే చూస్తూ వుండిపోయింది. అత్తగారిని అంతగా ఆకర్షించిన వింత ఏమిటి ?

మంచి యవ్వనంలో వున్నది కుసుమ. ఆ అపురూప సౌందర్యాన్ని, ఏటిలో స్నానంచేసి రావడంవల్ల, తడిసిన ఆ వస్త్రాలు ఎంతమాత్రం దాచలేకపోతున్నాయి. కుసుమ ధరించివున్న ఆ పచ్చటి తడివస్త్రాల లోపల్నించే శరీరకాంతులు బయటికి వెదజల్లుతున్నాయి.

అందాలు చిందే ఆ వయ్యారి సుందరి చంకని నీళ్లబిందెతో, మరొక చేత్తో చరణుడి చెయ్యిపట్టుకు నడిపిస్తూ, అడుగులు వేస్తోందన్నమాట. చరణుడి చేతిలో కూడా నిండా నీళ్లు పట్టిన ఒక చెంబున్నది.

అదెంత చక్కటి దృశ్యం! తల్లిప్రేమని ఒలికించే అటువంటి మాతృమూర్తుల్ని ప్రపంచంలో ఎక్కడైనా చూడగలమా ?

అత్తగారిలాగే ఇప్పుడు కుంజనాధుడుకూడా తదేకదృష్టితో తనవంక చూడటం కుసుమ గమనించింది. క్షణమైనా నిలవడానికి యిష్టపడక, అక్కణ్ణించి తొందరగా పోబోయింది.

అలా హడావిడిగా పోబోతూన్న కుసుమని వేలితో చూపిస్తూ, "ఈమేనా కుసుమ?" అని కుంజుని ప్రశ్నించింది అత్తగారు.

"అవును. అదే మా చెల్లెలు" సంతోషంతో చెప్పాడు కుంజు.

కుసుమ చంకనున్న నీళ్లబిందె కిందనుంచి, పెద్దామెకి నమస్కరించింది. తల్లి నమస్కరించడం చూసి, తన చిట్టిచేతుల్తో చరణుడూ నమస్కారం చేశాడు.

వాడికేసి తిరిగి అత్తగారు—"ఈ పిల్లాడిని నే నెక్కడో చూసినట్టుందే!" అన్నది.

వెంటనే పసివాడు తనకు తనే పరిచయం చేసుకుంటూ ఇలా చెప్పాడు: "నేను చరణుడిని....మామ్మ వెంట....వచ్చాను కదూ మీ యింటికి....మామ పెళ్లాన్ని చూట్టానికని ...'

కుసుమ నవ్వి చరణుడిని దగ్గరసా తీసుకుంది. "అలా అనకూడదు బాబూ! అత్తను చూట్టానికి అని అనాలి. తెలిసిందా, నాయనా?" అంటూ పిల్లావాడితప్పు సవరించింది.

కుంజుడి అత్త వూరుకోలే.

"ఈ గుంటడి మాటలు విన్నావా? చిలక పలుకులు. బృంద వైష్ణవుడి కొడుకల్లే వుందే, వాలకం చూస్తే!"

నవ్వుతూన్న కుసుమ ముఖం ఒక్కసారిగా వెలవెలబోయింది. బిడ్డ చెయ్యి పట్టు కుని, ఓ చేత్తో బిందె చంకనెత్తుకొని, వంటింట్లోకి వెళ్ళిపోయింది.

కుంజ గ్రహింపుశక్తి లేని అమాయకుడు. అటువంటి అతడి చెవులకూడా అత్తగారన్న మాటలు ఎంతో కటువుగా తోచేయి. ఇహ మరెన్నడూ చెల్లెలు కుసుమ అత్తగారి కంట పడదనుకున్నాడు. ఆ అత్తగారుకూడా లోలోపల సిగ్గుపడింది.

కుంజ అత్తగారు విధవరాలు. వయస్సు ముప్ఫయ్ దాటివుంటాయేమో! ఇకపోతే, తెల్లటి మల్లుచీర, మెళ్లో బంగారపు గొలుసు, చెవులకి కమ్మలు, చేతులకి బాజా బందులూ—ఇవీ ఆవిడ అలంకారాలు.

ఆమె అల్లుడితో మాటాడ్తూ వుంది. అదేమిటో సరిగ్గా వినబడటం లేదు. కాని ఆ ప్రసంగం తనగురించేనని కుసుమకు అవగాహనయింది.

కుంజ అత్తకు ఓ అలవాటుంది—వేళాపాళా లేకుండా మేకలాగ తమలపాకులు

ఊహూ నమ్ముల్తూ వుంటుంది....ఇప్పుడు ఆమెగారు స్నానం చేసింది. చందనం తీసి మొహాన తిలకం వుంచుకుంది.

*　　　　*　　　　*

నిత్య పూజా పునస్కారం పూర్తిచేసుకున్న కుసుమ. ఇహ వంటపని మొదలెడదామని అనుకుంటున్నది. అంతలో కుంజ అత్తగారు ఆమె దగ్గరసా వచ్చి కూర్చున్నది.

"ఇదేమిటే అమ్మాయ్! మెళ్ళో మాల లేదు. మొహాన చందన తిలకమూ లేదు. నువ్వేం వైష్ణవ పిల్లవమ్మా?:"

"నేనవేం పెట్టుకోను." అంది కుసుమ ముక్తసరిగా.

"పెట్టుకోనంటే ఎలా అమ్మాయ్? పెట్టుకోకపోతే నీ చేతి నీళ్ళయినా తాగుతారా మనవాళ్ళు? నువ్వే చెప్పూ!"

వెనక్కి తిరిగింది కుసుమ. "మరలాగైతే, మీ భోజనంకోసం వేరే యేర్పాటు చేయమంటారా?" అనడిగింది

"నా కోసం కాదే పిల్లదానా! నేను మీ యింటిదాన్నే. పరాయివాళ్ళెవరైనా అయితే, నీ ముఖం చూసి మెతుకుతారా? ' అన్నది అత్తగారు.

మాటాడలే కుసుమ.

*　　　　*　　　　*

ఇంతలో కుంజ తొందరపాటుగా వచ్చాడు. "కుసుమా, చరణ్ ఎప్పుడొచ్చాడూ?" అనడిగేడు.

"నిన్న సాయంత్రం."

కుంజనాధుడి అత్త చెప్పింది—"ఆ బృందవైష్ణవుడు ఈవిణ్ని స్వీకరించాడటగా? అందుకని కొడుకుని నవుకరు సాయంతో పంపాట్ట. ఇప్పుడే తెలిసింది...."

ఈ మాటకి చకితుడైన అల్లుడు "ఈ సంగతి నీకెలా తెలిసిందత్తా?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

అందుకామె గంభీరంగా ఇలా వుపన్యసించింది:

"నాయనా, నా కింకా నాలుగు చెవులూ, నాలుగు కళ్ళూ వున్నవోయ్! ఈ సంగతి నేను వినడం మాత్రం వాస్తవం! అక్షరాలా యథార్థం. పాపం....వాళ్ళెంతగా బతిమలాడారు? కాని మీ చెల్లెమ్మ వప్పుకుంటేగా! ఇలాంటప్పుడే లోకులు తలో మాటా అనుకుంటారు. పల్లెపట్టున వయసొచ్చిన కుర్రాళ్ళు ఎంతమందో వుంటారు. అయితే—మీ చెల్లెల్నేమీ తప్పు పట్టడం లేదు సుమా నేను! ఆ అమ్మాయి అందం, చందం, యవ్వనం యిప్పటికీ పరిపూర్ణంగా స్వచ్ఛమైన ముత్యంలాగానే

వున్నాయనుకో. అది కాదు నే చెప్పేది. మనసు మారటానికీ, కాలు జారటానికీ ఎంతసేపు పడుతుందోయ్ తండ్రీ?''

''అవునత్తా! నిజం. ఎంతసేపు పట్టాలీ?'' అన్నాడు కుంజు ఆమెను సమర్థిస్తూ.

వెంటనే కుసుమ తలెత్తి గుర్లురిమింది. ''నువ్విక్కడ కూర్చుని చేసే పనేమిటన్నయ్యా? తక్షణం యిక్కడినుంచి పో!'' అన్నది.

ఇలా కంగు తినగానే కుంజ అక్కడినుంచి లేవబోయాడు. అత్తగారు వూరుకో లేదు. మండిపడింది.

''అమ్మాయీ, అన్నీ కళ్ళు మూస్తావుగానీ, లోకం కళ్లు ముయ్యగలవా? ఏటిలో స్నానం చేస్తివి. జుత్తు విరబోసుకొని ఆ తడిగుడ్డల్లో ఆ మట్టునే వచార్లుచేస్తూ యింటికి వస్తివి. ఇల్లాంటి నీ రూపం చూడగానే ముక్కు మూసుకు తపస్సు చేసుకొనే మహాఋషులకైనా మనస్సు చలిస్తుందో, లేదో అడుగు మీ అన్ననే!'' అన్నది.

మళ్ళీ గట్టిగా అరిచింది కుసుమ: ''అన్నయ్యా!—నీ పాదాలట్టుకుంటాగానీ, ఈ మాటలు వింటూ, నించోకు. నీ దారిన నువ్వు వెళ్ళిపో బాబూ!''

కుంజు క్షణమైనా నిలవక వెళ్ళిపోయేడు.

కాసేపట్లో కుసుమ కూడా బయటికి వెళ్ళిపోయింది.

ఇహ అక్కడ వుండిపోయినదల్లా కుంజ అత్తగారొకర్తే! తనలాంటి కలహ వీరులు ఎక్కడా వుండరని ఆమె అతిశయం. నిస్సహాయస్థితిలోవున్న కుసుమవంటి చిన్నపిల్ల తనకే ఈ విధంగా దిగ్భ్రమజేసి పోయిందాయె! ఇల్లాంటి సంఘటన జరుగుతుందని ఆమె కలలోనైనా అనుకొని వుండదు!

# 8

ఆనాడు కుంజు అత్తగారు ఏదో విధంగా కయ్యం పెట్టుకుందామనే వచ్చిందన్న మాట నిజం. అయితే ఎంచేతో యిది కుసుమ గ్రహించలేకపోయింది.

ఇంకో సంగతేమిటంటే—''ఎలాంటి సంశయమూ లేకుండా మనస్ఫూర్తిగా ఏలుకుంటాను'' అని బృందావనుడు తీసుకువెళ్తానన్నాడు గదా! అలాంటప్పుడు కుసుమ రానని భీష్మించటంలో గల అంతరార్థమేమిటి? ఇదంతా కుంజు అత్తగారి మాటల్లో వ్యక్తం అవుతూనే వున్నది. ఆ అంతరార్థం ఏమిటో ఆమెకూ తెలుసు. ఈమెకూ తెలుసు.

కనక ఇప్పుడీ ప్రసక్తి రావటంతోనే కుసుమకు ఒళ్ళు తెలియలేదు. ఈ




విధంగా లేచి వెళ్ళిపోవటం సరైన పని కాదేమో అని అనుకున్నది. పగటి పూటల్లా కుంజు అత్తగారు వచ్చి మంచినీళ్ళు ముట్టుకోలేదు. ఇహ రాత్రి కాగానే కుసుమ ఆమెను ఎన్నోవిధాల బతిమలాడింది. మొత్తానికి ఆవిడ లంఖణం విరమించి ఏదో భోంచేశాననిపించింది. అత్తగారిని తృప్తిపరచటం కోసం ఆ రోజంతా కుంజు చెల్లెలిమీద గొణుగుతూనే వున్నాడు.

మర్నాడు—

కుంజు అత్తగారు యింటికి పోబోతూంది. కుసుమ వంగి వినయంగా ఆమె పాదధూళి తీసుకొంది. దాన్ని నొసట ధరించి ఎదురుగా నించుంది. ఆమె కుసుమ పట్ల ముభావంగా ఉదాసీనంగా నటిస్తూ—తన అల్లుడినిలా హెచ్చరించింది— "ఏమయ్యోవ్, అల్లుడుగారూ! మీ రిలా చెల్లెలి ఎదురుగుండా కూర్చుంటేకాదు, అక్కడ పొలం పుట్రా చూసుకోవాలి!" అన్నది.

కుసుమ తల వంచుకొని నించున్నది.

* * *

ఈ సంఘటన జరిగి రెండు నెలలవుతున్నది. చెల్లెలితో ఎట్టి సంబంధమూ లేకుండా సీదాగా తెగతెంపులు చేయించింది అత్తగారు. అతడి కాపరానికి కొత్త పునాదులు వేయించింది. దాని ప్రకారం కుంజు యిక అక్కడ వుండనట్టులెక్కే. ఒకవేళ చుట్టపుచూపుగా వచ్చినా మునుపటిలాగ మనసిచ్చి మాటాడడు. ప్రేమగా వుండే తన అన్నగారు ఒక్కసారిగా యిలా యెందుకు మారిపోయ్యాడా అని కుసుమ అప్పుడప్పుడు అనుకొంటుంది. అన్నా చెల్లెళ్ళ మధ్యని మునువుండే మైత్రి

లేదు. ఆ మాటకొస్తే పొరుపులూ లేవు. పోట్లాటలూ లేవు. ఒక్క రాత్రి అన్న లేనందుకే ఎంతగానో భయపడిన కుసుమ, యిప్పుడు ఒక్కత్తే తోడూనీడా లేకుండా ఎన్ని రాత్రులు గడుపుతున్నదో లెఖ్ఖా పత్రం లేదు.

ఇటువంటి దుఃఖాలెన్నయినా కుసుమ లెఖ్ఖ చెయ్యదు. ఒక్కటి మటుకు ఆమె మనస్సుని అనుక్షణమూ వేధిస్తూనే వుంది—అన్నగారికి నేను శనిగ్రహాన్ని అయిపోయానే—అన్నమాట! ఈ మాటనే తలుచుకు తలుచుకు ఆమె బాధపడుతుంది.

ఎప్పుడేనా మనస్సు మరీ భారంగా వుంటే, ఒకే ఒక్క విషయం ఆలోచించేది—పసివాడు చరణుడిని గురించి. ఆమెని "అమ్మా! అమ్మా!!" అంటూ ఆప్యాయంగా పిలిచేది వాడొక్కడే.

అంత చనువుగా మసులుతుండే ఆ పసివాడి చేతికిచ్చి, కుసుమ ఓనాడు బృందావనుడికి ఒక ఉత్తరం పంపించింది. వ్యర్థమూ నిరర్థకమూ అయిపోయింది. అది చూసి ప్రేమతో రెండు ముక్కలు దానిమీదనే సమాధానం రాసి పంపుతాడని కుసుమ యెంతగానో ఆశించింది. అటువంటిదేమి జరగలేదు. ఆమె కలలు ఫలించలేదు గాని కొంత డబ్బు మాత్రం చేతికి వచ్చింది విధిలేక తప్పనిసరిగా ఆ డబ్బు మాత్రం తను తీసుకోవల్సి వచ్చింది.

* * *

అత్తారింటినుంచి నిన్న రాత్రే వచ్చాడు కుంజనాధుడు. మళ్ళా ఇవాళ ఉదయానే తిరుగు ప్రయాణం! అన్న ఆత్రం, హడావుడీ చూసి కుసుమ ఎదటికి వచ్చి నించున్నది.

ఇదివరకులా అన్నని బతిమాలడం మానుకున్నది. కాని, ఇవాళ మాత్రం వినయంగా ఇలా అంది:

"అంత తొందరపడటానికి ఏ మొచ్చిందన్నయ్యా? ఇదిగో వంట అయిపోవచ్చింది. కడుపు చలవచేసుకుపో."

వెంటనే మొహం తిప్పేసుకున్నాడు కుంజు. చెప్పలేని చిరాకుతో—"హా....! అనుకున్నంతా అయిందే? తీరా బయల్దేరుదా మనుకునేటప్పటికి ఎదురొచ్చావే!" అంటూ విసుక్కున్నాడు.

మునుపు పరిస్థితులు బాగో లేక అన్న ఏమన్నా సహించి వూరుకోక తప్పలేదు. ఇప్పుడు అన్నగారి ఈ ఆగ్రహం అనవసరం, అప్రస్తుతమున్నూ! దీంతో ఆమె నిజంగా మండిపడింది. అయితే తన జవాబులో మట్టుకు ఆ కోపం కనబర్చలేదు.

కుసుమ. కాని జవాబు మాత్రం కరకుగానే చెప్పింది.

"ఎందుకలా భయపడ్తావు అన్నయ్యా? అంతమాత్రాన నువ్వేం చావవు. ఇది వరకల్లా నువ్వు ఎన్నిసార్లు బయల్దేరలేదు, నే నెదురుపడలేదు. నువు మనిషి వేనా? అలా అయితే ఏనాడో చచ్చివుందువు!"

"నేను మనిషిని కానూ?"

"కాదు. మనిషివి కాదు గదా, అధమం కుక్కా పిల్లివికూడా కాదు. వాటిని నీతో పోల్చడం ద్రోహం! అవి నీకన్నా ఎంతో విశ్వాసంగల జంతువులు. నీలా నమ్మకద్రోహం చెయ్యవు."

ఇలా అనేసి, కుసుమ గభీమని తన గదిలో కెళ్ళి, టక్కున తలుపు లేసేసుకుంది. అన్నగారు కాసేపు బిత్తరపోయి, చూస్తూ నించున్నాడు. ఉన్నట్టే వుండి, మెల్లిగా కాలు సాగించాడు.

*            *            *

ఇహ ఇంటి దృశ్యం. బయట వాకిలి తెరిచే వుంది. ఒక గంట సేపయ్యాక బృందావనుడు వచ్చాడు. లోపలికి వచ్చి చూసి చకితుడయ్యా....కుంజుడు వుండే గది వెలపల తాళం వేసివుంది. కుసుమ గదిలోపల గడియవేసి వుంది. పోతే— వంటిల్లు బార్లా తెరిచేసి వున్నది. ఇదేమిటా ఈ విడ్డూరం అని చెప్పి బృందావనుడు అట్టే లోపలికి తొంగి చూశాడు. ఇహనేముందీ?—లబుకూ లబుకూ మంటూ ఓ కుక్క అన్నం తినేస్తూంది. అతడ్ని చూడగానే అది తినే తినే అన్నం వదిలిపెట్టేసి "కుయ్" మని అరుస్తూ బయటికి పారిపోయింది!

పోతే—వంటింటి స్థితి—పనికొంత అయింది. ఇంకా కొంత వున్నట్టుంది. పొయ్యి చూస్తే ఆరివుంది.

ఈ సమయంలో చరణుడు నవుకరువెంట నడిచి వస్తున్నాడు. పసివాడుకదా, నడకలో కొంచెం వెనకపడ్డాడు. కాసేపట్లో వచ్చి "అమ్మా! అమ్మా!" అని బిగ్గరగా పిలుస్తూ లోపలికి వచ్చేశాడు.

బిడ్డ పిలుపు విన్నది కుసుమ వెంటనే తలుపు తీసి బైటికి వచ్చింది. కళ్ళల్లో నీళ్ళు నిండివున్న కుసుమ ముఖం బృందావనుడి కంట పడింది. అతనలా హఠాత్తుగా వస్తాడని కుసుమ కలలోనైనా అనుకోలేదు. ఇప్పుడతన్ని అకస్మాత్తుగా చూడటంతో ఒకడుగు వెనక్కి తగ్గిందామె. పయిట సరిచేసుకుంది. చాప తెచ్చి వేసి కూర్చోమంది.

అంతలో చరణుడు రంయ్‌మని పరుగెత్తు కుంటూ వచ్చేశాడు కుసుమ కాళ్లవి

చుట్టేసుకున్నాడు. ఆమె వాణ్ని గభీమని ఎత్తుకుని, ముద్దెట్టుకుంది. వెంటనే ఒక స్తంభం చాటుకు పోయి నించున్నది.

చరణుడు తల్లిని పరికించి చూశాడు. బిక్కమొహం వేశాడు. "మరేం, అమ్మ ఏడుస్తూంది నాన్నా!" అన్నాడు.

ఈ సంగతి మొదటే గ్రహించాడు బృందావనుడు. "ఏమిటి సంగతి? ఎందుకని కబురంపావ్?" అనడిగాడు.

"రాశావుగా ఉత్తరంలో—ఒక్కమాటు వచ్చి అన్నయ్యని కలుసుకోమని. ఏడీ అతగాడు?"

"చచ్చిపొయ్యాడు."

"ఆఁ! చచ్చిపొయ్యాడా? నిజంగా!! ఏం జరిగిందేం?" అన్నాడు వ్యంగ్యంగా.

"చూడండిదిగో....మీరు మాత్రం యిప్పుడు నవ్వబోకండి. నాకు ఒళ్లు మండుకొస్తూంది. మీరు వేసిన ప్రశ్న నా మనస్సుకి ఏం బాగాలేదు. మిమ్మల్ని రమ్మని కబురంపింది యిలా పుండుమీద కారం చల్లటానికేనా?" అని అంటూ భోరుమని యేడ్చేసింది.

ఆమె అంతలా యేడ్చినా, బృందావనుడు కాస్తంత కూడా చలించలేదు. "అయితే నన్నెందుకు పిలిపించినట్టూ?" అన్నాడు.

దుఃఖభారంలో వున్న కుసుమ కళ్ళ తడి తుడుచుకొంటూ యిలా అంది: "అలా అనడం ఏమన్నా బాగుందా మీకు? రానే రాకుండా వుండాలనా మీ వుద్దేశ్యం? అలా అయితే నా గోడు యెవరితో చెప్పుకోను? లోగడ మీ పనులమీద యిటొచ్చి పోతూండేవారు. ఇప్పుడిటు రావడమే మానేశారు గదా!"

"నిజమే. ఆనాటి సంగతి మరవలేకుండా వున్నాను. మరిచిపోగలిగితే, యిటు వచ్చేవాణ్ణేమో!—సరేలే. నన్ను పిలిపించిన అసలు సంగతేమిటో చెబుదూ!" అన్నాడు బృందావనుడు.

"మిమ్మల్ని ఒక మాట అడుగుదామని ఎంతో కాలంనుంచి ఎదురు చూస్తున్నాను. నిజం చెబుతారా? జుత్తు విరబోసుకొని, నా అందాన్ని ప్రదర్శించుకొంటూ బజార్ల వెంట తిరుగుతుంటానని పుకారు బయల్దేరిందిటగా. అదెవరి పనో చెప్పండి కాస్త!" అన్నది కుసుమ.

ఈ ప్రశ్న వినేప్పటికి బృంద కాన్త దిగ్భ్రమ చెందాడు. కాస్త తమాయించుకొని "నేనే అయితే?" అన్నాడు.

"మీరు వేశారని అనటంలే నేనే. అలాంటి ఆలోచన నాకు ఏ కోశానా లేదు.




కాని ..." అన్నది కుసుమ.

ఆమె మాట పూర్తి చెయ్యకముందే అందుకున్నాడు బృందావనుడు: "అబద్ధ మాడకు. అననూ అన్నావ్. ఆలోచించనూ ఆలోచించావ్. ఆ రోజున. నిన్ను అగౌరవపరచాలన్న ఉద్దేశంతో కదా, ఆ నాడు అమ్మనీ, సోదరుల్నీ వెంటేసుకొని యిక్కడికి భోజనానికి వచ్చింది? ఆ రోజున చేసిన వాణ్ణి ఈ రోజున చెయ్యలేనూ? అప్పుడు జరిగిన నేరానికి తగిన శిక్షే విధించావుగా అమ్మకి!"

బృందావనుడిలా అనగానే కుసుమ చాలా బాధపడింది. "నావల్ల ఎంతైనా పొరపాటు జరిగిందండీ. ఆ రోజున మిమ్మల్ని సరిగా అర్థం చేసుకోలేకపోయాను" అన్నది.

"మరైతే, ఇప్పుడు అర్థం చేసుకున్నావా?"

మాటాడలే కుసుమ. బృందావనుడూ కాసేపు మౌనంగానే వున్నాడు. హఠాత్తుగా యిలా అన్నాడు: "సరేగాని, ఇప్పుడే ఓ కుక్క మీ వంటింట్లోకి దూరింది. చట్టిలూ పాత్రలూ దొర్లించింది. అంతా పాడు పెట్టి హంగామా చేసిపోయింది."

"పాడు చేసి పోతే పోనివ్వండి. నేను భోజనం చెయ్యను. మొదటే తెలిసివుంటే, అసలు వంటే చేసి వుండేదాన్ని కాదు!" అన్నది విరక్తిభావంతో.

"ఇవ్వాళ ఏకాదశి అనుకొంటాను?" అన్నాడు బృందావనుడు.

అందుకామె తల వంచుకు చెప్పింది: "ఏకాదశో ద్వాదశో నా కదేం తెలియదు. నే నవేమీ పాటించను"—ఇలా అని మౌనంగా నించుంది కుసుమ.

"మొదట్లో చేస్తుండేదానివి లాగుందే! మధ్యలో యిప్పుడెందుకని మాను

కోవడం ?'' అని మళ్ళీ అడిగాడు బృందావనుడు.

అతని ప్రశ్నలు విని కుసుమ నిరుత్సాహపడి సిగ్గుతో యిలా చెప్పింది : ''ఇప్పుడు నే చెయ్యడం మానేసిన మాట నిజమే. తెలిసీ బుద్ధి పూర్వకంగా ఎవళ్ళూ సర్వ నాశనం కోరుకోరుకదా ? అందుకనే మానుకుంట. అవతల అన్నయ్య వ్యవహారం రోజు రోజుకీ శ్రుతిమించిపోతూంది. మీ ధోరణి చూస్తూంటే గొంతుకి ఉరిపోసుకు చద్దామా అన్పిస్తోంది ...''

''ఆ పనిమాత్రం చెయ్యకు. నా వ్యవహారం తర్వాత విచారిద్దువుగాని. విచారించకపోయినా వచ్చే నష్టమేమీ లేదు. అవునూ, మీ అన్నయ్య వ్యవహారం ఎందు చేత శ్రుతిమించుతున్నట్టూ ?' అనడిగేడు బృందావనుడు.

ఇపుడు కుసుమ కొంచెం తేరుకుంది.

''మా అన్నయ్య వ్యవహారం ఓ పెద్ద చేటభారతం. ఏమైనా, మీతో కాకపోతే మరెవరితో చెప్పుకొనేదీ ? అతగాడు యిల్లూ వాకిలీ పూర్తిగా వదిలేసుకొన్నాడు. చెల్లెలి గురించి అతనేమీ పట్టించుకోవటమే లేదు. అత్తగారు ఆజ్ఞ యివ్వలేదని తిండి పెట్టడం కూడా మానేశాడు. ఈ స్థితిలో తల్లి భారం నా బిడ్డ చరణుడే వహించాడు. లేకపోతే ఈ పాటి కెప్పుడో మాడి చచ్చేదాన్ని. ఇప్పుడు.... నేను... .' —అని గబీమని ఆగిపోయింది ఇంతకుమించి చెప్పడం భావ్యమవునా కాదా అని ఆలోచనలో పడింది.

''ఈ క్షణంనుంచి యిహ నేను పూర్తిగా మీ దాన్ని. ఇంకిక్కడ ఒక్కరోజు కాదు గదా—ఒక్కక్షణం కూడా వుండను. వుండదల్చుకోలే ...'' అని చెప్పింది. మళ్ళీ.

నవ్వాడు బృందావనుడు. ''సరి—అందుచేత వుండదలుచుకోలేదన్నమాట !''

ఒక్కమాటు కన్నెత్తి మళ్ళీ దించుకున్నది కుసుమ. అతన్ని ఈ ప్రశ్న కొంచెం బాధ కలిగించింది.

''తన తల్లి భారం, బాధ్యతా చరణుడెలాగా తప్పక తీసుకుంటాడు. మరైతే నువ్వెక్కడుందామని....?'' అనడిగాడు బృందావనుడు.

''నాకేం తెలుస్తుంది, ఎలా తెలుస్తుంది ? వారికే తెలియాలి. .. ...!'' అన్నది నమ్రతగా.

''వారంటే ఎవరు ? నాకా ?'' మళ్ళీ అడిగాడతను.

కుసుమ మౌనంగా వుండటంతో, అవునని ఆమె అంగీకరించినట్టే అయింది.

''అదేం కుదరదులే. నీ విషయంలో జోక్యం కలుగజేసుకోకూడదని నిశ్చయించు

కొన్నావు. ఏం చేసినా అమ్మే చేయాలి. ఆమే చెయ్యగలదు. కనక ఆమెతో యెలా వ్యవహరించుకోవాలో నువ్వే చూసుకో. చరణుడిని తీసుకొని ఆవిడ దగ్గరికి వెళ్ళు. తప్పక యేదో ఒక ఏర్పాటు చేస్తుంది. లేదూ కాదూ అనదు. అయితే, మీ......... అన్నని...'' అంటూ ఆగిపోయాడు బృందావనుడు.

కళ్ళల్లో నీళ్ళు నిండు కొచ్చేయి కుసుమకి. నీళ్లు తుడుచుకుంటూ అన్నది: ''చెప్పాగా. అన్నయ్య చచ్చిపోయ్యాడని! పట్టపగలు కాలినడకని ఒక యాచకురాలిగా మీ వూరు చేరుకోమనేగా మీ ఉద్దేశ్యం? సాధ్యమైనపనేనా? ఎలా వెళ్ళను?''

''అదంతా నాకు తెలీదు. వెళితే మంచిది. బావుంటుంది అని నా ఉద్దేశం చెప్పాను. మరే దారీ నాకు తోచలే!''

కాసేపూరుకొంది కుసుమ. తర్వాత—''నే వెళ్ళను' అంది.

''అయితే, నీ యిష్టం!'' అన్నాడు బృంద, ఝాటిగా.

అందుచేత కుసుమ యిప్పుడు నిజంగానే భయపడింది. తలెత్తి, యింకేమయినా అంటాడేమోనని కాసేపటిదాకా బృందావనుడి వేపు చూసింది. ఆ తర్వాత ఎంతో వినయంగా యిలా అంది:

''లోకంలో కొంతమంది తాము నాశనమవుతారు. కాని యితరులకు మంచి చెయ్యలేరు. ఇందుకు మా అన్నయ్యే తార్కాణం. అయినా, అతన్ని తప్పు పట్టను. దోషమంతా అతనిదికాదు. ఈ పరిస్థితుల్లో నే నిహ యిక్కడ కూడా వుండటానికి నాకు స్థానం లేదు. అతడంటే నన్నింత తేలిగ్గా తోసి పారేశాడు. కాని, మీరు తీసి పారెయ్యలేరుగా!''

దీనికి బృందావనుడు సమాధానమేం చెప్పలేదు. లేచి నుంచుని, పసివాడ్ని చూస్తూ ''ఆలస్యమైపోతూంది, చరణ్! నువ్విక్కడుంటావా? వస్తావా? ఇష్టమైతే నాతోరా. లేకపోతే యిక్కడే వుండిపో!' అన్నాడు.

కుసుమ నుద్దేశించి—''యిదుగో, మళ్ళీ చెబుతున్నా! నువ్వు చరణుడిని తీసుకొని వెళ్ళి అమ్మముందు నించున్నంతమాత్రాన నీకు వచ్చిపడే అవమానమేం లేదు. ఇహ నే వెళ్తా!'' అని చెప్పి బృందావనుడు ఒక్కడుగు వేశాడు.

వేసేసరికల్లా, కుసుమ చరణుడిని ఆపళంగా చంకనుంచి దింపేసింది. బృందావనుడిని చూస్తూ ఉద్రేకంతో ఆవేశంతో మొరపెట్టుకొంది.

''ఇపుడు తెలుసుకున్నా మీ నైజం. నేనింత దుఃఖంలో వున్నానని నోరు చేసుకు చెప్పినప్పటికీ, గభీమని లేచి నిలబడి 'ఆలస్యమైపోతూంది, ఇహ నే వెళతా'' నంటారే: దిక్కులేని దాన్నని తెలుసు. తెలిసీ, యిలా ప్రవర్తిస్తే నేనేం చెప్పేది?

మీ నుంచి ఆశించేది యేముంది ? అయినా ఒక్కమాట అడుగుతా, సరిగ్గా సమాధానం చెప్తారా ?'' అనడిగింది.

చకితుడైన బృందావనుడు తలెత్తి ''చెప్తాను'' అన్నాడు. ''నేను దిక్కు చూప దల్లేదు. చూపిస్తే—ఎన్నోసార్లు నువ్వే నిరాకరించావ్ !'' అని కూడా అన్నాడు.

''అబద్ధం. శుద్ధబద్ధం. ఆనాడు ఏ కర్మవల్ల నా నాలిక్కి శనిగ్రహం ఆవేశించిందో యేమో, మీ అమ్మ మనస్సు గాయపరిచేను. తీరని అపరాధం చేశాను. అందుకు శాస్తిగా ఆ వేదన నన్ను ఆ మరణాంతం వెంటాడుతూనే వుంటుంది. ఆ బాధ నాకు తెలుసు. ఆ దేవుడికి తెలుసు.

దాని ఫలితంగానే ఈనాడు నేను—భర్త, అత్త, ఇల్లూ వాకిలీ సమస్తమూ వుండి కూడా నిరాశ్రయురాలినై పోయాను. మరొకరి తలకి భారంగా వుండాలిసి వచ్చింది. ఈ నాటివరకూ అత్తవారింటి గడప తొక్కటానికయినా యీ దీనురాలికి యోగ్యత, అర్హతా లేకపోయింది.

నేను పెద్ద నేరమే చేసి వుండొచ్చు. నేనాయింటి కోడల్ని గదా! అలాం టప్పుడు—పట్టపగలు అందరూ చూస్తుండగా కాలినడకను ఒక యాచకురాలిగా అక్కడికి వెళ్ళమని చెప్పటానికి మీకు నోరెలా వచ్చిందో నాకు తోచటంలే! అంతకు తప్ప పరోమార్గం కనిపించనే లేదన్నారుగా! నిజమే. ఎందుకు కనిపించలేదో తెలుసా ?

మేం పేదవాళ్ళం. మా అమ్మ భిక్షాటనతో మా యిద్దర్నీ పెంచి పెద్దవాళ్ళని చేసింది. మా అన్న తట్ట నెత్తిమీద పెట్టుకొని సరకులమ్మి సంసారం గడుపు తున్నాడు. అందుచేత యాచకురాలి బిడ్డ యాచకురాలిగా వెళ్తే తప్పేమిటనా మీ వుద్దేశం. అవునా ?—ఇది మీ పొరపాటు కాదులెండి, దర్పం!

చాల్లెండి. ఇక్కడే వుంటూ, వస్తులుండి చావనన్నా చస్తానుగాని, మీ ముందర దేహీ అని చెయ్యి చాపి, మీరు చేసే హేళనని సహించలేను !'' అంది.

బృందావనుడు నోరు మెదల్పలేదు. కాసేపయ్యాక—''ఇంతంటే నే చెప్పేది యింకేంలేదు ? వెళ్తున్నా !'' అన్నాడు.

కుసుమ కూడా అదేధోరణిలో జవాబు చెప్పింది : ''వెళ్ళొద్దని ఎవరూ మిమ్మల్ని ఆటంకపెట్టలేదు. కొంచెం ఆగండి, ఒక్కమాట అడుగుతా. దాపరికం లేకుండా దయచేసి నిజం చెప్పండి—నా గురించి మీ మనస్సులో యింకేమయినా అపోహాలూ, సంశయాలూ ఏర్పడివున్నాయా ? ఉంటే స్పష్టంగా చెప్పెయ్యండి. ఉన్నాయని మీరంటే, మీ ఎదటే నిలబడి ''లేదని'' ప్రతిజ్ఞ చేస్తాను....''




రెండడుగులు ముందుకి సాగిన బృందావనుడు ఆశ్చర్యంతో ఆగడు. ఆమె మాట పూర్తిచెయ్యకుండానే "ఎందుకొచ్చిన ప్రతిజ్ఞలు అనవసరంగా? నీ గురించి నేను విన్నదేమీ లేదా!" అన్నాడు.

ఈ మాటు కుసుమ మొహంకేసి చూసి యిలా అన్నాడు:—"అదీగాక, ఎవరి నడవడికల్ని గురించిగాని, స్థితిగతుల్ని గురించిగాని విమర్శించటం నా స్వభావం కానే కాదు. నీ స్వభావం, నడవడిక ఎటువంటిదో తెలుసుకోవాలనిగాని, విమర్శించాలనిగాని నాకేం లేదు! నా దృష్టిలో అందరూ మంచివాళ్ళే. నీ విషయంలో కూడా నువ్వు చెడ్డదానివని నే ననుకోవటంలేదు."—అనేసి బృందావనుడు మెల్లిగా బైటికి జారుకున్నాడు.

నెత్తిన పిడుగు పడ్డట్టుగా కుసుమ స్తబ్ధురాలైంది. అంతలో పసివాడు చరణుడు "అమ్మా!—ఏటికెళ్దామా స్నానం చేసుకొద్దామా?" అనడిగాడు.

మాటాడలే, వాడికి జవాబైనా చెప్పలే! వాడిని చంకనేసుకొని గదిలోకి వెళ్ళింది. పసివాడిని హృదయానికి హత్తుకొని వెక్కి-వెక్కి ఏడవనారంభించింది కుసుమ.

# 8

ఎన్నో రోజులు గడిచిపోయినై. మాఘమాసం వచ్చింది. ఫాల్గుణం వెళ్ళింది....

పసివాడు చరణ్ అప్పుడా వెళ్ళడం వెళ్ళడం మరి రానేలేదు. వాడినిక్కడికి బలవంతంగా తీసుకురావడమనేది అసాధ్యం. కుసుమతో ఎటువంటి సంబంధమూ పెట్టుకోపటం వారికిష్టంలేదన్న మాటేగా!

అక్కడి కబుర్లేవీ తెలియడంలేదు. ఉత్తరం రాదామంటే ఆత్మవంచనవుతుంది. ఆ పని చెయ్యకూడదని ఆమె నిశ్చయించుకొంది. అన్న చూడబోతే, అతడిలో కాస్తంతయినా మార్పులేదు. అదే ధోరణి.

ఈ పరిస్థితిలో కుసుమ వీధిలోకి వచ్చి నలుగురితోనూ మసలడమే మానుకొంది. మునుపటిలాగా స్నేహితురాళ్ళతో కలిసి మెలిసి తిరగడమేలేదు తెల్లారగట్ల చీకటితో లేవడం, ఏటికి వెళ్ళి స్నానం చేసుకు నీళ్లు తెచ్చుకోవడం, పోతే—యింటోకి అవసరమైన సరకూ సప్పరా సంతరోజున గోపాలుడి తల్లి తెచ్చిపెడ్తూ వుండేది.

కుసుమకి కుట్టుపని బాగా చేతనవును. చక్కగాచేసి వెంటనే యిచ్చేస్తుంది. దయతలిచి వాళ్ళేమేనా యిస్తే సంతోషిస్తుంది. లేకపోతే నోరుతెరిచి అడగదు. ఈ ఉదారస్వభావంవల్ల కుసుమకి చేతినిండా పని వుండేది.

ఒక దోమతెర పట్టుకుర్చుని లేసు అల్లుతూ తన గదిముందు కూర్చుంది కుసుమ. కాసేపయ్యేక ఎలా చేతపట్టిన సూది అలానే వుండిపోయింది.

ఆనాటి సంఘటన ఆమెకి కళ్ళకక్కట్టినట్టు కనిపించింది. తనకి తెలియకుండా వారినందర్నీ ఏందుకి పిలిచి అన్నగారు మాయపవడం, ఆ ఆహ్వానాన్ని స్వీకరించి బృందావనుడు సపరివారంగా, తీరా కుసుమ చెప్పలేని గుంజాటనలో పడటం, ఈ స్థితిలో ఆమె సిగ్గువిడిచి మొట్టమొదటసారిగా భర్తతో మాటాడటం ...ఇదంతా!

ఇవన్నీ తలుచుకుంటే ఆమెకు భరించలేని దుఃఖం వస్తుంది. దుఃఖసమయంలో పనీ పాటలందు దృష్టి వుండదు.

ఆ రోజున ఇద్దరి మధ్యనీ వాదోపవాదాలు జరిగినై. భోజనం ఏర్పాట్లు ఎలా జరిగిందీ పిట్టకయినా తెలీదు. ఇవన్నీ కళ్ళెదుట మళ్లీ జరిగినట్టే కనిపించాయి. ఆమె కళ్ళవెంట నీటిచుక్కలు టపటపమని రాలాయి.

ఆడపుట్టుక పుట్టినందుకుగాను యింతకు మించిన సుఖాన్ని ఆమె వూహించనూ లేదు. వాంఛింపనూ లేకపోయింది.

ఆ తరవాత—

కడపటిరోజు జరిగిన సంగతి—సమస్తమయిన బంధాలనూ ఆయన తెంచుకు పోయిన దృశ్యం జ్ఞాపకమొచ్చింది. ఆనాడు తను పటుకు చేసిందేముంది? అతడి ఆవేశపూరితమయిన ధోరణిని ఆపటానికి యత్నించలేదు సరికదా పైగా విచ్ఛిత్తికే సాయపడింది. అయితే ఆ సమయంలో పసివాడు చరణుడు ఆమెకు గుర్తేరాలేదు. దానితోపాటు చరణుడు కూడా తనకి దూరమైపోతాడన్న విషయం గుర్తేలేకపోయింది. రోజులు గడవసాగాయి. కుసుమ భయపడిపోయింది. పుత్రవాడిని యిక్కడికి రానివ్వ

రేమో! వాడు రాకపోతే తనొక్క క్షణమైనా జీవించగలదా?

నిజంగా ఆయన తన భర్తే కాకపోయినట్టయితే ఆ భగవంతుడే మరి ఒక దారి యేదో చూపించేవాడు. ఇలా తను ప్రవర్తించటానికి రవంత సిగ్గూ సంకోచమూ వుండాలిగద! ఆయనే తన పతి కాకపోతే, ఈ రెండు గుణాలనూ తన మనస్సులో ఏ మూలనో ఆ దేవుడే మిగిల్చివుండేవాడు.

*　　　　*　　　　*

ఇవాళ సంత జరిగే రోజు. కుసుమ కోసం సంతలో సరకులు తెచ్చిపెట్టడానికని గోపాలుడి తల్లి వెళ్ళి చాలా సేపయింది. ఆమెకోసం ఎదురుచూస్తూ కుసుమ వీధి తలుపు తీసింది.

తీసేసరికల్లా అన్న కుంజనాధుడు ప్రత్యక్షమయ్యేడు. హఠాత్తుగా అతడు కిర్రు చెప్పులు చప్పుడు చేసుకుంటూ నౌకర్ని వెంటబెట్టుకు లోపలికి వస్తూంటే యిరుగు పొరుగులకి ఆశ్చర్యం కలిగింది.

కుంజు తిన్నగా చెల్లెలి ఎదటికి వచ్చి యిలా అన్నాడు: "మీ బృందావనుడికి మళ్ళీ పెళ్ళి!..."

గుండె ఆగిపోయినంత పనయింది కుసుమకు. తలవంచుకొని కొయ్యబొమ్మలా కూర్చుండిపోయింది.

గొంతు పెద్దది చేసి ఇంకా అన్నాడు కుంజు: "నా జమీందారీలో వుంటూ నన్నే అవమానించటమా? చూస్తా—ఈ నందవైష్ణవుడేమిటో, వాడి అతిశయమేమిటో!"

అన్నగారి దూకుడు మాటలేం అర్థం కాలే చెల్లిలికి, "నందవైష్ణవుడెవ రన్నయ్యా?" అంది బాధగా.

"ఎవరా, మన రైతునెరగవ్? చెరువు గట్టున ఇల్లు కట్టుకుని వున్నాడూ, వాడూ! వాడి కొంపకి నిప్పంటించేస్తా, ఆ గాడిద కొడుక్కూతురే ఇప్పటి సంబంధం. ఈ ఫాల్గుణంలోనే పెళ్ళిట! అంతా నిశ్చయమైపోయింది!....రే, భూతా! రెండు పొగాకు ముక్కలిట్రారా!"

అన్న వెంట ఈ భూతాలనే నవుకరొకడు వచ్చాడన్న సంగతి ఆమెకి తెలియనే తెలియదు. శాస్త ఒడిగి కూర్చుంది.

"ఒరే, భూతాయ్; నందుడి కూతురెట్లా వుంటుందిరా?"

అట్టె ఒక్కమాట ఆలోచించి "బాగుంటుందండీ!" అన్నాడు భూతాయ్.

"ఏడిశావ్! నా చెల్లిలికన్నా బాగుంటుందా? ఒక్కనాటికీ వుండదు. ఇదేమిటి, అపురూపసౌందర్యం!" అంటూ దబాయించాడు.

ఇంకా భూతాయ్ జవాబు చెప్పలేదు. ఈ లోపుగానే లేచి లోపలికి వెళిపోయింది కుసుమ. కాసేపయాక చుట్ట కాల్చుకుంటూ చెల్లెలి గది ముందుకు వచ్చాడు కుంజు. "నే మొదటే చెప్పాగా, కుసుమ్! బృందావనుడిలాంటి దౌర్భాగ్యుడూ, విశ్వాస ఘాతకుడూ ఈ ప్రపంచంలో మరొక డుండబోడూ అనీ! ఇప్పుడు నువ్వే చూశావా! నా మాట అక్షరాలా నిజం! మా అత్త అంటూనే వుంటుంది—వేదమయినా అబద్ధ మవుతుందేమోగాని కుంజనాధుడి మాట ఎప్పటికీ అబద్ధం కాదూ అని! ఏరా భూతాయ్! ఇలా అంటుంది కదూ, అత్త?" అన్నాడు.

కుంజనాధుడు ఇంత సంభాషణ జరిపినా లోపల్నించి ఎటువంటి జవాబూ రాలేదు. అతడి మనస్సులో ఏం తోచిందో యేమో, కాలుస్తూన్న చుట్ట అవతల పారేశాడు. తలుపు తోసుకు లోపలికెళ్లి నించున్నాడు.

ఆ సమయాన కుసుమ మంచం మీద బోర్లా పడుకునుంది. ఒక్క క్షణం ఆమె కేసి చూశాడు. చూసేసరికల్లా కుంజకి కళ్లనీళ్లు తిరిగాయి. ఎన్నడూ లేనిది, ఇంత కాలానికి అతడిక్కూడా కళ్లనీళ్లు తిరిగాయంటేనే, ఆ చెల్లెలి దయనీయస్థితి తెలిసి పోతుంది కన్నీళ్లు తుడుచుకున్నాడు. ఆ మంచం మీదనే కుసుమ పక్కని కూర్చున్నాడు. చెల్లెలి తల నిమురుతూ "చెల్లీ! నువ్వేం భయపడకు. ఏది ఏమైనా కానీ, ఈ పెళ్లిమాత్రం జరగ నివ్వను. చూద్దుగాని—మీ అన్న చెప్పిన మాట నెగ్గించుకుంటాడో లేదో? అందరం కలిసి నిన్ను అంతగా బతిమాలాడామే! అప్పుడూ నువ్వు అత్తారింటికి వెళ్లటానికి వప్పుకున్నావా? నోరు తెరిచి ఒక్కమాటయినా అన్నావా?" అన్నాడు.

ఇలా అంటూ వుండగానే కుంజు కంఠస్వరం నిండుకొచ్చింది. కుసుమ తమా యించుకోలేక, బావురుమని యేడ్చేసింది........

సాయంకాలం, ఇంకోసారి అతడు తన చొక్కాచేత్తో కళ్లు తుడుచుకుని, మళ్లీ చెప్పాడు—"చెల్లీ! నువ్వేం ఆత్రపడకు. ఇదే చెప్పడం. ఏ విధంగానైనా సరే, ఈ పెళ్లి కాకుండా చూసే భారం నాది. పడగొట్టి తీరతా!"

దుఃఖంతోనే ఈ మాటు కుసుమ కలగజేసుకుని ఇలా అన్నది! "ఈ విషయంలో నువ్వు జోక్యం కల్పించుకో వొద్దన్నయ్యా!"

ఆశ్చర్యపడ్డాడు కుంజు.

ఏమిటీ కల్పించుకోవద్దూ? పెళ్లి నా కళ్లెదుట జరుగుతూ వుంటే నోరు మూసుకు చూస్తూ ఊరుకోమంటావా? నువ్వనే మాట నాకేం అర్థం కాలే, కుసుమ్!" అన్నాడు.

"ఒద్దన్నయ్యా! ఇందులో నువ్వేం జోక్యం కలిగించుకోవద్దు!" అంటూ మళ్లీ




"పెళ్ళయిన మర్నాడే మా అల్లుడు నా దగ్గర్నుంచి అయిదువేల రూపాయలు అప్పు తీసుకొన్నాడు......"

"ఇంతవరకు ఏమైనా జమ కట్టేడా ?"

"ఆ...అయిదో నాటికల్లా మా అమ్మాయి వచ్చేసింది."

---

చెప్పింది.

కుంజుకి విపరీతంగా కోపమొచ్చేసింది.

"ఒద్దూ. జోక్యం కల్పించుకోవద్దూ? నీ ఇష్టమేమిటి మధ్యని ? తప్పకుండా కల్పించుకుంటాను. కల్పించుకు తీరతా ! పెళ్ళి సంగతి నీకైతే అవమానమన్పించటం లేదేమోగాని, నాకు మట్టుకు అవమానమే ! తీరని అవమానం ! నేను సహించలేనీ అవమానం !" అని గద్దించాడు.

దిండులో మొహం దాచుకుని కుసుమ ఇలా అన్నది: "అన్నయ్యా, నే వొద్దంటున్నానంతే ! ఈ విషయంలో నువ్వెంత మాత్రం జోక్యం కల్పించుకోవద్దు. వారితో మనకున్న సంబంధం యేమిటి ? ఏమీ లేదు. ఇప్పుడీ విషయంలో నువ్వు రభస చేశావంటే, ఇంకేమన్నా వుందా ? లోగడ వచ్చిన అపవాదులే చాలు. ఆ అపవాదులు యింకా దేశమంతటా ప్రచారమయ్యేట్టు చెయ్యబోకు....ఆ పెళ్ళి జరిగితే జరగని—"

కుంజు మండిపడ్తూ "వీ....ల్లే....దు!" అన్నాడు, కచ్చితంగా, కఠినంగా.

శాసించినట్టుగా.

"ఎందుకు వీల్లేదు?" తలాయించి అడిగింది కుసుమ వెంటనే బతిమాలాడుతూ, దీనంగా ప్రాధేయపడుతూ ఇలా వేడుకుంది: "నీ పాదాలట్టుకుంటానన్నయ్యా! అనవసరంగా ఈ పెళ్ళికి అడ్డు పడకు. నానా రభసా అవుతుంది. నన్నొదిలేసి ఆయ ఇదివరకే ఒక పెళ్ళి చేసుకున్నారు కదా, ఇప్పుడు పోనీ, మరొకసారి ఇంకో పెళ్లి చేసుకుంటారు! నాకు రెండూ ఒకటే గనుక గొడవ చెయ్యకు. ఉన్న గౌరవం కాస్తా పోగొట్టకు. ఆయన ఎలాగోలా సుఖపడితే, అదే మనకి పదివేలు!"

"నాకు తెలియదా చెల్లెమ్మా, నీ సంగతి? మొదట్నించీ తెలుసు, ఓసారి నువ్వు కాదంటే—అవుననిపించటం ఆ బ్రహ్మతరం కూడా కాదు, నువ్వెవరి మాటా వినవు. నీ మాట మాత్రం అందరూ వినాలి, ఇదేగా నీ ధోరణి?"

మాటాడలేదు కుసుమ. మళ్లీ అన్నాడు కుంజనాధుడు: "అందులో వాళ్ళ తప్పేం లేదులే చెల్లీ! ఎన్ని విధాల నచ్చ చెప్పినా, నువ్వేమో అత్తారింటికి వెళ్లనైతివి. అటువంటప్పుడు ఆయనగారి సంసారం ఎలా సాగుతుందనుకున్నావ్? ఎల్ల కాలం బృందావనుడి తల్లి బతికి వుండదుగా?"

ఈ మాటక్కూడా కుసుమ బదులేం చెప్పలే!

కాసేపు ఆగి, కుంజుడు హఠాత్తుగా ఆవేశంతో అన్నాడు—"అతడు పెళ్ళి చేసుకోనీ, చేసుకోకపోనీ —మధ్యని నువ్వెందు కింతిలా ఏడుస్తావ్?"

ఈ ప్రశ్నతో ఆమె దుఃఖం ఇంకా హెచ్చింది. కుంజుడు లేచి వెళ్లాడు. ఆ తర్వాత కుసుమకు ఆనాటి మాటలన్నీ జ్ఞాపకానికి వచ్చాయి. సిగ్గుతో కుంగిపోయిం దామె.

"ఇందుకనే కాబోలు, నేనెంత ప్రాధేయపడి కోరినా నాకు దిక్కు చూపటానికి ఆయన వశం కాకపోయింది. చూడబోతే అక్కడ ఇంకో పెళ్ళికి ప్రయత్నాలు జరుగు తున్నాయి. ఆ సంగతి తెలుసుకోకుండా, ఆ యింటి కోడల్ని అంటూ చెప్పుకొని గర్వించేను."

ఇలా వలపోసుకుంటూ వుండగా ఒక పెద్ద నిట్టూర్పు ఆమె హృదయాన్ని చీల్చుకు వచ్చింది.

"అందుకోసమేనా భగవంతుడా, వారికి నా చరిత్ర తెలుసుకుందామని గాని, నా స్వభావం గ్రహిద్దామని గాని కాస్తంతైనా కుతూహలం లేకపోయింది? అయినప్పటికి, సిగ్గు విడిచి నేను శపథం చేయబోయానే! ఎంత అవమాన కరమైన సంగతి!"

# 10

ఎటువంటి గడ్డు పరిస్థితులైనా రానీ, మనస్సు చలించి పోవటం—కోపగించు కోవటం—ఇటువంటి అవగుణాలను అసహ్యించుకుంటాడు బృంద. ఎంత కోపం వచ్చినా అసమానమైన నిదానంతో వ్యవహరిస్తాడు.

అయినా ఆనాడు బృంద ఇందుకు భిన్నంగా మసులుకున్నాడు. ఆ రోజున కుసుమ నిష్ఠురవాక్యాలకూ, అభియోగాలకూ తమాయించుకోలేక నిజంగానే కోపగించు కున్నాడు. కొన్ని కొన్ని వాక్యాలకు కటువుగా బదులు చెప్పాడు కూడా. అప్పట్నించీ అతని మనస్తాపానికి అంతు లేకుండా పోయింది....అందు చేతనే మర్నాడు పొద్దుటే చరణుడిని తీసుకురావాలనే మిష కల్పించుకుని, ఒక దాసీని, నవుకర్నీ యిచ్చి బండి పంపించాడు.

"కుసుమ తెలివి గలది. నేను చేస్తున్న ఈ పనిలోని అంతర్యాన్ని ఇట్టె గ్రహించగలదు. కనుక తనే తప్పక బయల్దేరి వస్తుంది" అని ఆశించాడు బృందావనుడు.

తను అనుకున్నట్టు ఆమె నిజంగానే వస్తే, ఒక్క రోజుకే అయినప్పటికీ, ఏర్పాట్లు ఎలా చెయ్యడం?—అని ఒక ప్రశ్న. దీనికి సమాధానమూ తనే చెప్పేసు కున్నాడు. "వస్తే రానీ, బెంగెందుకు? అన్నిటికీ అమ్మే వుందిగా! అని బృంద తల్లికి గల కార్యదక్షత అసమానమైనది. ఎన్నెన్ని చిక్కులు రానీ, ఆమె ఏదో ఉపాయం చేసి అంతా కూడా సానుకూల పరుస్తుంది. ఇటువంటి నమ్మకం వుండ బట్టే, తల్లితో ఒక్క ముక్కయినా చెప్పకుండా అక్కడికి బండీ పంపించాడు. ఆశతో, ఆనందంతో, సిగ్గుతో, భయంతో కుసుమకోసం ఎదురు చూస్తూ కూర్చు న్నాడు. "అమ్మని క్షమాపణ కోరుకోటానికైనా ఆమె రాకపోతుందా!" అన్న నమ్మకంతో అతనీ పని చేశాడు,

చండీ మండపం మీది నుంచి చూస్తే, అనుకున్నట్టూ బండీ రావటం కనబడింది. అయితే—బండీలో చరణుడు ఒక్కడే రావడం చూసి, బృందావనుడు చకితుడ య్యాడు.

* * *

లోగడంతా ఎంతో చక్కగా, కట్టుదిట్టంగా నడిచింది బృందావనుడి పాఠశాల. ఇపుడు పంతులుగారు మరీ పరధ్యానంలో పడివుండడం చేత ఆ పద్ధతీ—కట్టుదిట్టం పూర్తిగా మారిపోయింది. పంతులు గారికి శ్రద్ధ తగ్గటంతో బళ్లో పిల్లలూ తగ్గుతూ

వచ్చారు.

పదిరోజుల తరవాత ఒకనాటి సాయంత్రం——

పిల్లలంతా వరసగా నించున్నారు. గొంతు చించుకొని గట్టిగా యెక్కాలు వల్లిస్తున్నారు. వాళ్ళు తప్పు చెబితే పట్టుకోవాలని బృందావనుడు శ్రద్ధగా కనిపెట్టానే వున్నాడు.

అంతలో ఒక పెద్ద మనిషి లోపలికి వచ్చాడు. బృందావనుడు ఒక చాప తీసుకు వచ్చి వేశాడు. అతడు చాప మీద కూర్చొని "ఏం అన్నా! ఇంకా నన్ను గుర్తు పట్టలేదా?" అనడిగేడు. సిగ్గేసింది బృందకు "లే....దు .." అన్నాడు నసుగుతూ.

"నేను కేశవుడిని"

ఈ పేరు చెవిని పడగానే ఎగిరి గంతేసి, తన బాల్య స్నేహితుడిని కౌగలించు కున్నాడు బృంద. లోగడ తను ఇంగ్లీషు నేర్చుకున్న దుర్గాదాస్ మేస్టారి మేనల్లుడే ఈ కేశవుడు. ఇదివరకు అంటే పదిహేను పదహారేళ్ల క్రిందట ఇక్కడ అయిదారు నెలలు వుండి వెళ్లాడు. అప్పుడే వీళ్ళిద్దరికీ ప్రాణస్నేహం. నాటికి నేడే మళ్లీ వీళ్లిద్దరూ కలుసుకోవటం అయినప్పటికీ ఒకరినొకరు మరిచిపోలేదు. తన బాల్య స్నేహితుడైన కేశవుడి యోగక్షేమాలు మేస్టారి ద్వారా తెలుసుకుంటూ వుండేవాడు బృందావనుడు.

ఎం. ఏ. పాసయ్యాడు కేశవుడు. అయిదారేళ్ల క్రితమే ఒక కాలేజీలో ప్రొఫె సర్‌గా చేరాడు. ఇప్పుడతని విదేశీ పర్యటన గవర్నమెంటు పనిమీద.

మిత్రులిద్దరి మధ్యనీ కుశలప్రశ్నలూ అవీ అయిన తర్వాత ఎంతో అప్యాయంగా వివిధ విషయాలపైన సంభాషణలు నడిచాయి. కేశవుడిలా అన్నాడు :

"బృందావన్! మా మామయ్య ఎన్నడూ అతిశయోక్తి కూడా చెప్పడు. గతవారం నిన్ను గురించి రాసిన వుత్తరంలో ఇలా వుంది: "జీవితంలో నేను ఎంతో మంది శిష్యులకు చదువు చెప్పాను. కానైతే ప్రియశిష్యుడు బృంద తప్ప మరెవరైనా వృద్ధిలోకి వచ్చారా అన్న విషయం నాకు సందేహమే——"అంటూ ఇంకా చాలా చెప్పారులే. అందుకని, దేశం వదిలి వెళ్లబోయే ముందు ఒక్కసారి నిన్ను చూసి పోదామని వచ్చా!"

దీనికి సమాధానం ఏం చెప్పాలో బృందకి ఏమీ తోచలే. ఈ లోకంలో తనను ఇంత ఇదిగా స్తోత్రం చేసేవాళ్లుంటారని అతడు కలలో కూడా తలచలేదు.

"బ్రహ్మాండమైన పాఠశాల స్థాపించావుట. జీతం కూడా పుచ్చుకోకుండా ఉచితంగా విద్య చెబుతున్నావుట. పైగా పిల్లాళ్లకి పలకా, బలపాలూ, పెన్సిళ్లూ, పుస్తకాలూ



కూడా నువ్వే కొని యిస్తున్నావుట. ఇంతవరకూ నువ్వు చేసేది బాగానే వుంది. నీతో నేను పూర్తిగా ఏకీభవిస్తా.

కాని ఇంతమంది కుర్రాళ్లని ఎలా పోగు చేస్తున్నావ్ అన్నా? విశ్వప్రయత్నం చేసి, నేను నలుగుర్ని కూడా చేర్చలేకపోయాను.'' అన్నాడు కేశవుడు.

కేశవ చెప్పిన మాటలేవీ బృందకి అర్థం కాలే. ఆశ్చర్యంతో చూస్తూ కూర్చున్నాడు....నవ్వాడు కేశవ.

''నేను చెప్పేది నిజం అన్నా! చదువుకున్న పిల్లలు వాళ్ల మంచి చెడ్డలు వాళ్లే ఆలోచించుకోగలరు, కనుక చిన్న పిల్లలకి విద్య చెప్పించటం ముఖ్యం. అది లేకుండా వాళ్లకి మరేమిచ్చినా అదంతా ఉత్త దండుగ. వృధాశ్రమ. ఇది గ్రహించిన వాడివి గనుకనే చేతిడబ్బు వెచ్చించి ఒక గొప్ప పాఠశాలను దివ్యంగా నడుపుతున్నావు. నేనూ ఇటువంటి పాఠశాల స్థాపించాలన్న ఉద్దేశ్యంతోనే పెళ్లి చేసుకోవటం కూడా మానివేశా. ముందుగా ఒక చిన్న పాఠశాల తెరిచి, క్రమంగా దాన్ని ఉన్నత పాఠశాలగా మార్చాలని ఉద్దేశ్యపడ్డా. కాని సాగలేదు. పిల్లలే దొరక్కపోతే - ఇహ పాఠశాలేమిటి, నా మొహం! మా వూరి రైతు జనంలో ఎంత మూర్ఖత పాదుకొని వున్నదంటే—''మా పిల్లలకి చదువూ వొద్దూ, గిదువూ వొద్దూ, పో, పోవయ్యా! పొలంపన్లు పాడవుతై పంతులూ!'—అని నిరసనగా మాటాడ్తారు. జ్ఞానమే వొద్దు అనే పశుప్రాయుల్ని మరి ఒప్పించడమెలా? అయినా, అభిమానం చంపుకుని వాళ్ల ఇళ్ల చుట్టూ తిరిగా. ఏం లాభం లేకపోయింది!'' అన్నాడు కేశవ.

ఈ ప్రసంగం వినగానే బృందావనుడి ముఖం జేవురించింది. కాని కోపం

తెచ్చుకోలే. శాంతంగానే బదులు చెప్పాడు: "గొప్పవాళ్లు నిర్వహించే పాఠశాలకి వాళ్ల పిల్లల్ని పంపకపోవడం నిజంగా ఆ రైతుల అదృష్టమే!"

ఈ మాటలోని వ్యంగ్యం కేశవుడి గుండెకి సూటిగా వెళ్ళి తగిలింది. చాలా నొచ్చుకున్నాడు. "అది కాదన్నా!—మీలాంటి వాళ్ల గురించి కాదు...నేననేది...." అన్నాడు.

ఇందుకు బృంద బదులు చెప్పాడు.

"అదీ తెలుసులే నాకు. నువ్వు మమ్మల్ని వేరు చేదామని చూస్తే కూడా మేం విడిపోము. నామట్టుకు నేను స్వయంగా వ్యవసాయదారుడిని. నాగలి బుజాన వేసుకు మోస్తా. చేతపట్టి దున్నుతా. పొలం పండిస్తా. నేను రైతుని గనకనే నేను స్థాపించిన పాఠశాలకు పిల్లలు వచ్చారు. మీ పాఠశాలకు రాలేదంటే దానికిదే కారణం! రైతు బిడ్డలకి చదువు చెప్పాలంటే నేనూ ఒక రైతునయివుండాలి. అప్పుడే వాళ్ళకి నామీద నమ్మకం కుదురుతుంది. నన్ను చూస్తే బిడియపడరు. నీదగ్గరికి పిల్లలు రాలేదంటే వాళ్ళకి సహజమైన చనువు లేదు. అంచేత చొరవ చేసుకునిరావటానికి సాహసించలేక పోయారు.

"మేము—అంటే మా జాతివాళ్లం చదువూ సంధ్యాలేని దరిద్రులం. మాలో వుండే ఈ పెద్దలోపాన్ని బయటపెట్టలేం. జంకుతాం. మీరు మమ్మల్ని చూసి తక్కువ వాళ్ళంటారు. నిజమే ననుకుంటాం మేము. అనుకుంటామేగాని మా అంతరాత్మ మట్టుకు ఒప్పుకోదు."

సిగ్గుపడ్డాడు కేశవుడు. తలవంచుకునే బృంద చెప్పేదంతా వింటున్నాడు. ఇంకా చెబుతున్నాడు బృంద:

"మా అంతరాత్మ ఒప్పుకోకుంటే ముప్పు మాకేనన్న సంగతి తెలుసు. అయినా సరే—మిమ్మల్ని మా ఆత్మీయులుగా శ్రేయోభిలాషులుగా ఎంచుదామంటే మాకు భయం. మా హృదయాల్లోనూ దేవుడున్నాడు. మీరు మాపట్ల చూపే జాలీ, సానుభూతీ, మీరు మాకు చేసే ధర్మాలూ ఆదేవుడి హృదయాన్ని గాయపరుస్తాయి కాని, ఆయనని సంతోషపెట్టవు."

ఈమాటు కేశవుడు మౌనంగా వూరుకోలే. ప్రతివాదన ప్రారంభించాడు: 'నిజంగా మీరంటె మాకేం అసహ్యం లేదు. మేం మీశ్రేయస్సు కోరుతున్నవాళ్ళమే. మీరు విడిపోయి వుందా మనుకోవడం అన్యాయం. మమ్మల్ని మనసారా విశ్వసించటం మీ విధి. మేము శిక్షాసంస్కారం పొందినవాళ్ళం కావడంచేత మీకు ఏది శ్రేయస్కర మైందో, ఏది కాదో మాకు బాగా తెలుసు!"

''మీరు మా (శ్రేయస్సు కోరుతున్నారు....కాని ఆత్మీయులుగా కాదు—మేము సేవకులం, మీరు యజమానులు అన్న భావంతోనే....పేదవాళ్ళ పిల్లలు మీతో పాటే చదువుకుంటారు, పెద్దవాళ్ళవుతారు. ఈ చదివిన పిల్లలు, చదువురాని వాళ్ళ తలిదం(డుల్ని మన్నించడం మాట అటుంచి—చాలా హీనంగా చూస్తారు. చదువువల్ల కలిగే ఈ పరిణామాల్ని, దుష్ఫలితాల్ని, గమనించే, మా వాళ్ళకి చదువంటే భయం పట్టుకుంది. ముందుగా నువ్వు నేర్చుకోవలసింది—దేశంలో పేదవాళ్ల పట్ల ఆత్మీయత చూపటం, తర్వాత వాళ్ళ (శ్రేయస్సు కోరటం, ఆ తర్వాతే వాళ్ళ పిల్లలకి చదువు సంధ్యలు చెప్పడం మాట! అప్పుడే మా పిల్లలు మమ్మల్ని, అగౌరవపరుస్తారని గాని, మా సంఘాన్ని ధిక్కరిస్తారని గాని, వంశపారంపర్యంగా వస్తున్న వృత్తి విద్యల్ని, వదిలేస్తారనిగాని, మానుండి వేరైపోవటానికి వాళ్లు కుతూహలపడతారని గాని మాకు వుంటున్న, భయం సమసిపోతుంది.

''అటువంటి నమ్మకం మీరు మాకు కల్గించేటంతవరకూ ఎంత (శమపడినా సరే, నీ పాఠశాలకు బీదవాళ్ళ పిల్లలు రారు—రారు! చదువుకున్న గొప్పవాళ్ళని తక్కువ జాతివాళ్లు గౌరవిస్తారు. వారంటే వీళ్ళంతా భయభక్తుల్తో మసులుకుంటారు. కాని వారిని మా(తం నమ్మరు. విశ్వసించరు. వారి మాటకి లోబడరు.'' అని ఆగేడు బృంద.

''సరే లేవయ్యా, నీ మాటే నిజమనుకుందాం. అయినా ఒక్క సంగతి అడుగుతా చెప్పు! అన్యోన్యం, విశ్వాసం ఉభయులకూ వుండాలి. అవి లేకపోతే మేమెంతగా (ప్రయత్నిస్తే మట్టుకేం లాభం? పరస్పరవిశ్వాసం వున్నప్పుడు గదా, వాళ్ళకి మేం ఆత్మీయులమో, పరాయివాళ్ళమో తెలిసేది. మరి, దీనికి ఉపాయమేమిటి? నువ్వే చెప్పూ!''

ఇందుకు బృందావనుడు యిలా సమాధానమిచ్చాడు!

''జీవనోపార్జనకి మేము అవలంబించే పద్ధతులు మీ పద్ధతులకి భిన్నంగా వుంటాయి. ఇవేవీ సమన్వయించుకోకుండా మీరే ఏదో ఒక మార్గం నిర్దేశించటం, దాని అవలంబన వల్లనే మాకు మేలు జరుగుతుందనీ, లేకపోతే లేదు అని శాసించినట్టుగా చెప్పడం—ఇలా అంటే మీమీద మాకెలా నమ్మకం కలుగుతుంది.''

''అంటే నీ ఉద్దేశ్యం నాది పనికిమాలిన పని అందామనా?''

''నిజంగా అంతే, కేశవ్! హృదయం వుండొచ్చు, ఒక గొప్పకార్యం నిర్వహిద్దామని వాంఛా వుండొచ్చు, దేశానికి మేలు చెయ్యాలంటే ఈ రెండూ చాలవు.... కావలసిందేమిటంటే ఎవరికి మంచి చెయ్యాలని వాంఛిస్తున్నావో, వారితో కలిపి

మెలిసి వుండాలి. వారి కష్టసుఖాలు పంచుకోవాలి....సరే—ఇప్పటి కీ ప్రసంగం ముగిద్దాం. పొద్దు గూకింది. అవతల పాఠశాలకూడా చూసుకోవాలి,'' అని చెప్పాడు

''సరే చూసుకో—రేపు వస్తా!'' అంటూ, కేశవుడు మిత్రుడికి సాష్టాంగ నమస్కారం చేశాడు.

కేశవుడికి వాళ్ళ గ్రామంలో కొంపా గోడీ వున్నాయి. అయినా, అతడి నివాసం బస్తీలో. అతడు పట్నవాసి. స్నేహితుడి వాగ్ధోరణికి కేశవుడు మనస్సులో చాలా బాధపడ్డాడు.

ఉభయులూ వరండాలోకి వచ్చారు. వచ్చేసరికి వారికి పిల్లలంతా మోకరించి నమస్కరించారు.

బాల్యస్నేహితుడైన కేశవుడిని గుమ్మందాకా సాగనంపాడు బృంద. వెళ్లేటప్పుడు ఇలా అడిగాడు: 'కేశవ్, నువ్వు స్నేహితుడివన్న మాట అటుంచి, బ్రాహ్మణుడివి, అందుకోసమే నా తరపునా, మా కుర్రవాళ్ళ తరపునా నేను నీకు నమస్కరించాను. స్వీకరించినట్టేనా?''

నవ్వాడు కేశవుడు. ''స్వీకరించా'' అని చెప్పి సిగ్గుతో బయటికి వెళ్ళిపోయాడు.

## 11

''నాయనా, బృందా! చప్పున బయటికి రా ఓమాటు!'' అని పిలిచింది.

తక్షణమే బయటికి వచ్చిన బృందకు ఏడుస్తూన్న గొల్ల శివుడి కొడుకు కనిపించేడు. వాడి తండ్రికి కంటిచూపు లేదట. మాటకూడా పడిపోయిందట. బృంద ఆ కుర్రాడి కన్నీరు తుడిచి అమట్టునే శివుడింటికి వెళ్లాడు.

ఇంటికి పోయి చూస్తే, శివుడు అటా ఇటా అనే స్థితిలో వున్నాడు. అతనికి నిన్న రాత్రే కలరా తగిలింది. ఇప్పటిదాకా మందూ లేదు, మాకూలేదు ..బృందావనుడు వెళ్ళిన గంటకల్లా వూపిరి వదిలాడు.

ఏటా ఇదే ఋతువులో ఈ ప్రాంతాలలో కలరా వ్యాధి కనిపిస్తూనే వుంటుంది. బెంగాల్ రాష్ట్రపు ప్రతి గ్రామంలోను స్వయంకృషివల్ల వైద్య విద్యనేర్చి, డాక్టర్‌గా చలామణీ అయ్యేవాళ్లు ఒకరిద్దరుంటారు. అంతే! ఇప్పుడీ గ్రామంలోనూ అలాంటి డాక్టర్ ఒకాయన వున్నాడు—డాక్టర్ గోపాల్.

బృందకి ఆ వూళ్లో పలుకుబడీ గౌరవమూ వున్నాయి. చచ్చిన భర్త చావగా ఇపుడు గొల్ల శివుడికి అంత్యక్రియలు జరపట మెలాగా అని బెంగపట్టుకుందా ఇల్లాలికి. ఆస్తి అంతా పోగా మిగిలిందల్లా రెండావులు....ఉదారహృదయంగల బృందావనుడు శివుడికి




అంత్యసంస్కారం జరిపించి ఇల్లు చేరుకునేప్పటికి రెండు జాములయింది.

సాయంకాలమైంది. ఈలోగా గొల్ల శివుడి కొడుక్కికూడా కలరా తగిలిందని కబురు వచ్చింది. వెంటనే బయలుదేరాడు. అక్కడ డాక్టర్ గోపాల్‌కూడా వున్నాడు. వాడి నాడిపట్టి చూశాడు. నాలిక పరీక్షచేసి యేదో మందిచ్చాడు. ఇచ్చాడు గాని ఏం లాభం? ఇంకా తెల్లారకముందే పసివాడు కిష్టుడు గోపాల్ హస్తవాసి నుంచి తప్పించుకుని, తన తండ్రిని కలుసుకోవటానికి ప్రయాణం కట్టేడు—కిష్టుడి శవాన్ని ఒళ్లో పెట్టుకుని విలపిస్తున్న, ఆ తల్లి హృదయవేదన ఏమని చెప్పటం?

బృందావనుడు విలవిల్లాడి పోయాడు. అతడికీ ఒక పసివాడున్నాడుగా గబగబ ఇంటికి పరుగెత్తుకొచ్చాడు, చరణుడిని గట్టిగా గుండెకు అదుముకొని, కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు.

"భగవాన్!—మానవులు చేసే అపరాధాలకు ఏ శిక్షయినా విధించు. కాని ఇటువంటి శిక్షమాత్రం విధించకు!" అనుకున్నాడు

తర్వాత రెండు మూడు రోజులు ఎటువంటి దుష్టవార్తలూ చెవిని పడకుండా, సవ్యంగానే గడిచిపోయినై. అంతలోనే—నలుగురు పసిబిడ్డల్ని దిగవిడిచి, రసిక్‌లాల్ భార్య ఈలోకం వదిలి వెళ్ళిపోయిందని పిడుగులాంటి వార్త!

అదేం దురదృష్టమోగాని, ఈ కలరా చాలదన్నట్టు—ఈమాటు భయంకరమైన ప్లేగు పుట్టి వాయువేగంతో వ్యాపించింది. చాలామంది వూరు విడిచిపోసాగారు. చుట్టుపక్కల గ్రామాలనుంచి కూడా రెండు మూడు చావు కబుర్లు తెలిశాయి.... అనాటి కానాడు ఊళ్లో ప్లేగు వ్యాధి భయంకరంగా పరిణమిస్తూంది, వైద్య విషయం చూద్దామా

అంటే డాక్టర్ గోపాల్ తప్ప మరొక వైద్యు డెవడూ లేడు. ఆ గోపాల్ డాక్టర్‌కి పేదవాళ్లింటికి వెళ్లాలంటే అసలే తీరదు. చివరికి—చచ్చిన ఆత్మలకు అంత్యక్రియలు జరపడమనేది అసాధ్య కార్యమైంది.

బృందావనుడు రోజురోజుకీ చిక్కిపోసాగాడు. కుర్రవాడి మొహం చూసేప్పటి కల్లా అతడి ఒంట్లో నెత్తురు ఉడుకెత్తుతూంది.

"అంటువ్యాధులు సోకడానికి ఎన్నో విధాలైన బాహ్య సంపర్కాలున్నాయి. వీట న్నిటి నుంచీ, రోగంనుంచీ, మృత్యువునుంచీ నా బిడ్డను నేనెలా తప్పించగలను? ఆ పసి ఎక్కడ దాచను? ఇదెలా సాధ్యం?" ఇదే బృందకి పట్టిన తీవ్రాలోచన.

ఈ గడ్డు స్థితిలో పాఠశాల దానంతటదే మూలపడింది. ఇలాంటి పరిస్థితిలో ఒక నాడు పక్కింటి తారిణీ ముఖర్జీగారి చిన్నవాడికి అమ్మవారు చూపిందని విన్నాడు. దాంతో బృందావనుడి ముఖం నల్లబడిపోయింది.

చరణుడిని తీసుకుని బృందను ఏవూరైనా వెళ్లి కొన్నాళ్లుండమన్నది అతని తల్లి. "నువ్వూరా" అని తల్లిని పిలిస్తే ఆమె ససేమిరా రానన్నది. "అయితే, నే వెళ్ళేదీ లేదని" జవాబిచ్చేడు బృంద. ..మర్నాడు తారిణీ ముఖర్జీ కొడుకు పోయాడు. ఆ మర్నాడు ఏదో పనిమీద వెళ్తున్న బృందకు, తమ స్వంత చెరువువద్ద ఒకామె బట్ట లుతుకుతూ కన్పించింది. దాంతో నాలుగు కేకలేసి ఆమెను పంపేశాడు.

అంతలో ఆటే వస్తున్న, తారిణి కనిపించాడు. ఒకవంక పుత్రశోకం. ఇంకోవంక అవమానం వస్తూనే పిచ్చెక్కిన వాడిలా కళ్లూ ముఖం పెట్టాడు. "ఏమయ్యా, మా ఇంట్లో వాళ్లోస్తే చెర్లో దిగొద్దన్నావుట?" అన్నాడు.

"చెర్లో దిగొద్దనలే, మైలగుడ్డలు ఉతకొద్దన్నాను."

"అయితే ఎక్కడ వుతకమంటావ్? మరే వూరు పొమ్మన్నావ్? అంత గర్వం కూడదు నీకు! అహంకారపడి బ్రాహ్మడి మనస్సు కష్టపెట్టావంటే—వంశనిర్మూల నమై పోతావ్!" అంటూ ఉరుముల్లా అరుపులు మొదలెట్టాడు.

"ముఖర్జీగారూ! అమ్మవార్ల ప్రభావంతో వూరంతా పాడుపడింది. ఈ చెరు విలా వుండబట్టే ఈ బజారు కాస్త నిలబడింది. తాగడానికి తప్ప బట్టలు గుంజడానికి ఈ నీరు వాడొద్దు!" అని శాంతంగానే సమాధానమిచ్చేడు బృంద.

"కులం తక్కువైనా నీకు అహంకారం మాత్రం ఏం తక్కువలేదు. మా ఆడ వాళ్లు ఎక్కడో డొంకల్లోకి పోయి ఉతుక్కోవాలా? ఈ ఆపద నా ఒక్కడి ఇంట్లోనే అనుకున్నావేమో....నీ యింటికీ వస్తుంది జాగ్రత!" అంటూ గర్జించాడు.

ఏమన్నా బృంద శాంతంగానే వున్నాడు.



"మీరు పుత్రుదు దుఃఖంలో వున్నారు. కటువైన మాటలంటే బాధపడతారు. కానీ మీరు వెయ్యి శాపనార్థాలు పెట్టినా సరే—ఈ చెర్లో నీళ్ళు పాడుచెయ్యడానికి నేనొప్పుకోను." అని చెప్పేసి, ఇంటికి వెళ్లిపోయాడు.

పది నిమిషాలయ్యేక—

తారిణీ ముఖర్జీకి ఆత్మీయుడైన ఘోషాల్ మహాశయుడు వచ్చి "బృందావన్, పాపం బ్రాహ్మడు! పుత్రశోకంతో వున్నాడు. వాళ్ళ ఆడాళ్ళని చెరువుకి రావొద్దనడం భావ్యంగా వుందా నీకు?" అని నిలదీసేడు.

"ఊళ్లో చెరువులన్నీ చెడి పూరుకున్నాయి. ఇక మిగిలిందీ చెరువొక్కటే! కనుక ఏమైనా సరే, ఈ చెరువులో నీళ్లు పాడుచేసి, రోగాలు వ్యాపించడానికి ఒప్పుకోను!" అన్నాడు బృందావనుడు.

"శాస్త్రోక్తంగా ప్రతిష్టించిన తటాకం నీళ్లు వాడితే రోగాలు వ్యాపించవ్. మహా నేర్చావులే నాలుగు ఇంగ్లీషు ముక్కలు!" అన్నాడు ఘోషాల్ చర్రున కోపం తెచ్చుకుని

"మా చెరువు నీళ్ళ వాడకం విషయంలో నేను చెప్పినట్టూ జరగాల్సిందే! ఎవరైనా అంటువ్యాధులవల్ల చచ్చిపోతే—వాళ్ళ తాలూకు గుడ్డలు తగలపెట్టాలి. డాక్టర్లూ వైద్య ప్రముఖులూ ఇదే సలహా ఇస్తారు. ఆ దొంకలో చెరువుకి పోయి బట్టలుతుక్కోవచ్చుగా, మా చెర్లో అలాంటిపని చెయ్యడానికి వీల్లేదు!" అనేసి అతడు లోపలికి వెళ్లిపోయాడు.

మనస్సులోనే శాపనార్థాలు పెట్టుకుంటూ ఘోషాల్ వెళ్లిపోయాడు....ఇది పని

గాదని చెరువుకి ఒక మనిషిని కాపలా పెట్టాడు. అయినా ఏదో సందు చూసుకుని తారిణి విధవకూతురు బట్టలుతుక్కుని పోతూంది.

# 12

మరునాడుదయాన్నే—

తల్లి చెప్పిన ప్రకారం బృందావనుడు పసివాడిని చేరబిలిచాడు. "చరణ్! నువ్వు మీ అమ్మ దగ్గరకు వెళ్తావురా?" అనడిగేడు.

ఉత్సాహం కొద్దీ కుర్రవాడు "ఓ, వెళ్తా నాన్నా!" అన్నాడు.

"నన్నొదిలిపెట్టి చాలా రోజులక్కడ వుండగలవా?"

"ఉండగలన్నాన్నా." అన్నాడు తల తిప్పుతూ.

ఎటు చూసినా పసివాడికి బెంగ, భయం, ఆదుర్దా! ఇదంతా ఏమిటో వాడికి అర్థం కావటంలే. పోనీ, అక్కడికి వెళ్తే అయినా ఈ బాధ తొలగిపోయి, శాన్తి హాయిగా వుంటుందేమో! అక్కడ అగాధమైన తల్లి ప్రేమ లభిస్తుంది. కావల్సినంత స్వేచ్ఛ ఇష్టారాజ్యంగా మసులుకోవచ్చు. సరదాగా ఏటిస్నానం, దివ్యమైన భోజనం, కోరుకున్న ఆటలు—

"సరే వెళ్ళు" అంటూ ఒక చిన్న పెట్టెలో కుర్రవాడి లాగూలూ, చొక్కాలూ సర్ది, ఖర్చుకి కొన్ని రూపాయలు కూడా వుంచేడు. తల్లి దగ్గర శలవు తీసుకున్నాడు. చరణ్‌ని బండీ యెక్కించి, తానూ పక్కనే కూర్చున్నాడు.

* * *

కుంజనాథుడి ఇంటి ముందుకి వచ్చి ఆగింది బండి. ఆ యింటి వాతావరణం చూసి ఆశ్చర్యపోయాడు బృంద, అంతా పాడుపడినట్టుంది. కుర్రవాడిని తీసుకొని లోపలికి వెళ్లాడు. అక్కడా అలాగే వుంది.

సవ్వడి విని ఇవతలికి వచ్చిన కుసుమ, తండ్రీ కొడుకులు కంట బడడంతో ఈర్ష్యా అభిమానం ముంచుకొచ్చి మండి పోయింది. చటుక్కున వెనక్కు తిరిగి గదిలోకి వెళ్ళిపోయింది. చరణ్ పరుగెత్తుకుంటూ వచ్చి తల్లిని చుట్టేసుకున్నాడు.

"కుంజుదా ఏడీ?" అన్నాడు బృంద.

"బైటికెళ్లేడు!

"ఈ మధ్య మీరేదేనా వూరెళ్లేరా?"

"అవును."

"ఎక్కడికి?"

"చాలా చోట్లకి"

అవమానాలు జరుగుతాయని అనుకుంటూనే వున్నాడు బృంద. అన్నిటికీ సిద్ధపడే వచ్చాడు.

కాసేపు వూరుకుని నిస్త్రపతతో మెల్లిగా ఇలా అన్నాడు బృంద:—"నేనిక్కడ అట్టే సేపుండి నిన్ను విసిగించన్లే. నే వచ్చిన పని ఒక్క ముక్కలో చెప్తా. మావూరి నిండా చాలా జబ్బులు వున్నాయి. అందుకని కుర్రవాడిని నీ దగ్గర ఒదిలి వెళదామని ..."

ఆ వూరి సంగతి కుసుమకింకా తెలియలేదు.

"ఏ వూళ్లో జబ్బుల్లేవూ? ఒకళ్ల పిల్లవాడి బరువు బాధ్యతలు ఏ సాహసంతో పైన పెట్టుకోగలను?"

"వాడికి నీ దగ్గరే వుండాలని. నీ దగ్గరే వుంటానన్నాడు...."

చరణ్ గభాలున ఆమె ముఖం తన వేపుకి తిప్పుకొని—"అమ్మా, నేను నీ దగ్గరే వుంటానమ్మా. ఏటికి తీసుకు పోమ్మా! దా!" అన్నాడు.

"నువ్వు నా దగ్గర వుండనక్కర్లేదు చరణ్. నీకు కొత్త అమ్మ వస్తుందిగా. ఆవిడ దగ్గరే వుందుగాన్లే!" అంది చరణ్ కేసి తిరిగి.

కళాకాంతీ లేని నవ్వు నవ్వేడు బృంద. "ఇది నీ దాకా వచ్చిందీ. ఆ మాటలు అప్పుడే ఆగిపోయినయ్!" అని చెప్పాడు.

"ఆగిపోవడం యెందుకనీ?" అంది కుసుమ.

"ఆ గొడవంతా ఎందుకులే దానికి వేరే కారణం వుంది." అన్నాడు బృందావన్.

రెండు నిమిషాల తర్వాత బృంద గంభీరంగా పిలిచాడు. "ఇహ, ఆలస్యం చెయ్యకు చరణ్! రారా!" అని పిలిచి బైటికి వచ్చేశాడు.

తండ్రి రమ్మనగానే తల్లి ముఖంకేసి ఎంతో ఆశగా చూసినా, తనూ తండ్రితో పాటు బైటికి వచ్చేశాడు... బైట బండీ సిద్ధంగా వుంది.

వీధి తలుపు కొంచెం ఓరగా వేసి నించుంది కుసుమ. ఒక్కసారి భర్త ముఖం కేసి చూసి వులిక్కిపడింది, బృందావనుడిలో మునుపుండే ఆ కళా, కాంతీ లేదు. కళ్లూ ముఖం పీక్కు పోయి వున్నాయి.

తనను తాను సంబాళించుకోలేకపోయింది కుసుమ. చాటునే వుండి—"ఒక్క మాట!" అని పిలిచింది.

"ఏమిటి?" అన్నాడు దగ్గరికొచ్చిన బృంద.

"ఇంత చిక్కిపోయారేం? మీకేమన్నా సుస్తీ చేసిందా"

"ఏమో మరి. ఆలోచనలతోను, దిగుళ్లతోను వుండడం చేత అలా కన్పిస్తున్నా నేమో :" అన్నాడు.

ఆశ్చర్యపడింది కుసుమ.

చరణుడు బండిలో కూర్చున్నాడు. అమ్మ ఇవాళ తనని మామూలుగా ఆదరించ లేదు. తనేమో ఇక్కడ వుండిపోవాలని వస్తే తనని వుండనివ్వలేదు. ఈ ఒక్క విషయం వాడికి బాగా అనుభవమై అస్థిని పట్టిపోయింది.

మరి కాస్త దగ్గరసా వచ్చాడు బృందావన్. తగ్గు స్వరంతో యిలా అన్నాడు: "నీకోటి చెప్దామను కొంటున్నా. ఇప్పుడు గాని చెప్పకపోతే యింకెన్నడూ చెప్పడమే పడదేమో ! కోపంతో నువ్వు కుర్రవాడి కింత జాగా ఇవాలంటే ఇవ్వలేక పోయావు కాని, నా అభావస్థితిలో మాత్రం వాడికి నీ దగ్గిర కాస్త చోటివ్వు !"

కంగారు పడింది కుసుమ.

ఇంతలో బండిలో కూర్చున్న చరణుడు "నాన్నా, రావేం ఇంకా ?" అని కేక వేశాడు.

కుసుమ నుండి జవాబేం రాకుండానే "వెళుతున్నా" అనేసి, బృందావనుడు చట్టున బండీ యెక్కాడు.

* * *

"అభిమానం పొర్లుకొచ్చిన కుసుమ, అక్కడే కుప్పలా కూలిపోయి, చతికిల బడింది. చనిపోయి పరలోకంలో వున్న తల్లినీ—జరిగిన సంఘటనల్నీ తలుచుకు తలుచుకు ఏడ్చింది. చేతులు రెండూ జోడించి, ఆకాశం కేసి చూస్తూ, ఇలా ప్రార్థించింది,

"భగవాన్, ఈ దీనురాలికేవో వుపాయం చూపించు తండ్రీ ! చిన్నప్పటి రోజులు సగర్వంగా నిర్విఘ్నంగా గడిచిపోయాయి. తలెత్తుకు తిరిగేను. ఆ మంచిరోజులు నా జీవితంలో మళ్ళీ వచ్చేట్టు అనుగ్రహించు స్వామీ!"

# 13

తన భర్త మళ్లీ పెళ్లి చేసుకోబోతున్నాడన్న వార్త విన్న క్షణం నుంచీ కుసుమ మనస్సులో కలవరం పట్టుకుంది. ఏం చెయ్యటానికీ తోచలే. ఎక్కడికయినా పారిపోదామా అనికూడా అన్పించింది. కాని ఏమాట నిశ్చయించుకోలేక పోయింది.

ఇటువంటి స్థితిలో—



అన్న అత్తగారు తీర్థయాత్ర ప్రశక్తి తీసుకొచ్చింది. మారు మాటాడకుండా, వరేనని తలూపింది, కుసుమ. ఆవిడగారు కుసుమను కేవలం ఒక దాసీదానిలాగా తన వెంట తీసుకెళ్లిందన్నమాట. దారిపొడుగునా కుసుమను అలాగే చూసింది.

యాత్రలో వాళ్లు నలడాంగా వచ్చి చేరుకున్నారు. అక్కడికి కుసుమ మనస్సు యింటి మీదికి పోయింది. ఈ మాట తెలిసిన అన్న అత్తగారు నల్ల తాచులాగా బుసలు కొట్టుకుంటూ లేచింది!

"ఏయ్ అమ్మాయ్! పిచ్చిదానిలా వాగబోకు. నువ్వేమో చూడబోతే ఈడొచ్చిన పిల్లవి. అక్కడికి పోయి ఒకతెవ్వూ పడివుందామనా? సరిపోయింది. ఇహ, మేం ముఖమెత్తుకుని నలుగుర్లో తిరిగినట్లే!"

ఇలా కసిరినప్పటికీ కుసుమ ఏమీ ఎదురు చెప్పలే.

కాసేపయ్యాక—"ఇదిగో పిల్లా! అంతగా వెళ్లాలని వుంటే, మీ అన్నతో కూడా వెళ్లు. ఇల్లూ వాకిలీ చూసుకో ఒహమాటు. మళ్లీ మీ అన్నతో తిరిగి వచ్చేసెయ్! తెలిసిందా? నువ్వక్కడ ఒంటరిగా వుండటాన్కి ఎంతమాత్రం వీల్లేదు."

* * *

ఇవాళ ఇందాక వెళ్లిపోయారుగా చరణుడూ వాళ్లూ? వాళ్లు వెళ్లిన మరికొంత సేపటికల్లా జమీందారీ హోదాలో వూరంతా తిరిగి తిరిగి కుంజా ఇంటికి వచ్చాడు. రాగానే స్నానం చేసి భోజనం చేశాడు. హాయిగా నిద్ర పోయాడు.

మళ్లీ సాయంకాలం మెలకువ వచ్చింది అయ్యగారికి. తనతో కూడా మళ్లీ చెల్లెల్ని తీసుకుపోవాలని యత్నం చేస్తున్నాడు.

జాగర్తగా ఇంటికి తాళాలూ అన్నీ వేసి, వచ్చి కుసుమ బండీలో కూర్చున్నది.

బృందకు సంబంధించిన విషయాలు అన్నగారికి అంతగా ఇష్టం వుండదు. ఈ సంగతి తెలిసిన కుసుమ, ఉదయం జరిగినవేవీ అతడికి చెప్పలేదు, తెలియనివ్వలేదు.

కుసుమ వదినగారి పేరు వ్రజేశ్వరి. ఆమె మంచి మాటకారి. కలహాలు పెట్టగల ప్రజ్ఞ కూడా వున్నది. పిల్లదాని వయస్సేమో పదిహేను, పదహారేళ్ల లోపే. ఆమె మాటలకి తల్లికూడా లొంగిపోయి దాసోహమనాల్సిందే!

అటువంటి వ్రజేశ్వరికి ఎందుచేతనో యేమో, అదృష్టవశాత్తూ కుసుమపైన అంతులేని అపేక్ష ఏర్పడింది. కుసుమ పక్షాన వుండి, ఆమెకి అనుకూలంగా మాట్లాడ్డం వ్రజేశ్వరి తల్లికి ఇష్టం వుంటుందా? కూతురికి ఎంత మాత్రం తెలియకుండా, చాటున ఆవిడగారు కుసుమను ఏదో ఒక మాట అంటూనే వుండేది.

ఇంటి ఎదటనే చెరువుంది. కుసుమ అంట్లూ అవీ తోముకురావటానికి చెరువుకి వెళ్తోంది. గదిలోంచి చూసి వ్రజేశ్వరి తీవ్రమయిన ధోరణిలో అడిగింది:

"ఆఁ. వదినా!—నెలకు ఎంత జీతం మీద నిన్ను తీసుకొచ్చిందేం, అమ్మ?"

ఆ దగ్గర్లోనే కూర్చున్న తల్లి కూతురడిగిన ఈ ప్రశ్న చెవిని పడగానే క్రోధంతో ఇలా గర్జించింది—"ఇదేం సౌరభ్యమే తల్లీ, నీ మాటలూ నువ్వూనూ! చుట్టాల్నీ పక్కాల్నీ ఎవళ్లయినా జీతమిచ్చి తెచ్చుకుంటారా ఏం? '

జవాబిచ్చింది కూతురు: "చుట్టమే అయితే ఆమె నాకు చుట్టంగాని నీకెక్కడి చుట్టం? కష్టాల్లో పడివుంది కదా అనేనా దాసీపని చేయిస్తున్నావ్? పని చేయించుకోవచ్చు గాని జీతం ఇవ్వకూడదేం?"

తల్లి మండి పడి, అంగలూ పంగలూ వేసుకుంటూ దగ్గరకొచ్చింది. కుసుమ చేతిలోంచి ఆ గిన్నెలూ అవీ లాగేసుకుంది. అవి పట్టుకు తనే చెరువుకెళ్లింది.




హఠాత్తుగా ఒకరోజున తల్లి ప్రవర్తనలో మార్పు కనిపెట్టి ప్రజేశ్వరి ఆశ్చర్య పోయింది. నిన్నటి రాత్రి కుసుమ భోజనం చెయ్యలేదు, ఒంట్లో బాగాలేక. ఇవాళ పుదయాన ఆవిడ వచ్చి "స్నానం చేసి తిండి తిను. ఉపవాసం మంచిదికాదు తల్లీ! లే అమ్మా లే!" అంటూ బలవంతం చేసింది.

కుసుమ దగ్గరికొచ్చి ప్రజేశ్వరి రహస్యంగా అన్నది: "అమ్మ రంగు ఫిరా యించింది వదినా! ఎందుకా అని ఆలోచిస్తున్నా!"

కుసుమ మాటాడలేదు. ఐతే, తల్లి సంగతి కూతురికి బాగా తెలుసు. ఈ మార్పుకి కారణం రెండు రోజుల్లోనే కనిపెట్టేసింది ప్రజేశ్వరి. అప్పట్నుంచీ మనస్సులో భగ్గుమంటూ వచ్చింది.

ఆవిడకి గోవర్ధన్ అని ఒక అక్క కొడుకున్నాడు. అతి వ్యసనపరుడు, కల్లు తాగుతాడు. గంజాయి పీలుస్తాడు. ఈ ద్రాపి మొహానికి పిల్లనిచ్చేవాళ్లు కూడానా? అంచేత పెళ్లి లేదు. పెటాకులూ లేదు. ఇప్పుడు వాడికి పినతల్లిమీద హఠాత్తుగా భక్తి ఎక్కువైపోయింది. రోజూ యింటికి వస్తున్నాడు. ఆవిడ గదిలో కూర్చుని ఆమె ఉపన్యాసాలన్నీ శ్రద్ధగా వింటాడు.

ఇవాళ సాయంత్రం—

చెర్లో నీళ్లోసుకు వద్దాం కదా అని ప్రజేశ్వరి కుసుమని వెంట పెట్టుకుని వెళ్లింది. రేవు దగ్గర నీళ్లలో దిగే సరికల్లా, గట్టున వున్న వెదురుపొద మీద ఆమె దృష్టి పడింది....ఏమిటా అని చూస్తే—ఇహ నేముంది? పొద చాటున నించుని వున్నాడు

గోవర్ధన్. కన్నార్పకుండా ఇటే చూస్తున్నాడు! అప్పుడామె గబగబ కంఠస్నానం పూర్తి చేసేసుకుని ఇంటికి వచ్చింది వచ్చేసరికల్లా ఆ పెద్దమనిషి మెల్లాలో నిలబడి పినతల్లితో మాట్లాడుతున్నాడు. కుసుమ కంఠం వరకూ ముసుగేసుకుని, గబగబ లోనికి వెళ్లిపోయింది.

"సరేకాని, గోవర్ధన్‌దాదా! ఇంతకు ముందెప్పుడూ లేదు. ఇంత హఠాత్తుగా నీకు మా మీద దయపుట్టుకొచ్చిందే! ఇహనైనా, కాస్త—మా యింటికి రాకపోకలు తగ్గించుకో!" అని చెప్పింది ప్రజేశ్వరి.

తను తొంగి చూడటం ప్రజేశ్వరి కనిపెట్టిందన్న సంగతి గోవర్ధన్‌కు తెలీదు. కాని, ఆమె ధోరణికి భయపడిపోయి మరి, నోరెత్తలేదు!

కాని ఆమె తల్లి మాత్రం మండిపడింది. కళ్లు నిప్పుల్లా ఎర్రబడినై. "ఇది వరకూ ఇష్టంలేక రాలేదు. ఇప్పుడు అయింది—వస్తున్నాడు. మధ్యను నీకేం?" అంది.

"నా కోసమని నే చెప్పలే. ఇక్కడ పరాయింటి పిల్లకూడ వున్నదిగా. అది కాస్త గుర్తుంచుకోవాలి!" అంది.

ఇపుడు తల్లి కంఠస్వరం సప్తమిస్థాయికి అందుకుంది! "అన్నకొడుకులూ, అక్కకొడుకులూ ఇంటికి రాకుండా వుంటారా యేం? ఆవిడేమన్నా ఘోషాస్త్రీయా? ఓసమ్మో, నీకు తెలీదుగానీ, ఆ పిల్ల బైట ఎలా తిరుగుతుందో చూస్తే—ముసలి పీనుగులం—మాకే చచ్చేంత సిగ్గేస్తుంది!'

ప్రజేశ్వరి అంతటితో ప్రసంగం ఆపేసింది. ఇహ, వెళ్దామనుకుంటూ గోవర్ధన్ ముఖం కేసి తీవ్రంగా చూసింది. "గోవర్ధన్‌దాదా! నోరు విప్పి చెప్పలేక పోతున్నాను. ఎంతైనా సిగ్గు పడాల్సిన విషయం. కాని కళ్లారా చూశాను. నువ్వు యిక్కడికి సోదరభావంతో వస్తేరా. లేదంటే నీ అదృష్టం బాగుండదు. తెలిసిందా? ఖబడ్దార్!" అని అనేసి గదిలోకి వెళ్లిపోయింది.

ప్రజేశ్వరి చీరె మార్చుకుని కుసుమ వున్న గదిలోకి వెళ్లి చూస్తే, ఆమె ఇంకా ఆ తడి బట్టలతోనే వుంది. కిటికీ వూచలు పట్టుకుని బైటికి చూస్తూ నిలబడివుంది.

అడుగుల చప్పుడయేసరికి, చప్పున వెనక్కి తిరిగింది. రుద్ధమైన కంఠస్వరంతో ఇలా అన్నది! "వదినా!—నా కోసమని నువ్వెందుకు నా పక్షం మాటాడావ్? ఇక్కడకూడా నన్నుండనియ్యవా యేం?

"నీకు జరగనీ, నాకు జరగనీ, అన్యాయాన్ని మట్టుకు నేనెప్పటికీ సహించను—వదినా! ఆ భటా—చోర్‌ని గుమ్మంలో కాలెట్టనివ్వను, వాడి వుద్దేశ్యం తెలిసి

పోయిందిలే నాకు!" అన్నది.

"ఎవరి వుద్దేశాలు ఎలా వుంటే ఏం వదినా! నీ కాళ్ళమీద పడతా. నా గురించి మీరు మాటా మాటా అనుకోకండి." అని ఏడుస్తూ గోల పెట్టింది కుసుమ.

"నే బతికి వుండగా నీకు ఆపద రాదొదినా!" అంది వ్రజేశ్వరి.

"ఒస్తుంది వదినా, ఒస్తుంది! ఈ కళ్లతో చూస్తున్నా అలా రావటం!" అంటూ మనస్సులో బాధ కొద్దీ నుదుటి మీద గట్టిగా కొట్టుకుంది. "ఈ దౌర్భాగ్యురాలు ఎక్కడికెళ్తే అక్కడికే వస్తుంది ఆపద. ఈ ఆపదల్లోంచి నన్ను పుట్టించిన దేవుడు కూడా తప్పించలేడు!" అంటూ వలవల ఏడ్చేసింది.

ప్రేమతో అభిమానంతో కుసుమ కన్నీళ్లు తుడిచింది రాజేశ్వరి. కాసేపు మౌనంగా వుండి, ఆ తర్వాత మెల్లిగా ఆమెను ఓదార్చబోయింది. "నువ్వు చెప్పింది యదార్థమే. కానీ నీ దోషం కూడా లేకపోలేదు. నువ్వు పునిస్త్రీవై వుండీ ముఖాన బొట్టు పెట్టుకోవు, చేతులకి గాజులు వేసుకోవు, అత్తారింటికా వెళ్లవ్, ఇదంతా నీ అదృష్టమేనా వదినా? విధవ కానిది ఎవతె అయినా విధవ వేషంలో వుంటుందా, నువ్వే చెప్పు?"

"నాకన్నీ తెలుసు వదినా! నేను బొట్టు పెట్టుకొని గాజులు వేసుకున్నంత మాత్రాన లోకం హర్షిస్తుందా? నా భర్త ఎవరు? అందుకు సాక్షులెవరు?"

కళ్లప్పగించి విస్మయంతో చూసింది వ్రజేశ్వరి

"అదేమిటి వదినా, అలాగంటావ్?? నందుడి వ్యవహారం నువ్వు విన్నావా? మీ అన్నయ్యకి అన్నీ తెలుసు. నువ్వు వచ్చేసే ముందు రోజున నీమీద నాకు కోపం కూడా వచ్చింది ..." అంటూ రాజేశ్వరి నిట్టూర్చింది. మళ్ళీ ఇలా అంది: "నందుడి కూతుర్ని బృందావన్ గారికి ఇవ్వాలన్నారు కదా! ఆ సంబంధం ఖాయమైనప్పుడు మీరు పశ్చిమదేశంలో వున్నారు. ఆ సమయంలో మీ అన్నయ్య చాలా హంగామా చేశారు. ఆ సందర్భంలో మీ అత్తగారి సంగతీ, నీ సంగతీ, వారి సంగతీ అన్నీ చర్చకి వచ్చేయి ...తన కూతురి సంబంధం ఎక్కడ తప్పి పోతుందోనని భయపడి, నందుడు అప్పుడు ఒప్పుకోలేదు. దేవాలయంలో వుండే పెద బాబాజీని పిలిచారు. ఆయన ఈ సంగతి అంతా తర్జన భర్జనచేసి మిధ్య అని తేల్చేశారు. "కంఠహారం మార్చుదామనే మాటల వరకే వచ్చింది. కాని, క్రియమాత్రం జరగలేదు—అని ఆయనే ఒప్పుకున్నాడు!"

చెప్పలేని భయంలో వూపిరి బిగపట్టుకుని అడిగింది కుసుమ! 'జరగలేదా? వదినా, జరగలేదా? నా మనసుకి తెలుసు, జరిగిందో లేదో! కాని నా ఒక్కదానికి

మటుకు తెలిస్తే ఏం లాభం ?

"మీ అన్నయ్య సంగతి తెలీదా నీకు ? ఆయనే ఇవన్నీ కూపీ లాగారు....వదినా, ఈ సంగతి సందర్భాలన్నీ బృందావన్‌గారు విన్నారు. ఆయనైనా నీకు చెప్పలేదా?"

ముఖం వెనక్కి తిప్పుకుంది కుసుమ. "బహుశా ఆయన ఆ రోజున ఈ సంగతులు చెప్పటానికే వచ్చారేమో వదినా."

"ఆయనొచ్చేరా ? ఎప్పుడు ?" అనడిగింది ప్రజేశ్వరి.

అంతా పూసగుచ్చినట్టు చెప్పింది కుసుమ.

అదంతా విన్నాక మెల్లిగా ఇలా అంది ప్రజేశ్వరి 'వదినా, నువ్వు చేసిన పని అంత మంచిది కాదు. నీ స్థితిలో నేనే గనక వుంటే—వారి వెంట కాళ్లతో నడిచి వెళ్లటం కాదు—ముక్కు నేల రాసుకు రావాలన్నా శిరసావహించేదాన్ని.''

మౌనంగా కూర్చుంది కుసుమ.

"నీ క్షేమం కోరి చెబుతున్నా వదినా. నా మాట విను ఇది ఆపద సమయం. ఇప్పుడే వెళ్లు. భర్తనీ బిడ్డనీ వదిలేసి వుండకు. వాళ్లని కనిపెట్టుకుని వుండడం నీ విధి।"

"ఆపద సమయం అంటున్నావ్. అదేమిటి వదినా?" అంది

"బాదలి గ్రామంలో మహామారి వ్యాపించింది. ఇప్పుడు అమ్మవారు చాలా తీక్షణంగా వుందిట. రోజూ పది పన్నెండు మంది పోతున్నారట...."

"నా చరణుడ్ని నాకప్పగించి పోదామనే వచ్చారు వదినా. అయినా నేను వినిపించుకోనేలేదు. వదినా ! పాపిష్టిదాన్ని...." అంటూ ప్రజేశ్వరి కాళ్లు పట్టుకుని వలవల యేడ్చేసింది.

అంతలో కుంజు అత్తగారొచ్చింది. సంగతి సందర్భాలు తెలుసుకుని మండి పడింది. తల్లీ కూతుళ్లు కాసేపు వాగ్యుద్ధం చేశారు....

"పోనీ, ఒక్కమాటు అక్కడికెళ్లి చూసైనా రాకూడదా,—వాళ్లెలా వున్నారో ఏమో !" అంది ప్రజేశ్వరి భర్తతో.

"బాప్‌రే—రోజూ పదీ ఇరవై మంది చొప్పున చస్తున్నారక్కడ!" అన్నాడు కుంజు గుడ్లు మిటకరించి.

"పోనీ, మీరు వెళ్లొద్దు. మనిషిని పంపించి కబురైనా తెలుసుకోండి" అని వేడుకుంది ప్రజేశ్వరి.

"అలాగే," అని మనిషి కోసమని కుంజు బయటకి వెళ్లాడు.

మర్నాడు ఉదయానే—



''ఏం బాబూ, చిన్న కథ చెప్పేదా?''

''ఉహూ. ఒద్దు బామ్మా.''

''పోనీ, జోల పాట పాడనా? నాన్నా?''

''వద్దు''

''పోనీ ఏం చెయ్యమన్నావో చెప్పు?''

'నువ్వలా ఎటైనా వెళ్ళిరా. నాకు నిద్రొస్తూంది......''

---

స్నానం చేసి వంటింట్లోకి పోబోతున్న కుసుమతో ''అమ్మాయి గారూ, ఇవాళ మిమ్మల్ని వంటింట్లోకి వెళ్ళొద్దన్నారు!'' అంది దాసీది.

గుండె గుభేల్ మన్నది కుసుమకు. కాసేపు అలాగే నిలబడి పోయింది. ఇహ వుండ బట్టలేక వ్రజేశ్వరి కోసం వెదకసాగింది, అంతలోనే ఆమె తల్లి ఎదురొచ్చింది.

''ఇంకా అలా తారట్లాడ్తావెందు కమ్మాయీ? ఒక్క మునుగు మునిగి రా. కోడలివైనాక—అశౌచం పట్టక తప్పుతుందా? మహా ఇల్లాలు...గుణవంతురాలు.... పోయింది. ఇవ్వాల్టికి రెండూ, పాపం!—ఆ బృందావనుడి తల్లిపోయి! పాపం, ఇవాళ పొద్దుట చరణుడికూడా రెండు వాంతులు అయినాయిటా!''

తల ఎత్తలేదు. ఒక్క పలుకు పలకలేదు. కుసుమ మెల్లిగా తన గదిలోకి వెళ్లి పోయింది.

* * *

మధ్యాహ్నం మూడైంది. కుసుమ కోసం ఇల్లంతా వెదికింది ప్రజేశ్వరి, ఎక్కడా కన్పించకపోగా దాసీదానిని అడిగింది. దానికూడా తెలీకపోయేసరికి ఇహ ఏడుపు మొదలుపెట్టింది.

భార్య ఏడుపు వినేటప్పటికి కుంజునాధుడికి మెలకువ వచ్చింది. ''ఎక్కడికి వెళ్ళింది చెల్లాయ్?'' అనడిగేడు.

''ఏమో తెలీదండీ ఇల్లంతా వెదికించాను, తోటలూ దొడ్లూ వెదికించాను, రేవుకి పంపించాను'' అని చెప్పింది.

''రేవు'' మాట వినేసరికి అతని గుండె జారిపోయింది. అతడు కూడా ఏడ్పు ప్రారంభించేడు—''అది—ఇక్కడ ఉండదిహ. మీ అమ్మ తిట్లు సహించలేక చెర్లో పడే వుంటుందే।''

ప్రజేశ్వరి యేమో చెప్పబోయింది. అయినా వినక పిచ్చివాడిలా వీధిలోకి పరుగెత్తాడు. అక్కడ నిలబడి అప్పుడే వచ్చిన అత్తగార్ని ''చూసి ఇదేనండోయ్— ఈ బ్రహ్మరాక్షసే నా చెల్లిని మింగేసింది. అయ్యో....కుసుమా:'' అంటూ రాగాలు ప్రారంభించాడు.

ప్రజేశ్వరి చటుక్కున అతని చెయ్యి పట్టుకు ఇంట్లోకి బలవంతంగా లాక్కొచ్చింది. కుంజ కంటి వెంట నీళ్ళు ధారపాతంగా కార్తున్నాయి.

''మీరేం బెంగపెట్టుకోకండి. ఆమె చెర్లో పడి వుండదు. నా మాట నమ్మండి. బహుశా ఎవరికీ తెలీకుండా బాదలి వెళ్ళిపోయుంటుంది, తన పంచప్రాణాలు అయిన చరణుడి కోసమైనా అక్కడికి వెళ్లి వుంటుంది, అంతేగాని ఏ అఘాయిత్యమూ చెయ్యదు!''

''కాని దానికా వూరి దారి తెలియదే ...''

''అదే నా భయమూను. మీరు వెంటనే బయల్దేరండి. అదృష్టం బాగుండి తారసపడ్తే, మీ వెంట తీసుకుపోయి ఆవిడ భర్తకు అప్పగించేసి రండి.''

''సరే—వెళ్తున్నా''

ఇప్పుడు—జమీందారనిపించు కుంటున్న కుంజునాధ బాబు—ఆనాడు సరకులమ్ముకుంటూ ఊళ్లంట తిరిగే మామూలు కుంజుడి వేషంలో—కాళ్ల చెప్పులయినా తొడుక్కోకుండా, పిచ్చివాడిలా, చెల్లెలు కోసం బాదలి బయలుదేరాడు.

# 14

బృందావనుడి తల్లి పోయి ఇవాల్టికి ఆరు రోజులైంది. ఆమె చేసుకున్న సుకృతం

వల్ల మంచి గతులకే పోయి వుంటుందని నిస్సంశయంగా అనుకోవచ్చు—
ఇప్పుడిక చరణుడు ఆటాలేదు మాటా లేదు. కొడుక్కి వాళ్ల నాన్న ఎంతలేసి ఖరీదైన ఆటవస్తువులో యిచ్చేడు, ఇప్పుడవన్నీ మూలని పడి వున్నాయి.

ఎన్నో బెంగలతో వికలమైపోయి వున్న అతడి మనస్సుకి ఈశ్వరేచ్ఛ ఏ విధంగా నడుస్తుందో ఆ రోజుకారోజు స్పష్టంగా కళ్లకు కనిపిస్తూనే వుంది. ఇలాంటి స్థితిలో ఓ రోజున—

పసివాడు చరణ్ తండ్రి ఎదటపడి "నాన్నా! అమ్మ దగ్గిర కెళతాను నాన్నా?" అని మారాం చేశాడు.

"మీ అమ్మ ఇక్కడుండటం లేదు బాబూ."

"మరెప్పుడొస్తుంది?"

"తెలీదు నాయనా. ఇవాళ మనిషిని పలపి రమ్మని కబురు పెట్టాను." అని సమాధానపర్చాడు బృంద.

తల్లి తిథి ఇహ రెండు రోజులుంది. ఇవాళ ఉదయానే ఏదో పని మీద వరండాలో నిల్చుని వున్నాడు బృంద. ..లోపల—చరణుడికి వాంతులూ భేదులూ అవుతున్నాయని కబురు! పరుగెత్తి చూశాడు బృంద. కుర్రవాడు నిర్జీవంగ మంచం మీద పడుకుని వున్నాడు. ముఖంలో కలరా లక్షణాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. బృందావనుడికి లోకమంతా చీకటితో మూసుకు పోయింది. కాళ్లూ చేతులూ ఆడలేదు.

"కేశవుడికి కబురు చెయ్యండి!" అని మాత్రం చెప్పి, కుర్రవాడి మంచం పక్కనే తనూ శవంలా పడుకున్నాడు,

* * *

మరోగంట సేపటికల్లా—బృంద డాక్టర్ గోపాల్ దగ్గరికి పరుగెత్తాడు, కుర్రవాడి పరిస్థితి చెప్పి ఒక్కసారి ఇంటికి దయచెయ్యమన్నాడు, ఎంత డబ్బు కావల్సినా ఇస్తానన్నాడు, గోపాల్ ఎవరోకాదు. సాక్షాత్తూ తారిణి అల్లుడు, ససేమిరా—రానని పోయి తన మామగారి కాళ్ళు పట్టు కోమన్నాడు.

ఇక చేసేదిలేక తారిణి ఇంటికి బయల్దేరేడు బృంద. శతవిధాల ప్రార్థించేడు. కాళ్లా వేళ్లా పడినా కాస్తయినా చలించలేదు తారిణి. అదే సమయంలో పక్కింటి ఘోషాల్ కూడా వచ్చాడు. సంగతి విని—

"కుక్కకి చనువిస్తే కుచ్చులన్నీ తెగకొరికిందట—ఇలా అని రాసుంది శాస్త్రాల్లో. ఈ కలికాలంలో బ్రాహ్మణ మర్యాదా అడుగంటుతున్నది.' అని సెలవిచ్చేడు.

"ఆ రోజున చెరువు గట్టున నించుని, గాయత్రీ ప్రమాణంగా అన్నాను—వీడి వంశం నిర్వంశం అగుగాక అని! బాబాయ్ ఎన్నడైనా నేను అహ్నికం చేసుకోకుండా పచ్చి మంచి నీళ్లయినా కంఠంలో పోసుకోవడం ఎరుగుదువా, నువ్వు? ఆ మహత్తంతా యెక్కడికి పోతుందయ్యా? ' అన్నాడు తారిణి సగర్వంగా.

బృందావనుడు లేచి నిలబడ్డాడు. ప్రాణాల కోసమని ఎంత ప్రాధేయపడాలో అంతా పడ్డాడు. కాని లాభం లేకపోయింది. మౌనంగా వెనక్కి తిరిగాడు.

పది దాటేక బృందావనుడు వ్యాధితో తీసుకుంటున్న కొడుకు మంచం వద్ద కూర్చున్నాడు. అతని నోటి మీదుగా జరిగినది అంతా విన్నాడు కేశవుడు. వెంటనే విటారుగాలేచి ఉత్తరీయం పైన వేసుకున్నాడు. "భాయీ! నేను కలకత్తా పోయి వస్తా! డాక్టర్ వెంటనే దొరికాడా, సాయంకాలం కాకుండానే వచ్చేస్తా. ఎట్టా అయినా కుర్రాడిని బతికించుకోవాలి." అంటూ గబగబా బయటికి వెళ్లిపోయాడు కేశవుడు.

"అమ్మ దగ్గరకెళ్తానాన్నా!" అంటూ కుర్రవాడు మళ్లీ ఏడుపు ప్రారంభించాడు.

చరణుడు సహజంగా నెమ్మదైనవాడు. మంకు పట్టు పట్టడు. ఇవాళ మాత్రం వాడిని సముదాయించడం కష్టమైపోయింది.

పొద్దెక్కి పోతూంది. రోగం కూడా ముంచుకు వస్తూంది. విపరీత దాహం. తల్లి దగ్గరికి పోతానని యేడ్పు.

ఇహ సూర్యాస్తమయం కాబోతూందనగా డాక్టర్ని వెంటపెట్టుకొచ్చాడు కేశవ. డాక్టర్ కుర్రవాడిని చూస్తూనే ముఖం గంభీరంగా పెట్టుకుని ఓ పక్కకి జరిగి కూర్చున్నాడు. డాక్టరేదో చెప్పబోయి బృందావనుడ్ని చూసి ఆగిపోయాడు. తను చెప్పదలచింది తండ్రి ఎదుట నోరు విప్పి చెప్పలేక, తల వంచుక్కూర్చున్నాడు.

పరిస్థితి గ్రహించాడు బృంద.

"కేశవ్, నే వెళ్తున్నా. ఈ పక్కగదే పూజామందిరం, కావాలంటే పిలు. ఒక్క సంగతి భాయీ! చివరి క్షణాల్లో పిలిచావంటే, ఒక్కమాటు నా బాబుని కళ్లారా చూసుకుంటా!" అంటూ ఆ గదిలోంచి బయటికి వెళ్లాడు.

* * *

క్రిందపడి దొర్లుతున్నాడు బృంద. హృదయావేదన ప్రారంభమైంది.

"భగవాన్ మా చరణుడు పక్కగదిలో మరణిస్తున్నాడు....పితృప్రేమ అనేది నువ్వే కల్పించావా? అయితే—తండ్రి కళ్ల యెదుట, చికిత్స లేకుండా, ఇంత నిష్ఠురంగా నా ఏకైక సంతతిని హత్య చేస్తున్నావెందుకు?" అంటూ వలవల ఏడ్చేశాడు....అలా ఆలోచనల మీద ఆలోచనలు సాగిపోసాగేయి.



అంతలో పూజారి లోపలికి వచ్చాడు. ఆ అలికిడికి బృంద లేచాడు, బయటికి వచ్చాడు.

ప్రాంగణంలో ద్వారం చాటున విచారంగా వున్న ఒకామె కన్పించింది. ఆమెను చూసి విస్మితుడయ్యాడు. క్షణం ఆమెకేసి చూడగానే గుర్తు పట్టేశాడు. ఆమె కుసుమ!

జాలిగా అన్నాడామెతో!

"ఇంకొంచెం ముందుగా వస్తే—చరణుడి కోరిక తీరేది. ఇవాళ్లా ఎంత బాధ పడ్డాడో....నీ దగ్గరికి వెళ్లాలని ఎంతో యేడ్చాడు. నువ్వంటే ఎంత ప్రేమ, ప్రాణం వాడికి? ఇప్పుడు ఏముంది? స్పృహ కాస్తా తప్పి పోయింది. రా. నాతో!"

మౌనంగా భర్త వెంట వెళ్లింది కుసుమ. గుమ్మందగ్గిరికి రాగానే బృందావనుడు చేత్తో మరణశయ్యమీద వున్న కుర్రవాణ్ని చూపించాడు.

* * *

మర్నాడుదయం!—

ఆ మాట....! ఆ మాట కుసుమ ఎదటికి వచ్చి చెప్పటానికి ఎవళ్లూ సాహసించ లేకపోయారు. కుంజనాధుడు కూడా భయంతో వెనక్కి తగ్గాడు. అప్పుడిక బృందా వనుడే దగ్గరికి వచ్చాడు.

"మన చరణుడెప్పుడో వెళ్లిపోయాడు మనల్ని వదిలిపెట్టేసి. ఇంకా ఎందుకా జీవం లేని కట్టెని ఒడిలో పెట్టుకూర్చుంటావ్? ఏం లాభం? అంతా అయిపోయింది. ఇహ మన వస్తువు కాదది! వాళ్లు తీసుకు పోతారు. విడిచిపెట్టు!" అని నచ్చ చెప్పాడు.

ముఖం ఎత్తి అన్నది కుసుమ: "వాళ్లని రమ్మని చెప్పండి. నేనే ఎత్తుకు తీసుకెళ్లి వాళ్లకిస్తా!"

ఆమె ఏమీ చలించలేదు. ఎంతో ధైర్యంగా గుండె నిబ్బరంతో చరణుడి మృతకళేబరాన్ని స్మశానానికి పంపించింది.

ఇది చూసి బృందావనుడికూ్కడా మనస్సులో భయం పట్టుకుంది.

# 15

పసివాడి చిన్నారి శరీరం ఏముంది, క్షణంసేపు కూడా పట్టలే. నుసి అయిపోవటానికి!

రెండు కాళ్ళ సందునా తలదూర్చుకుని బృందా వనుడు కొంచెం దూరంలో కూర్చుని వున్నాడు.

కావలసిన పని అంతా అయిపోయింది, తిరుగు ముఖం పట్టారు.

వస్తూంటే, దారిలో చెట్టుకింద గొల్లపిల్ల లిద్దరు ముగ్గురు ఆడుకుంటున్నారు. అక్కడే ఆగాడు బృంద. కన్నార్పకుండా వాళ్ళకేసి చూస్తూ నించున్నాడు. ఆటలు కదా! వాళ్ళు ఆ చెట్టు నించి మరో చెట్టుకి పరుగుతీశారు.

నిట్టూర్చాడు, బృందావనుడు. స్నేహితుడి ముఖం కేసి చూసి అన్నాడు—

"భాయీ!—నిన్నటినించీ ఏ ప్రశ్న అయితే మాటిమాటికీ నామనస్సును కెలుకు తూందో, దాని కిప్పుడు జవాబు వచ్చేసింది కేశవ్! ఈలోకంలో ఒక కుర్రవాడి చావుకి కూడా ప్రయోజనముంది."

ఆ క్షణందాకా ఆవేశంతో తిడుతూవున్న కేశవు ఈ వింత సిద్ధాంతం విని తెల్ల బోయాడు.

"నీకు పిల్లల్లేరు. కనుక నాహృదయంలో ప్రజ్వలిస్తున్న జ్వాల ఎలాంటిదో నువు తెలుసుకోలేవు. ఇటువంటి జ్వాల పగవాడి కయినా వొద్దు దేవుడా, అయితే, దీనికూ్కడా ఒక విలువ ఉన్నది. ఆ విలువ అంచనా వేయటానికి వీల్లేనంత గొప్పదని ఇప్పుడే తెలుసుకున్నాను, కేశవ్! అంచేత ఇదీ భగవంతుడి సంకల్పమే అను కోవాలి!" అన్నాడు బృందావన్.

మాటాడకుండా చూస్తూ ఊరుకున్నాడు కేశవ్.

"ఆ ఆడుకుంటున్న కుర్రవాళ్ళకేసి చూసే సరికి నా హృదయంలో జ్వాల చల్లారి పోయింది. భాయీ! ఇవాళ పిల్ల లందరి ముఖాల్లోనూ నాకు చరణుడు కనిపిస్తున్నాడు. ఇప్పు డేపిల్లల్ని చూసినా వాళ్ళ నెత్తుకుని, హృదయానికి హత్తుకోవాలని బుద్ధి పుడు తోంది. నా చరణుడు బతికివుండగా, నా కెప్పుడూ అలా అనిపించలేదు, కేశవ్!" అని చెప్పాడు బృంద.



కేశవుడు వింటూ నడుస్తున్నాడు.

బృందావనుడి చెయ్యిచ్చుకుని, "ఇంటికి పద!" —అన్నాడు, కేశవ్.

బృందావనుడు, రెండడుగులు ముందుకి వేసిపుట్టి బుద్ధెరిగి, గోహత్యగాని బ్రహ్మహత్యగాని చేసి ఎరగను, కేశవ్! ఎందు కింటావ్ నా కింత తీవ్రమైన కఠినశిక్ష!"

బృందావనుడు మాట పూర్తి చెయ్యకముందే ఉద్ధృతంగా ఇలా గర్జించాడు కేశవుడు:

"పోయి, ఆ పుండాఖోర్ ఘోషాల్‌గాణ్ని అడుగు—చెబుతాడు వాడు. జపతపాలు మహా త్తుట, వాడి పిండాకూడు! అడుగో, ఆ దుర్మార్గుడి పక్కనే ఇంకో ఛటాచోర్ ఉన్నాడుగా! అంతా పూర్వ జన్మపాపం అని ఏడుస్తాడు. ఈ వూళ్లో బ్రాహ్మణ శిఖామణులట, ఈ దౌర్భాగ్యులు! ఉష్!—ఏం దుష్కాలం దాపరించిందోయ్?'—

"కేశవ్!—వీళ్లంతా మేక వన్నె పుట్టలు! నల్ల తాచులు! కర్రతో కొడితే రెచ్చిపోతాయ్, కనక లాభంలేదు. ఇంతకీ నువు చూడాల్సింది—అజ్ఞానం బ్రాహ్మణ్ణి ఎందాకా తీసుకుపోయిందా అని. ఇదీ అసలు విషయం, అని చెప్పాడు.

వాళ్లన్న మాటలన్నీ ఒక్కొక్కటే గుర్తు కొస్తున్నాయి కేశవుడికి, ఉగ్రుడై పోతున్నాడు, క్షోభతో మనస్సు దహించుకు పోతూంది. అంచేతనే నోటికొచ్చినట్టెల్లా మాటలనేశాడు.

"మరయితే, ఇంత పెద్దశిక్ష దేనికసి."

"శిక్షకాదు కేశవ్ ! ఆ సంగతే చెప్ప బోతున్నా—పాపఫలం. కాదు. నా అపరాధానికి శాస్తికాదు, దుఃఖంలేనిదే ఎటువంటి గొప్ప అనుభవమూ తెలిసిరాదు, కేశవ్ ! ఈనాడు చరణుడి మరణంవల్ల ఎంత గొప్ప ఉపదేశం పొందాను ? అటువంటిది పుత్రశోకంవల్ల తప్ప మరొకదాని వల్ల పొందలేం.

"నా హృదయంలో చరణుడికున్న స్థానం ఎటువంటిదో నీకు తెలుసు కదా! అలానే వాడు లోకంలో ఉండే పిల్లలందరి హృదయాల్లోనూ చోటు సంపాదించుకున్నాడు. కనుకనే, ఏపిల్లవాణ్ని చూసినా వాడి హృదయంలో నాకు చరణుడే కనిపిస్తాడు !"

ఇలా అంటూండగా బృందావన్ కంఠం బిగుసుకు పోయింది, మిత్రులుభయులూ కళ్ళ నీళ్లతో ఎదురెదురుగా నించున్నారు,

* * *

తల్లి శ్రాద్ధం రోజున—దేవుడి మాన్యం మట్టుకు మినహాయించి, తక్కిన ఆస్తి యావత్తూ రిజిష్టరీ చేసి కేశవుడికి అర్పించాడు బృంద.

"కేశవ్!—కల్మషమయిపోయిన నీరుతాగి, నా చరణుడి సోదరు లెవరూ మృత్యువాత పడకుండా మాత్రం నువ్వు చెయ్యాలి, భాయీ !—ఇదే, మనమీ కొత్త నుయ్యి తవ్వించడంలో గల ఉద్దేశం, లక్ష్యమున్నూ.

ముఖ్య సంపత్తి ఈ పాఠశాల, దీని భారం నువ్వు వహించనే వహించావు గనక, నాకేం బెంగలేదు. ఒకవేళ నేనీ ప్రాంతాలకి రావడం తటస్థించితే, నాపాఠశాల విద్యార్థి ఒక్కడైనా గొప్పవాడై ఉన్నతస్థితికి రావడం కళ్లారా చూడ గలగాలి, నిజానికి అటువంటి మంచి రోజునే నేనీపుత్ర దుఃఖాన్ని మరిచిపోగలిగేది !" అంటూ అప్పగింతలు పెట్టాడు.

* * *

బృంద గురువుగారు దుర్గాదాసుబాబు ఈమధ్యని రోజూ వస్తూనే వున్నాడు, ప్రస్తుత పరిస్థితులకు ఆయన ఎంతో మధనపడుతు న్నాడు.

"బృందావన్ ! నిన్నెలా ఓదార్చాలో, ఏం చెప్పటానికీ నాకేం బోధపడటం లేదు. కాని మానవుడికి కష్టాలొస్తాయి. కష్టం వల్ల భరింపరాని దుఃఖం వస్తుంది. మానవుడు సహించే తీరాలి. సహించలేనంటే కుదరదు, కష్టాలు కల్పించటం, మానవుడు సహించాలనటం అంతా దైవ సంకల్పమే. కష్టాలకు తట్టుకోలేక సంసారం పరిత్యజిస్తానంటే అది భగవంతుడి వుద్దేశానికి వ్యతిరేకించడమే అవుతుంది...."




అని నచ్చజెప్ప జూచాడు.

తల ఎత్తాడు బృంద.

"సంసారం వదిలెయ్యాలనే వుద్దేశం నాకెప్పుడూ లేదు మేష్టారూ! అది సంభవం కాదని కూడా నాకు తెలుసు. చిన్నపిల్లల ముఖాలు చూస్తేగాని క్షణమైనా నే బతక లేను. మీదయవల్ల పంతులుగా నే నందరికీ పరిచితుణ్ణయాను. కష్టపడి సంపాదించు కున్న ఈ గౌరవాన్ని ఎప్పటికీ నే వదులుకోను. ఎక్కడి కెళ్లినా, నేను ఇలాంటి పాఠశాల ప్రారంభించే తీరతాను" అని చెప్పాడు.

అప్పుడు గురువుగారు మళ్లీ ఒకప్రశ్న వేశారు—"అయితే—నీ యావదాస్తీ నీటి యెద్దడి తీరటానికని దానం చేశావు కదా, ఇటుపయిన నీ కాలక్షేపం ఎలామరి?"

కొంచెం సిగ్గుపడుతూ జవాబిచ్చాడు బృంద. గోడకి వేలాడేసివున్న సంచీకేసి వేలెట్టి చూపించాడాయనకి, "వైష్ణవుల బిడ్డకు భిక్ష దొరక్కపోవడ మనేది ఎక్కడైనా వుంటుందా మేష్టారూ? నాకేం బెంగలేదు. మిగిలిన నా జీవితకాలం ఇలానే హాయిగా గడిపెయ్యగలను. అదీగాక, ఈ సంపత్తికి వారసుడు నా చరణుడు కదా! దాన్ని వాడి సోదరులకూ మిత్రులకే ఇచ్చేసిపోతున్నా, అటువంటప్పుడు నాకు మరో ఆలోచ నెందుకూ?"

దుర్గాదాస్ మేష్టారు బ్రాహ్మడూ, గొప్పవాడున్నూ. అయినప్పటికి బృందావనుడి తల్లి పెద్ద రోజున వచ్చి, అజమాయిషీ అంతా తనే స్వయంగా చూశాడు. కనుకనే కుసుమ ఎవరో తను తెలుసుకో గలిగాడు.

ఆమె సంగతి మనస్సులో గుర్తుంచుకునే ఇలా అన్నాడు? "అదేం బాగుండదు

బృందబాబూ! నువ్వంటే స్వతంత్రుడివి, కనుక నువ్వేం చేసినా నీమాట చెల్లుబడి అవుతుంది. కాని, కోడలున్నప్పుడు అదేం వీల్లేదు. నీమాట సాగదు, అసంభవం!''

తలవంచుకున్నాడు బృందావన్. మెల్లిగా ఇలా అన్నాడు: ''ఆమె అన్నగారి దగ్గిర కెళుతుంది?'' బృందావనుణ్ణి దుర్గాదాసు తన సొంత కొడుకుగానే చూసుకుంటాడు. తన శిష్యుడు ఆపద సమయంలో వున్నాడు, పైగా వైరాగ్యభావంతో ఇల్లూ వాకిలీ వొదిలేసి పోతున్నాడు. కనుక ఈ పరిస్థితినుంచి అతణ్ణెలా అయినా విముఖుణ్ణి చేయాలి. ఈ నిశ్చయంతో ఆఖరిమాటగా చెప్పాడు :

''బృందావన్! ఇక్కడవుండే మునుపటిలాగా వ్యవహారాలన్నీ చక్కబెట్టుకో వచ్చుగా? జన్మభూమి వదిలేసి ఇంకెక్కడికో పోవలసినంత అవసరమేముందీ?'' అనడిగాడు.

శిష్యుడి కళ్ళు జలజల్లాడాయి.

''మేష్టారూ! నాకిహ భిక్షా వృత్తి తప్ప మరో శరణ్యం లేదు. ఆ పని ఇక్కడ నేను చెయ్యలేను. అదీగాక, ఈ యింట్లో నా దృష్టి ఎక్కడపడినా, నా చరణుడి చిన్నారి చేతులు రెండూ కళ్ళెదుట కనిపిస్తూనే వుంటాయి. క్షమించండి మేష్టారూ: నేను మానవ మాత్రుణ్ణి, ఇంత భారం మొయ్యలేను. తల చితికిపోతుంది,'' అన్నాడు

దుర్గాదాసు మరేం మాటాడలేక, విచార ముఖంతో కూర్చున్నాడు.

* * *

''ఇదికేవలం ఊరు చేసుకున్న అపరాధమే అంటారా, డాక్టర్‌గారూ? ఓ ఎంటి పెద్దల బాధ్యత ఇందులో ఏమీలేదా? ఇవాళ నా దుస్థితి చూసి మీరు కంపించి పోతున్నారు కాని, ఈ విధంగా ఏటా ఎంతమంది శిశువులు, ఎంతమంది స్త్రీలు, పురుషులు బలిఅయి పోతున్నారో ఎవరయినా చూడవచ్చారా? మీలాంటి పెద్దవాళ్ళంతా మా పల్లెటూరివాళ్ళని ఇంత నిర్దయగా వదిలేసి వెళ్ళకపోతే, ఇటువంటి నిరపాయ స్థితిలో పడి, మేం అనాధలుగా చచ్చేవాళ్ళం కాదు. ఇలా అన్నానని కోపం తెచ్చుకోకండి డాక్టరుగారూ!

మీకు తిండీ, బట్టా సమకూరుస్తున్న వాళ్ళెవరు?—దరిద్ర దామోదరులూ. దౌర్భాగ్యులూ అయిన ఇలాంటి గ్రామసీమల్లో ఉండే ప్రజలే! వాళ్ళ కాళ్ళు తెగనరికి, మీరంతా పై పదవులు అలంకరించటానికవి మెట్లు ఏర్పరచుకుంటున్నారు.

మన కేశవుడూ మొదట్లో ఆ మార్గాన్ని అనుసరించిన వాడే. ఎం. ఏ. ప్యాసయినా కూడా ఇప్పుడా దృష్టి మళ్ళించుకున్నాడు, స్వతంత్ర బుద్ధితో నిలబడ



"మా కంపెనీలో ఉద్యోగం కావాలంటే 30 ఏళ్ళ అనుభవం వుండాలి. వుందా ??"

గలిగాడు."

ఈ మాటలు వినగానే ఆనందంతో ఉత్సాహంతో బృందను చటుక్కున కౌగ లించుకున్నాడు కేశవుడు. "బృందావన్!—నిజమయిన మానవుడుగా తయారవటా నికి నా కెటువంటి సదవకాశాన్ని కల్పించి పోతున్నావోయ్ భాయీ!—పదేళ్ళ తరవాతనయినా ఒక్కమాటు ఈ ప్రాంతానికి రా!—నీ జన్మభూమిలో లక్ష్మీసరస్వ తుల్ని జట్టుగా ఒకేచోట ప్రతిష్ఠించ గలుగుదునో లేదో చూసి పోవుదుగాని." అన్నాడు.

మాష్టర్ దుర్గాదాస్, డాక్టర్ అవినాశ్ ఉభయులూ కలిసి ఈ మిత్రులకేసి ఎంతో గౌరవభావంతో చూస్తూ ఉండిపోయారు.

* * *

మర్నాడే బృందావనుడి ప్రయాణం. తన భిక్షసంచి మాత్రం చేతపట్టుకుని, దాదలి గ్రామానికి ఒక్క నమస్కారం పెట్టేసి వెళ్ళిపోతాడు తీరిక ఎక్కడ దొరి కితే అక్కడ తన కనుకూలమైన ప్రదేశాన్ని ముందుముందు నిర్ణయించుకుంటాడు.

బృందావనుడు ఆలోచించకుండా వున్నదీ, మనస్సుకి పట్టించుకోనిదీ ఒకే ఒక్క విషయముంది—కుసుమను గురించి, ఆ సంగతి అగత్యమనుకో లేదతడు. అందు కనే ఆ ప్రవృత్తి కలగలే

ఆమె చరణుడికి ఏనాడయితే ఆశ్రయ మివ్వలేదో, నాటినించీ కుసుమ అంటే

విముఖత ఏర్పడింది. తీరా, చరణుడు పోయాక, అది ద్వేషంగా కూడా మారింది.

అంచేతనే కుసుమ ఎందుకు వచ్చిందీ? ఎలా వచ్చిందీ? అనే విషయం అతదేమీ ఆలోచించలే.

పైగా, వచ్చిందేమో రానే వచ్చింది ఆమె. కుఱ్ఱవాడి అంత్యక్రియలు పూర్తి కాగానే తనంతట తనే వెళ్ళిపోతుందని అనుకున్నాడు. ఆమె వచ్చాక, మధ్య మధ్య మాటాడటం తప్పనిసరి అయింది కాని, ఆరోజు ఉదయంపూట తప్ప మళ్ళీ ఆమె ముఖంకేసి చూడనేలేదు.

ఇహ వ్యవధి లేదు. అందుకని బృందావనుడు దాసీని పిలిచి, "ఆమె ఎప్పుడు వెళుతుందో కనుక్కురా!" అని చెప్పిపంపాడు.

వెంటనే తిరిగివచ్చింది దాసీది.

"ఆమె ఇప్పుడప్పుడే వెళ్ళదుట!" అన్నది.

ఆశ్చర్యపడ్డాడు బృంద. "ఇహ నేనుండనుగదా. ఇక్కడుండేందుకు వీల్లేదని చెప్పి రాలేకపొయ్యావా?" అనడిగాడు.

"ఆమెగారి కన్నీ తెలుసునండీ!"

"అయితే, ఆమె ఒక్కర్తే వుంటుందా ఇక్కడ అడిగిరా!" అన్నాడు, విసుగ్గా.

మరుక్షణంలో తిరిగివచ్చేసింది, దాసీది.

"ఆఁ—" అని చెప్పింది.

అప్పుడు బృంద తనే లోపలికి వెళ్లాడు. చూస్తే,—బృందావనుడి సర్వ అవయవాలూ గగుర్పొడిచాయి! తగలబడ్డ ఇంటిగోడ ఎలా వుంటుందో, అలా పిచ్చి చూపులు చూస్తూ నిలబడివుంది కుసుమ!—

ఆత్మగ్లానీ, పుత్రశోకమూ—మనుషుల్ని ఎంతలో ఎంత విపరీతంగా మార్చి వేస్తాయో, ఇదే మొదటిసారి చూడటం. బృంద భయంతో వెనక్కి తగ్గి నిలబడ్డాడు.

తలుపు చప్పుడు కాగానే కుసుమ ఇటుచూసి, ఇవతలికి వచ్చింది. తలుపులు బార్లా తెరిచి, "రండి, లోపలికి!" అని పిలిచింది.

లోపలికి వెళ్లాడు బృంద. తలుపులు మళ్లీ లోపల గడియవేసి, ఎదురుగా వచ్చి నించుంది.

"ఈమె మన ధోరణిలో మన లోకంలో లేదే? పిచ్చెత్తలేదు కదా! కొంప దీసి ఏం అఘాయిత్యం చేస్తుందో!" అని చెప్పి బృందావనుడి గుండె అదిరి పోతూంది.

భర్తకాళ్ళ మీద బోర్లా పడింది. అతడి రెండు పాదాల మధ్యనీ ముఖం

దాచుకుని, అలాగే నిశ్చలంగా పడివుంది!

భయంతో బృందకూడా కదలటానికి సాహసించలేక పోయాడు.

చాలాసేపు అలాగే పడివున్న కుసుమకు తన భర్త పాదాల్లోంచి ఏదోశక్తి తన కోసం వచ్చినట్టయింది. కాస్సేపటికల్లా లేచి కూర్చుంది. భర్త ముఖం కేసి చూస్తూ, ఎంతో జాలిగా అన్నది—"ఇంత కష్టాన్నీ, ఈ దుఃఖాన్నీ ఎలా తట్టుకో గలవ్?" అని అందరూ అడుగుతున్నారు. రాత్రింబగళ్ళు నా హృదయం ఎలా దహించుకు పోతూందో వాళ్ళకేం తెలుసు! నేనెలా బతికేది? నాకేందారి? మిమ్మల్ని విడిచి చావమంటే కూడా ఎలా చావలో నాకు తెలియటంలే .....!" అంటూ విలపించింది.

ఇద్దరి హృదయాల్లోనూ మండిపోతున్న జ్వాల ఒక్కటే! బృంద మనస్సులో రగిలిన విద్వేషాగ్ని చల్లారిపోయింది. చేత్తో కుసుమను లేవనెత్తాడు!

"కుసుమ్!—నేను దేనితో శాంతి పొందానో, నువ్వూ అలానే శాంతి పొందాలి అది తప్ప మరో మార్గం లేదు," అని చెప్పాడు.

మాటాడలే, కుసుమ.

మళ్లీ చెప్పాడు బృంద—"చరణుడి మీద నీకెంత ప్రేమో నాకు తెలుసు కుసుమ్! అందుకనే నిన్ను నేనీమార్గానికి ఆహ్వానిస్తున్నా. వాడు చనిపోలేదు. వాణ్ని మనం పోగొట్టుకోలేదు, వాడు దాక్కుని వున్నాడు. అంతే! సరిగ్గా చూడటం మనం నేర్చుకోవాలి. నేర్చుకుంటే, ఎక్కడయితే పిల్లవాళ్లు మనకి కనిపిస్తారో, అక్కడల్లా మన చరణుడ్ని చూడగలుగుతావ్!"

కుసుమ కళ్లు ఇప్పటిదాకా కాలవలు కడుతూనే వున్నాయి. మళ్లీ ఒకసారి ఆమె వంగి భర్త పాదాలకు నమస్కరించింది. ఒక్క క్షణమయ్యాక ముఖం పైకెత్తి "నేనూ మీవెంట ..."

"నాతోనా? అసంభవం!" అన్నాడు బృంద భయపడుతూ,

"కాదు, సంభవమే! నేవస్తా!!" అన్నది కుసుమ.

"ఎలా వస్తావ్ కుసుమ్! నిన్ను నేనెలా పోషించగలను? నా ఒక్కడి కోసమయితే ఎక్కడున్నా భిక్ష అడిగి తెచ్చుకోగలను కాని, నీకోసం నేనీపని చేయలేను. అదీగాక, ఎంతెంత దూరాలు నడవాలో ఏం తెలుసు నీకు?"

తొణక్క బెణక్క వెంటనే చెప్పింది, కుసుమ్. "ఎంత దూరమయినా నే బాగానే నడవగల్ను. నే ఇప్పుడు నడిచి వచ్చాను, కనక బండిలేదు. భిక్ష భిక్ష అంటున్నారే! నేనుండి మిమ్మల్ని భిక్ష చేసుకో నిస్తానా? నాకోసము మీరు భిక్ష



ఎత్తవద్దు. మీకోసమూ వద్దు. మీపని మీరు చూసుకుంటూ వుండండి. తక్కినవన్నీ వాటంతటవే సర్దుబాటవుతాయి. నాకూ ఉపాయం, తెలుసు. సంసారం గడపటమూ తెలుసు. ఇన్నాళ్లూ అన్న సంసారం నేనే కదా గడిపాను?'' అన్నది.

కొంచెంసేపు ఆగి తరవాత అడిగాడు బృందావనుడు: ''కుసుమ్!—ఏ మంత్రంతో నేను దీక్ష పూనానో, ఆ మంత్రంతోనే నువుకూడ దీక్ష పట్టగలవా!''

''పట్టగల....''అన్నది కుసుమ, నిస్సంకోచంగా,

''అయితే సరే, రా!'' అంటూ బృందావనుడు తన సమ్మతి తెలిపాడు.

మరోసారి సమస్తమయిన బరువు బాధ్యతలూ కేశవుడికి అప్పగింతలు పెట్టి, ఆ రాత్రిపూటే బృందావనుడు భార్యని వెంటబెట్టుకుని, బాదలి గ్రామం వదిలి వెళ్ళిపోయాడు!—

---

# ఆడువాళ్ళ అంతరంగం

మధురాంతకం రాజారాం



పదిహేనేళ్ళకు మునుపు చలపతి ఎవడో నాకు తెలియదు. నాకు కనిపించినప్పటికే అతడు ముప్ఫయి యేళ్ళవాడు. జిల్లా ముఖ్యపట్టణం కావడాన మా వూళ్ళో బోలెడన్ని ఆఫీసులున్నాయి, అయిదారు హైస్కూళ్లున్నాయి. వ్యాపార సంస్థలున్నాయి. అప్పటికే ఒక కాలేజీ గూడా వెలిసింది. ఇంతమంది జనం యిక్కడున్న తర్వాత చుట్టపు చూపులకని, శుభాశుభ కార్యాలకని వచ్చేపోయే జనం మాత్రం తక్కువగా వుంటుందా? అందువల్ల హమేషా మాకు కొత్త ముఖాలు కనిపించడం పరిపాటే! కానీ కనిపించగానే యిత డెవడై వుంటాడబ్బా అంటూ విచికిత్సకు దిగవలసిన ప్రత్యేకత ఏ కొద్ది ముఖాల్లో మాత్రమో వుంటుంది. చలపతిని చూడగానే నే నలాగే అనుకున్నాను. మనిషి పొడుగరి. కోర మీసాలు, ఛంగులు జీరాడే పంచకట్టుతో, ఉల్లిపొరలాంటి లాల్చీ హొయలుతో, గుబురుగా గిరదాలాగా వెనక్కు వంగిన క్రాపింగుతో అతడిదంతా ఒక పిన్నపాళేగాడి వాలకం. మొదటిసారిగా బజారులోనూ, తరువాత హోటల్లోనూ కనిపించి, మూడోసారిగా అతడు నాకు మా వీధిలోనే ఎదురయ్యాడు.

ఆరోజు ఎనిమిది గంటలప్పుడు "ఎదురింటి కెవరో కొత్త వాళ్ళొచ్చారండీ!" అంది శారద.

ఆఫీసులో ఉద్యోగ నిర్వహణకు, ఇంటి దగ్గర వున్నప్పుడు గృహకృత్యాలు నిర్వర్తించడానికి, సాయంకాలాల్లో షికారు వెళ్ళిరావడానికి, యిలా అనుదిన వ్యాసంగాల చుట్టూ ఒక గిరి గీసుకుని కూర్చున్న నాకు మా వీధి సాంఘిక జీవితంతో అట్టే ప్రసక్తిలేదు. మా శారద సంగ

తలా కాదు. బ్రతుకులో సంచలనం లేక పోతే ఆవిడకు మతి పోయినంత పనవు తుంది. ఆ వీధిలో కాపురం పెట్టిననాటికి అక్కడ మాకు పుచ్చు కొక్కడైనా పరి చితులు లేరు. అలాంటిచోట అనతి కాలంలోనే మా ఆవిడకు అక్కలు, అత్తలు, పిన్నిగార్లు, వదినెలు, ఆడపడు చులు అసంఖ్యాకంగా పుట్టుకొచ్చేశారు. ఆ కొత్త చుట్టరికాలకు అనుగుణ్యంగా నేను కొందరికి అల్లుడి నయ్యాను. కొందరికి మరిది నయ్యాను. కొందరికి బావగారి నయ్యాను, కానీ మా వీధి కంతటికీ జెనరల్‌గా శారదమ్మ మొగుడిగామాత్రమే వుండిపోయాను! మా శారద నిర్వాకం గురించి యింతదూరం ఎందుకు చెబు తున్నానంటే ఎదురింటి కెవరో కొత్త వాళ్లు వచ్చారని తెలుసుకోడంతో ఆమెకు తృప్తికలిగి వుంటుందన్న నమ్మకం నాకు లేదు. వాళ్ళను గురించి మరికొన్ని వివరాలు తెలుసుకోనిదే ఆమెకు నిద్ర పట్టదు. నా వూహ కరెక్టు. శారద కొన సాగించింది.

"యింకా సామాన్లన్నీ తెచ్చుకో లేదట: ఎదురింటావిడ బకెట్టుకోసమని మనయింటికే వచ్చివెళ్ళింది లెండి! వాళ్ళ దసలు ఈ జిల్లా కాదట. హిందూపురం దగ్గర అదేదో వూరిపేరు చెప్పింది. అక్కడాక ఆఫీసులో పని చేస్తుంటే నేమో, ఆ ఆఫీసరుగారు వీళ్ళింటాయన నంటే కళ్ళల్లో నిప్పులు పోసుకునే వాడట! ఈయనేమో సాదా గుమాస్తా అయిపోయాడు. ఐనా ఆఫీసుకొచ్చిన వాళ్ళందరూ ఈయన దగ్గరకు రావడమే! ఈయనచుట్టూ మూగడమే ఈయన్ను ఘనంగా పొగడ్డమే! ఎంత చచ్చు ఆఫీ సరుకైనా ఒళ్ళు మండదటండీ! అతగా డీయన్ని దూరంగా ఎక్కడికైనా బదిలీ చేయమని పైవాళ్ళకు రిపోర్టు రాసి పడేశా డట! అలా కొట్టుకొచ్చారటండీ పాపం!"

భర్తను గురించి భార్య యిచ్చే స్టేట్ మెంటులో నూటికి నూరుపాళ్ళు నిజమే వుంటుందనుకోడానికి వీల్లేదు. ఎదురింటా విడ శారదకు తెలిపిన వర్తమానాన్నిబట్టి చూస్తే ఆమె భర్తను వెనకేసుకరావడం స్పష్టంగానే కనిపిస్తోంది. తన భర్త మామూలు గుమాస్తామాత్రుడేనని ఆమె చెప్పనే చెప్పింది. మరైతే ఆఫీసుకొచ్చిన వాళ్ళకందరికీ అతడితోనే ఏంపని? వా ళ్ళడపా దడపా ఆ ఆఫీసరుగారి ముఖాన్ని గూడా చూచిపోతుంటే ఆయనకలా ఆగ్రహం కలిగేది కాదుగదా! ఐనా గుమాస్తా సీటులో కూచుని యితడు ఆఫీ సరుగారి ప్రాధాన్యాన్ని ఎలా హరించ గలిగినట్టు? ఈ ఎదురింటావిడి ఎవరో గానీ, ఈమె తన భర్తను సమర్థించుకో డానికి యింపకంటే కట్టుదిట్టమైన సంజా యిషీ ఓ పొందించుకుని వుండవలసింది.

మరునాటి వుదయం టూత్ పేస్టు నుర గలు పెదిమలకు బాగా అంటుకపోవడం వల్ల హనుమంతుడి వేషం వేసినట్టున్న

కోరమీసాల వ్యక్తి ఎదురింటి వసారాలో ప్రత్యక్షమయ్యాడు.

''ఓహో, యితడే శాటోలు ఎదురిం టావిట భర్త అనుకున్నాను. అతడి పేరు చలపతి అనీ, ఏదో ప్రభుత్వ కార్యాలయంలో పనిచేస్తున్నాడనీ తరువాత తెలిసింది.

ఒక మట్టిగుట్టపైన హఠాత్తుగా ఒక దేవుడి విగ్రహం పుట్టుకొస్తే చెలరేగే సంరంభం ఎలాంటిదో తమకు తెలుసు. సరిగ్గా అలాగే చలపతి ఎదురింట్లో చేరి నప్పటినుంచీ మా వీధికొక గుర్తింపు రావడం నేను గమనించాను. అప్పట్లో వుండివుండీ కొన్ని వీధిలో కొత్త ముఖాలు కనిపిస్తుండేవి. ఎదురింటి వసారాలో మనుషులు తచ్చాడుతూ వున్నట్టయితే అది చలపతి యింటిలోపల వున్నాడనేందుకు గుర్తు. వసారా నిర్జనంగా వున్నట్టయితే చలపతి యింట్లో లేనట్టు లెక్క. ప్రశస్తి హెచ్చిన కొద్దీ తీర్థానికి యాత్రీకు లెక్కువగా రావడం సహజమే! రానురాను చలపతికోసం వచ్చిపోయే వాళ్ళ సంఖ్య సైతం పెరగ సాగింది. తీరికవేళల్లో ఎప్పుడైనా వీధి గుమ్మంలో నిల్చుని రోడ్డువైపు చూస్తుంటే ఎవడో ఒక ఆగంతకుడు వికరంగా నాతోనే పనివున్నవాడిలా దగ్గరకు వచ్చి ''బాబూ! చలపతిగారి యిల్లెక్కడండీ?'' అనేవాడు. చలపతి యిలా చాలామందికి దర్శనీయుడు గావడంలో నాకు ఎట్టి ఆక్షేపణా లేదు. అతడింట్లో వున్నంతసేపు మూల విరాట్టుగానూ, బయటకు వెళ్ళివప్పుడు ఉత్సవ విగ్రహంగానూ భావింపబడడం గూడా నాకిష్టమే! కానీ యిందువల్ల మొదట మనసు కాస్తా చివుక్కుమన్నది మా శారదకే!

ఓ రోజామె వుండబట్టలేక అనేసింది గూడా:

''ఇదికాదండీ! ఏమిటో బాబూ, మీరు వున్నారు! మనకూ పెళ్ళయి యిది మూడోయేడో, నాలుగో యేడో జరుగుతోంది. ఇంతకాలంగా చూస్తున్నాను కదా! మీకోసమని పనిగట్టుకుని ఒక పెద్దమనిషి అయినా యింటి దగ్గరికి వచ్చిన పాపాన పోలేదు. ఆచలపతి అనే ఎదురింటాయనా వున్నాడు. ఆయన కోసం వచ్చేవాళ్ళతో, పోయే వాళ్ళతో వాళ్ళింటి వసారా ఒక వరస అరిగి పోయింది గదండీ!''

''అవున్నిజమే శారదా!'' మారు మాటలేకుండా ఒప్పేసుకున్నాను. 'కొందరు యోగ జాతకులుంటారు. మచ్చు మందు చల్లినట్టుగా వాళ్ళచుట్టూ జనం మూగి పోతూ వుంటారు. మిగిలిన వాళ్ళు డబ్బిచ్చి పిలిచినా వచ్చే వాడుండడు. ఏం చేద్దాం చెప్పు. చలపతి అలాంటివరం అడి గొచ్చాడు. మనం యిలాంటి శాపం పొంది వచ్చాము. చేసుకున్న వాళ్ళకు చేసుకున్నంత అని

పూరికేనా అన్నారా పెద్దలు!''

పాత గ్రాంథాల్లోని పడికట్టు మాటలపై లాగ్వంటే—శారదకు చాలా యిష్టం. అందుకని ఆమెకు అర్థమయ్యే భాషలో, నచ్చే పద్ధతిలోనే నేను నా వాదాన్ని రూపొందించాను. కానీ ఎందుచేతనో నేను తనను పరిహాసం చేస్తున్నట్టుగా శారదకు ధ్వనించింది. మరేమీ అనలేక ఆమె నావైపొక క్షణం కొరకొర చూచి లోపలికి వెళ్ళి పోయింది.

ఈ బెడద యింతటితో తీరిపోయేదిలా కనిపించలేదు.

నెలరోజులు తిరగక మునుపే మళ్ళీ ఒకసారి నాపైన మెరపు దాడిలా విరుచుక పడింది శారద.

''ఏమండీ! మనకు పెళ్ళయినప్పటి నుంచీ చెబుతున్నాను. మీరేమైనా నా మాట వినిపించుకున్నారా? ఆ ఎదురింటాయన్ను చూడండి. కాపురంపెట్టి యింకా రెండు మాసాలైనా కాలేదు, అప్పుడే తెప్పించి హాల్లో వేయించేశాడు ...''

నాపరాయా, చట్టు బండా అని మనసులో మాత్రం అనుకుని ''ఏమిటి శారదా వేయించింది?'' అన్నాను.

''అదే పట్టెమంచం! అంతాటేకు కొయ్యే! ఆ నవారు మాత్రం? ఎంత పొంకంగా కుదిరిందనీ! ఒక్కసారిగా యిద్దరు ముగ్గురెక్కి తొక్కినా దానికేం దోకా వుండదు....''

''అలాగా! చలపతి పట్టె మంచం కొన్నాడా శారదా! మనదేం పోయింది, కొననివ్వు! ఎంతగా నేను బడి పంతుల్ని అయినా ఒక పట్టెమంచం కొనలేననా నీ వుద్దేశం? అబ్బే, నువ్వొక్కనాటికీ అలా అనుకోవద్దు, మనం కొంటాం. కొని తీరుతాం. లేదంటే కొత్త స్కేలు కాస్తా అమల్లోకి రావాలంతే! నువ్వు చూస్తునే వుండు. అయి దారు మంది ఎక్కిచెడ ద్రొక్కినా విరిగిపోని పట్టె మంచం నేనే కొంటాను. దానిపైన నువ్వే పడుకుంటావు'' అన్నాను. (అన్నానా, ఓదార్చానా?)

శారద తెల్లబోయింది, ఈ మనిషి మాటలతో మనకేం లెమ్మన్నట్టు తన పాటుకు తాను వెళ్ళి పోయింది.

నేను కొన దలచుకున్న గృహోపకరణ సామగ్రిలో పట్టె మంచం ఒకటి. ఎదురింటి చలపతి కొనగలిగిన వస్తువుల జాబితాలో అది మొదటిది గావడం నా దురదృష్టం. అంతేగాదు,అతడి జాబితా చాలా పెద్దదని నాకు కాలక్రమాన తెలిసి వచ్చింది. ఆ జాబితాలో రెండోది స్టీలు బీరువా. నేనైతే దాని అందచందాలను తిలకించలేదు. చూచి వచ్చిన శారద చెప్పగా విన్నాను. అది బాగా పొడుగైన మనిషికన్నా ఎత్తుగా వుంటుంది. అయిదరలున్నాయి. మధ్యలోవున్న అరకు ప్రత్యేకంగా తాళం పెట్టు కోవచ్చు. విలువైన వస్తువులు పెట్టుకోడానికి ఆ సొరుగులో మళ్ళీ ఒక రహస్యపు




సొరుగు వుంది. వెలగూడా తెలుసుకో కుండా రాలేదు శారద. అయిదు పచ్చ నోట్లు తమవి కావనుకుంటే ఎవరైనా అలాంటి బీరువాకొనుక్కోవచ్చు.

అయిదు వందల రూపాయలుపెట్టి బీరువా కొనుక్కోదలచుకుంటే నన్నడు కునే లౌకికశక్తి ఏదీలేదు. కానీ నాకున్న సమస్య ఆమాత్రం డబ్బును మిగిలించ డమే! ఐతే నాకున్న ఈ యిబ్బందిని యిప్పుడు శారద సానుభూతితో అర్థం చేసుకోగలదని అనిపించడంలేదు. ఇప్పు డామె ఎదురింటి చలపతి ప్రయోజకత్వా నికి నాతాహత్తును పాటా వేసి చూచే ప్రయత్నంలో వుంది. పట్టె మంచానికి వేసిన నవారు మాసి పోకముందే చలపతి ఉక్కు బీరువా కొనుక్కోగలిగాడు. నే నింకా మొదటి దానికే దారి దొరకని దుస్థితిలో వున్నాను.

ఇందులో యింకొక చిక్కుగూడా వుంది. చలపతి గనుక ఓ గెజటడ్ ఆఫీసరై వుంటే శారద నన్నతడితో పోల్చి చూచి కించ పరిచి వుండేదిగాదు. మా ఆర్థికస్థాయి యించుమించుగా సమా నమే! ఇద్దరిలోనూ ఒకరు సునాయా సంగా చేసి పారవేయగల పనిని మరొకరు గిపెట్టి గింజుకుని గూడా చేయలేక పోతున్నారంటే అర్థమేమిటి? ఒక్కమా శారదేగాదు. ఇలాంటి పరిస్థితిలో మా శారదలాంటి ఆడవాళ్ళెవరైనాసరే, తమ భర్తల తాహత్తును శంకించే ఆస్కార ముందనే నేను భావిస్తాను.

లోకంలో ఎవరేమైపోతే మనకేం లెమ్మను కుని వూరుకునే వాణ్ణి, నేనిక్క డొక చిన్న యిన్వెస్టిగేషనుకు పూను కున్నాను. చలపతి ఏ ఆఫీసులో పనిచేస్తు న్నాడో తెలుసుకున్నాను. అతడి చుట్టూ చేరుతున్న వాళ్ళెవరో ఆరాతీశాను. అజ్ఞానపుతెర తొలగిపోయే సరికి ఆత్మ

సాక్షాత్కారం సాధ్యమైనట్టుగా చలపతిని గురించిన నిజాన్ని యిట్టే పట్టేయగలిగాను. చలపతి వ్యాపార సాపారాలపైన పన్నులు విధించి, వసూలుచేసే కార్యాలయంలో పనిచేస్తున్నాడు. ఆవిధంగా వ్యాపారస్తుల ఆయువుపట్లన్నీ అతడి గుప్పిట్లో వున్నాయి. వాణిజ్యం న్యాయ సమ్మతంగానే జరిగి తీరాలన్నది చలపతి అభిమతంగాదు. దీని కంటూ ఆఫీసుల్ని ఏర్పాటుచేసి, యింత సిబ్బందిని పోషిస్తున్నది గనుక ఈ డిపారుమెంటు వల్ల ప్రభుత్వానికి న్యాయం చేకూరాలన్న మొగ మాటంగూడా లేదు. తన స్వంత లాభానికీ పుష్టి, తుష్టి చేకూరు తున్నంత వరకు అతడాఫీసరుగారి కొక్కరికి మాత్రమే విధేయుడు. ఆఫీసరుగారు స్వయంగా రంగంలోకి దిగగూడదు. సర్వాధికారాలతో యితడు తన ప్రతి విధిగా వ్యవహరించడానికి ఒప్పుకోవాలి. ఇలా ఆఫీసరుగారు బుద్ధిగా మసలుకునే పక్షంలో చలపతి ఆయన వాటా ఆయనకు ముట్ట జెబుతాడు. తన వాటా తాను జేబులో వేసుకుంటాడు.

మునుపటి కెవడో శాస్త్రజ్ఞుడిలా యురేకా, యురేకా అని అరవాలని పించింది నాకు! అంతటి ఉత్సాహం తోనూ యింటి ముఖం పట్టాను. శారదను దగ్గరగా కూచో బెట్టుకుని విషయాన్ని సవిస్తరంగా వెల్లడించాను. "ఓహో అలాగా! ఇంత అన్యాయమా! అబ్బే, అదేం బ్రతుకండీ...." శారద నోటి గుండా యిలాంటి మాటలొస్తాయనే ఆశించాను. అలా జరగలేదు. నేనేమో అయ్యవారినే చేయబోయాను. అదికాస్తా కోతిగా తయారై కూచుంది.

ఎలాగంటారా!

నామాటల్లోపసదనమనేది మాశారదకు కంచుకాగడా వేసి వెదికినా కనిపించినట్టు లేదు. అప్పటికి నేననవసరంగా ఏదో గొడవ చేస్తున్నట్టు ఆమె నావైపు అయోమయంగా చూచింది.

"అదికాదండీ! సుఖంగా బ్రతకడం మనచేత గాదు. ఆవిషయం ఏనాడో బుజువైపోయింది. మనం మనకోరికల్ని తీర్చుకోలేం. ఏదో దొరికింది తింటాం. మనుషుల్లా యిలా వుంటాం. లేదంటే రెండేళ్ళకొకకర్ని లెక్కన కంటాం. ఈ మాత్రానికి మనకులేని పోని సోదెలు గూడానా! ఒక యిల్లాలు మొగుడు కొట్టినందుకు గాకుండా యితరులు నవ్వినందుకేడ్చిందట! మీ ఎవ్వారం గూడా అలాగే వుంది. మన మెలాగూ సంపాదించలేం. ఎవరో యింకొకరు సంపాదిస్తుంటే మనకీ వుడుకు మోత్తనం ఎందుకో! చాల్లే, వూరుకోండి...."

ఊరుకోక నేను చేయగలిగిందే ముంది? నీళ్ళు చల్లితే మంటలు ఆరి పోవచ్చునని నేననుకున్నాను. నేను చల్లింది ఆజ్యమని తీరా చల్లిన తర్వాత తెలిసింది.

ఎలాగైతేనేం, అప్పటి నుంచీ శారద ఎదురింటి వాళ్ళ ప్రసక్తిని తీసుక రావడం తగ్గించేసింది.

అయిదారు నెలలలా గడిచిన తర్వాత హఠాత్తుగా చలపతి యిల్లు ఖాళీ చేసేయ బోతున్నాడని తెలిసేసరికి నాకు అపరిమితమైన ఆనందం కలిగింది.

"మార్చుకేం చేస్తారెండి!" అంటూ నిట్టూర్చింది శారద.

"ఏం శారదా! ఏంకష్టం వచ్చింది వాళ్ళకు?" అన్నాను.

"ఊహూ! వాళ్ళకు కష్టం వస్తుందనేనా మీ ఆశ! భలే వారేనే! వాళ్ళకెందు కొస్తాయండీ కష్టాలు? అదేం లేదు. అసలేం జరిగిందంటే ఈ మధ్య రెండు మూడు బుట్టల నిండుకూ స్టీలు సామాన్లు కొనేశారు. ఓ డజను కుర్చీలు, ఓ డైనింగు టేబిలుకొని రెండు మాసాలైంది. వాటినన్నింటినీ సర్దిపెట్టుకోడానికి తావుండొద్దా? డెబ్బయి అయిదు రూపాయలకు పక్కవీధిలోనే యిల్లు కుదిరిందట! వెళ్ళిపోతున్నారు. నన్నొదిలిపెట్టి వెళ్ళవలసి వచ్చినందుకు పద్మక్కకు మనసు మనసులో లేదనుకోండి! మాటి మాటికీ వచ్చిపోతుండమని మరిమరీ చెప్పింది..."

శారద తప్పకుండా వెళ్ళవలసిందే! కొత్త యింట్లో చలపతి స్టేటస్ మరింతగా పెరుగుతుంది. అతడు పెళ్ళానికి ఏడు వారాల సొమ్ములు చేయించినా చేయిస్తాడు ఆ యిల్లొక ప్రదర్శనాలయమై తీరుతుంది. ఆ ప్రదర్శనం తిలకించడానికి శారదలాంటి ప్రేక్షకు లెందరైనా అవసరమే!

ఆ మాటకొస్తే మా శారదతోబాటు నేను గూడా వొక ప్రేక్షకుణ్ణిగాకపోలేదు. ఐతే నన్నాకర్షించింది చలపతి భోగభాగ్యాలుగావు నేను ప్రేక్షకుడుగా చూడ తలచుకున్నది అతడి జీవిత నాటకాన్ని! నా మట్టుకు నాకు అదెంతో రసవత్తరంగా వుంది. చిన్న ఉద్యోగం, పెద్ద సంపాదన. ఎలాంటి పనైనా చిటికెలో చేసేయగల పలుకుబడి. బజారులో వెళ్తుంటే "రాజాధి రాజ, రాజ గంభీర" అంటూ కైవారాలు వెలువడక పోవడమొకటే కొరత. బాగుంది, చాలా బాగుంది. ఇంతకంటే ఏ నాటకం మాత్రం పసందుగా వుంటుంది?

జీవితం వొక నాటకం లాంటిది గనుక యిందులోనూ కొన్ని అనుకోని మలుపులు పుట్టుకరావడం సహజం. రెండు మూడేళ్ళ తర్వాత ఒక గాలి కబురు నా చెవిలో పడింది. చలపతి కీర్తి రాష్ట్ర ముఖ్యనగరం దాకా ప్రాకిందట! పై అధికారులు యింతటి ప్రయోజకుణ్ని భరించడం తమ డిపార్టుమెంటువల్ల సాధ్యంకాదని తలపోస్తున్నారట! కొద్ది రోజుల్లో పోస్టింగు రావచ్చునని తెలిసింది.

ఆశ్చర్యమేమిటంటే దీన్ని సైతం మా శారద ఒక విషాద వార్తగా తీసుకో

లేదు.

"పద్మక్క చెప్పింది లెండి! కాస్త పచ్చగావున్న వాళ్ళను చూస్తే లోకులకు మనసొప్పుతుందా? అలాంటివాళ్ళెవరో లేనివి పోనివన్నీ జతచేసి చలపతిగారి పైన పిటిషన్లు పెట్టేశారట! అక్కడెక్కడో హైద్రాబాదులో కూర్చున్న వాళ్ళకేం తెలుస్తుంది? ఇక్కడొక ఖాళీ ఏర్పడితే తమ వాళ్ళ నెవళ్ళనైనా అందులో పడెయ్యవచ్చునని వాళ్ళ ప్లానట! అందుకని వాళ్ళు గూడా ఈయన పైన పగబట్టి "వుంటావా, పూడతావా" అని బెదిరిస్తున్నారట! కానీ చలపతిగారు కూడా ఏమంత చేతగాని వాడు కాదు లెండి!"

"ఏం చేస్తాడట శారదా?"

"ఏం చేస్తాడు! రాజీనామా రాసి వాళ్ళ ముఖాన కొడతాడు ..."

"కొట్టి?"

"ఏదైనా బిజినెస్ పెట్టుకుంటాడు. అప్పుడే నలుగురు రైదుగురు పెద్దమనుషులు పార్ట్‌నర్స్‌గా వుండడానికి మేమంటే మేమని ముందుకొస్తున్నారుట ..."

పైన్నుంచి పోస్టింగు ఆర్డరేవచ్చిందో, లేకపోతే యితడే రాజీనామా వ్రాసి పడేశాడో నాకు తెలియదు. మొత్తానికి వుద్యోగం పూడింది. ఆ విషయం ముందుగానే తెలిపి, అందుకు చలపతి సిద్ధమైవున్నాడనేందుకు నిదర్శనంగా కొద్ది నెలల్లో పట్టణంలో ఒక కొత్త హోటలు వెలసింది. ప్రారంభోత్సవం నాడు నేనూ వెళ్ళి చూచాను. చిరునవ్వులు వెలుగుతున్న ముఖంతో గల్లాపెట్టె దగ్గర కూర్చున్న చలపతి నాకు సుస్వాగతం పలికాడు.

"రండి రండి కృష్ణమూర్తిగారూ! అనుభవం చాలనివాణ్ణి. ఇందులో దిగేశాను దీనికైనా నా దగ్గర డబ్బెక్కడిది? పెట్టుబడి పెట్టిన మహారాజులు వేరే వున్నారు. వాళ్ళకు నా పైన ఎంత విశ్వాసం, ఏం కథ! ఈ బిజినెస్సులో బుడుంగున మునిగిపోకుండా మేము పైకి తేలడం మీలాంటి వాళ్ళపైన ఆధారపడి వుంటుంది. మీరు తరచుగా వచ్చిపోతుండాలి. ఇంకా మీ స్నేహితులతో గూడా చెప్పండి. జేబులో డబ్బుండి తీరాలన్నదేం లేదు. అకౌంట్‌లు పెట్టించుకోవచ్చు .."

ముచ్చటగొలిపే చలపతి ఆతిథ్యమర్యాదల్ని స్వీకరించడానికైనా తరచుగా ఆ హోటలుకు వెళ్తూవుండాలనిపించింది. రేట్లు కాస్త ఎక్కువే ననుకోండి కానీ సదుపాయాలు దివ్యంగా వుండేవి. హాల్లో వేడి వేడిగా కాఫీ, తేనీరులాంటి పానీయాలు, లోపలి గదుల్లో శరీరాని కంత కంటే వేడియిచ్చే పానీయాలు దొరుకుతుండేవి. ఇరవైనాలుగ్గంటలూ పేకాట కొనసాగే రహస్యాగారం ఒకటి ఆ హోటల్లోవుందని గూడా విన్నాను.




ఐనా ఆ హోటలు గొడవలన్నీ మన కెందుకు? దానివల్ల చలపతికి ఏ మాత్రం లాభించిందన్నదే ప్రధానం. ఇంతకు మునుపు చలపతి చేసిన గవర్నమెంటు ఉద్యోగంలాగే ఈ హోటలు గూడా అదృష్టవంతు డెక్కడికి వెళ్ళినా బాగుపడ కుండా వుండడనే నిరూపించింది. కాఫీ పైకం మినహాయించుకుని చిల్లర డబ్బు లివ్వడంకోసం చలపతి పెట్టె తెరచినప్పు డల్లా నాకాగల్లా పెట్టె వొక చిన్న సైజు ధనలక్ష్మి కొలువుకూటంలా కనిపించేది.

ఆ హోటలు వ్యాపారం రెండు మూడేళ్ళపాటు దేదీప్యమానంగా సాగి పోయింది.

ఆ మధ్య ఒకసారి శారద "ఏమండీ! మీకొక రహస్యం చెప్పనా?" అంది.

శారదకు రహస్యం చెప్పేవాళ్ళెవ రైతే వున్నారో వాళ్ళు శుద్ధ తెలివి తక్కువ వాళ్ళని నా వుద్దేశం. ఏమంటే ఆమె నోటిలో నువ్వుగింజ నానదు. కనీసం నాకైనా ఆ రహస్యం చెప్పే స్తుంది.

"పద్మక్క మీక్కూడా చెప్పొద్దంది లెండి! మరేంలేదు, చలపతిగారు అయిదు వేలుపెట్టి ఓ రవ్వల నెక్లెసు చేయిం చాడు. ఎంత బాగుందనుకున్నారు?"

"ఎందుకు బాగుండదూ? అయిదు వేలా, మజాకానా? తప్పకుండా బాగుం టుంది" అన్నాను.

"మరి....హోటలుకు పెట్టుబడిపెట్టిన వాళ్ళున్నారే, వాళ్ళు చాలామంచివాళ్ళని మన మనుకున్నాం. ఎంత పొరబాటో చూచారా! తెల్లనివన్నీ పాలనుకో గూడదు. వాళ్ళవన్నీ కుళ్ళు బుద్ధులట! వాళ్ళో, వాళ్ళ పెళ్లాలో చీటికీ మాటికీ వచ్చికూర్చుని "ఈ దుద్దులెక్కడివి? ఈ గాజు లెప్పుడు చేయించారు? ఈలోగా ఎన్నిచీరలు కొన్నారు?' అంటూ ఒకటే వూదర పెట్టేస్తారట! ఏం చెయ్యాలి చెప్పండి. స్వర్గానికి వెళ్ళినా సవతిపోరు

తప్పదేః అందుకని ఎప్పుడైనా మెడలో నెక్లెసు పెట్టుకోవాలనిపిస్తే పద్మక్క యెకాయెకిన పుట్టింటికి వెళ్ళిపోయి వారం పదిరోజు లుండి వస్తుందటః''

కానీ నెక్లెసు వేసుకునే మోజు తీర డంకోసం పద్మక్క అలా ఎంతోకాలం పుట్టింటికి యాత్రలు సల్పే అవసరం లేక పోయింది. అపాటికే హోటలు వ్యాపారం స్తంభించిపోయే స్థితికి వచ్చింది. ఒక్కొక్కరుగా భాగస్వాములందరూ తెగ తెంపులు చేసుకున్నారు. చివరికొక్క చలపతి మాత్రం మిగిలాడు. అతడు గూడా మిగిలివున్న బెంచీలు, కుర్చీలు, బల్లలు, పాత్రసామగ్రీ అయినకాడికీ తెగనమ్మి శనగలు తిని చేయి కడుక్కున్నట్టుగా హోటలుకు తగిలించిన నేమ్ బోర్డు తీసి రిక్షాలో వేయించుకుని చక్కా యింటికొచ్చేశాడు.

నాలుగైదువేల రూపాయల కిమ్మత్తు చేసే స్కూటరుపైన బలాదూర్లు తిరుగుతూ చలపతి ఎప్పుడైనా నా కెదురయ్యేవాడు. ఎదురైనప్పుడల్లా 'నెక్స్ట్ అయిటం ఆఫ్ ది ప్రోగ్రాం ఏమిటి బాబూః'' అని అడగాలనిపించేది.

అడగని పాపం నాది. తనంతట తానే చెప్పేశాడు చలపతి

చూడ్డానికి చాలా సాధారణమైన విషయం. వెనక ఎంతో అసాధారణమైన వ్యూహం. మనుషులపైన సూదంటు రాయిలాంటి ఆకర్షణ. ఈ శుభలక్షణాలన్నీ చలపతి పథకానికి అన్వయించేవే.

ప్రతి మెంబరూ చెల్లించవలసిన మొత్తం రెండువందలేః అంతా వొకటే సారిగా ప్రారంభంలో చెల్లించాలి. మొత్తం మెంబర్ల సంఖ్య వెయ్యిన్నీ ఏడువందలయాభై. నెల వొకటికీ పదింటి చొప్పున ఆరుసంవత్సరాల పొడుగునా బహుమతు లుంటాయి. మొదటి నెల మొదటి బహుమతి అంబాసిడర్ కారు. చివరినెల చివరి బహుమతి గూడా ఆరు వందలకు తగ్గదు. ఈ దెబ్బయిరెండు నెలల్లోనూ ప్రయిజుకు నోచుకోని వాళ్ళకు ప్రణాళికాంతంలో అయిదువందల రూపాయలు నగదుగా యివ్వబడుతుంది. అంచేవల్ల వొకటి ముప్పాతిక ఎల మంది మెంబర్లలో వొక్కడికైనా నష్టమున్న మాటే లేదుః

''ఎలావుందండీ కృష్ణమూర్తిగారూః'' అన్నాడు చలపతి.

చాలా బాగున్నట్టు వొప్పుకొన్నాను.

''మాట చెబితే చాలదు. మీరు మెంబరుగా చేరాలి. మీ ఆఫీసువాళ్ళను చేర్పించాలి. ఇప్పటికే వెయ్యిమందిని చేర్పించేశాను. అసలీ స్కూటరు కొనడం లోని వుద్దేశం అదేః''

ఒక రూపాయ పెట్టు బడితో లక్షలు వచ్చి జేబులో పడిపోవడం తథ్యమేనని కలలుగనే వాళ్ళు లోకంలో బోలెడు మంది వున్నారు. లాటరీలు, చిట్ ఫండులు, ఫైనాన్స్ కార్పొరేషన్లు, మనీ



"హలో పోలీస్‌స్టేషనాండీ? నా పేరు అప్పారావండీ మా ఆవిడ తప్పిపోయిందని రిపోర్టు యిచ్చాగదండీ....యిహ. మీరు శ్రమ పడకండి."

"ఏం, మీ ఆవిడ దొరికిందా?"

"అహ. లేదనుకోండి. కాని, నా మనస్సు మార్చుకున్నాను."

---

సర్క్యులేషన్లు మొదలైన వాటితో చక్కిలి గింతలు పెట్టగా, పెట్టగా ధనలక్ష్మి శరీరం స్పర్శకతీతంగా మొద్దు బారి పోయే వుంటుంది. ఈ పరిస్థితిలో చలపతి తల పెట్టిన పథకం దిగ్విజయంగా కొనసాగ గలదనడానికి ఎలాంటి అభ్యంతరము కనిపించదు.

ఆరేండ్ల బృహత్ప్రణాళిక ప్రారంభ మైంది. ఇంకా పూర్తి కాలేదు.

రెండేళ్ళ క్రిందట చలపతి చావడి వీధిలో ఒక యింటి జాగ కొన్నట్టు తెలిసింది. ఇల్లు నిర్మాణదశలో వుండగా ఒకసారి మా శారద పద్మక్కతో బాటు వెళ్ళి చూచి వచ్చింది గూడా!

పద్మక్క ఇంగ్లీషు చదువులు చదువు కోలేదట. పట్టణవాసం వల్ల ఆమె నేర్వ గలిగిన కొద్దిపాటి యింగ్లీషు వకాబ్లరీకి ఖర్త కడుతున్న యిల్లు పుణ్యమా అని బాల్కనీ, పోర్టికో, బాత్‌రూము, వెయిటింగురూము. కిచెను. డైనింగు హాలు అంటూ కొంత కొత్త పదజాలం చేరిందట! మురిసిపోతూ చెప్పింది శారద.

"ఎన్నిసార్లు పిలిచినా మనమిద్దరం కలిసివెళ్ళనే లేదు. గృహప్రవేశానికైనా తప్పకుండా మిమ్మల్ని తీసుకరమ్మంది. అప్పటికేదైనా అడ్డుమాట చెప్పారో, ముఖం చిన్నబుచ్చుకుంటుంది. ఆవిడసలే మెతకమనిషి!

కానీ దేనికైనా ప్రాప్తం వుండొద్దా? మా దురదృష్టాని కొకర్ని నిందించి ఏంలాభం? గృహప్రవేశానికి మేము జంటగా వెళ్ళలేకనే పోయాము.

కొంతనాలుకకు పెడితే అసలు నాలుక గూడా వూడిపోయిన చందంగా గృహ ప్రవేశ మహోత్సవానికి శారద ఒంటరిగానైనా హాజరు కాలేక పోయింది.

వెళ్ళడానికి వీల్లేకుండా ఈలోగా ఒక ... ఒక... ఏమనాలో తోచడం లేదు దాన్ని! సంఘటన అంటే చప్పగా వుంటుంది, తమాషా అంటే వ్యతిరేకార్థం వస్తుంది. వైపరీత్య మంటే చలపతికి కోపం రావచ్చు.

జరిగింది జరిగినట్టుగా చెప్పేయడం మంచిది.

ఎప్పుడో అయిదారు నెలలకొక సారి గానీ నాకు చావడి వీధిగుండా వెళ్ళవలసిన పని తగలదు. నిర్మాణం పూర్తయిన క్రొత్తలో నే నొకసారి ఆవీధి గుండా వెళ్తూ చలపతి యింటి వైపు చూచాను. అది అక్కడి కక్కడ పునాదులు తీసి, యిటుకలతో గోడలు కట్టి, పైకప్పువేసి, సిమెంటుతో పూత పనిచేసి, రంగులు కొట్టి, యిలా వివిధ దశలద్వారా రూపొందిన కట్టడంలా తోచడంలేదు. హఠాత్తుగా చూచినట్టయితే ఏమాంబళం నుంచో, ఏపంజగుట్ట నుంచో అలాగే పెళ్ళగించుకొచ్చి యిక్కడ పెట్టేసిన బంగాళాలా కాన వస్తోంది.

చలపతి యిల్లుకట్టి చూచాడు. చాలా బాగా కుదిరింది. కొత్త యింట్లో తన జీవితమంతా ఒక కొత్త తరహాలోనే నడవాలని ఆశించాడు. అందువల్ల కొత్త యింట్లోకి గూడా పాతపెళ్ళాన్నే తెచ్చుకోడం అతడికి చాలా అసంగత మైన విషయంగా తోచింది. ఏనాటి అనుబంధమో తెలియదు. డ్రామాల్లో చలాకీ పాత్రలు ధరించే ఓ అమ్మాయి మెడలో అతడు పుస్తె కట్టేశాడు. ఆమెను తీసుకొచ్చి నూతన గృహంలో ప్రతిష్ఠించి, కొత్త కాపురమనే నావకు జోరుగా లంగరెత్తేశాడు!

తిట్టిన తిట్టు చర్వితచర్వణంగా కుండా తిట్టి పోసింది శారద. రోజుల తరబడీ తిట్టింది. గ్రహచారంచాలక చలపతి గనుక మావీధిలో కనిపించి వుంటే చేరెడు దుమ్మెత్తి అతడి తలపైన దిమ్మరించి వుండేది గూడా!

భార్యా భర్తల్లో ఒకరి అభిప్రాయాలను యింకొకరు విధిగా సమర్థించి తీరవలసిందే నంటూ చట్టమేమీ లేనట్టయితే నేనిక్కడొక మనవి చేసుకోవలసి వుంది. చలపతి పై అధికారులను మోసగించాడు. ప్రభుత్వాన్ని దగా చేశాడు. వ్యాపారంలో వాటాదారుల్ని వంచించాడు. ప్రజల్ని దోచాడు. ఐతే యిదంతా మా శారదకు సజావైన వ్యవహార సరళిగానే తోస్తూ వచ్చింది. మరైతే యిప్పుడతడు రెండో పెళ్ళి చేసుకున్నందువల్ల ధర్మానికి కొత్తగా కలిగిన హాని ఏముందో నాకు తెలియడంలేదు. శారదకు చలపతిపైన యిలా ఆగ్రహం కలగడంలో ఔచిత్య మేమిటో నాటికీ, నేటికీ నాకు బోధపడలేదు!

———




జీవన్ దగ్గర్నుండి వచ్చిన ఉత్తరం చదివి నిర్ఘాంతపోయాను.

"ప్రియమైన కృష్ణా,

నేను పిల్లలిద్దరినీ మా గ్రామంలో వదిలిపెట్ట దలిచాను. అక్కడీ మధ్య "ప్రకృతి బాల ఆశ్రమం" నొకటి పెట్టారు. నియమితమైన క్రమశిక్షణ, విపరీతమైన స్వేచ్ఛ వారి కక్కడ లభిస్తుంది. పిల్లలవెంట మా విధవ అక్కయ్య వుంటుంది. పిల్లలిద్దరికయ్యే ఖర్చు నేను భరిస్తా నెలాగూ....

పిల్లల్ని అక్కడ వొదిలిపెట్టి వస్తూ, మీ యింట్లో దిగి, ఒకపూట సీతో గడిపి, తిరిగి ఢిల్లీ వచ్చేస్తాను....

నీ ప్రియస్నేహితుడు,

"జీవన్."

"ఎవరిదగ్గర్నుంచి ఉత్తరం?"

విజయ ఎప్పుడొచ్చిందో, అడుగుతోంది.

"జీవన్ దగ్గర్నుంచి." ముక్తసరిగా అన్నాను.

"జీవన్‌బాబుగారి దగ్గర్నుంచా?" విజయ కళ్ళు మెరిశాయి క్షణకాలం. ఆ "బాబు" అన్న పదం ప్రత్యేకమైన వ్యక్తుల....ముఖ్యంగా బాగా డబ్బున్న వారి విషయంలో మాత్రమే వాడుతుంది విజయ!

"ఊ!"

"ఏం వ్రాశారు?"

"తన పిల్లలిద్దరినీ వాళ్ళగ్రామంలోని బాల ఆశ్రమంలో వదులుతాడట. ఆ సందర్భంలో వీలైతే ఇక్కడ దిగి వెళతానని వ్రాశాడు?"

విజయ కళ్ళు విప్పార్చి చూసింది. ఏదో నమ్మకూడని విషయం వింటున్నట్లున్నా యామె చూపులు.

"లక్షణంగా ఢిల్లీలో వున్నవాళ్ళు! కాన్వెంటులో ఎంత డబ్బయినా ఖర్చు పెట్టి చదువు చెప్పించగలవాళ్ళు.... నీటయిన డ్రెస్సులతో ఫ్రిజిడేర్‌లోని తాజా పళ్ళలా.... నవనవలాడేలా పిల్లల్ని వుంచగల స్థితిలో వున్నవాళ్ళు.... వున్నది ఇద్దరు మగ వెధవలు! ఈ దుర్బుద్ధేమిట? ఎక్కడో గ్రామంలో వాళ్ళని వదిలెయ్యటమేమిటి? జీవన్ బాబుగారికి ఆలోచన లేకపోతే, ఆయన భార్య మంజులకైనా లేకపోయిందా? ఏమిటో.... డబ్బు ఎక్కువగా వున్నవాళ్ళకి.... కొన్ని పైత్యాలుంటాయేమో!"

"పైత్యాలు డబ్బు ఎక్కువగా వున్నవాళ్ళకేకాదు. తక్కువగా వున్నవాళ్ళకి కూడా వుంటాయి. ఎటొచ్చీ తమకు పైత్యం వున్నట్లు ఒప్పుకోరు అంతే!" అన్నాను విజయవేపు చూస్తూ.

విజయ కొక్కసారిగా కోపంపొంగుకు వచ్చింది.

"మధ్యలో మన విషయాలెందుకు ప్రస్తావిస్తారు! బహుశా మీ స్నేహితుడైనందుకు, జీవన్ బాబుగారిక్కూడా, వాస్తో కూస్తో, మీ సిద్ధాంతాలు అంటుకుని వుండి వుంటాయి. ఏమైతే నాకెందుకు? ఆయన నాకెప్పుడొస్తారో చెబితే, తగిన ఏర్పాట్లు చేస్తాను" విసురుగా లోపలికి వెళ్ళిపోయింది విజయ.

విజయ మాటలతో నాలో విపరీతంగా ఆలోచనలు ముసురుకున్నాయి. జీవన్ ఎందుకిలా చేస్తున్నాడు? నాలాటి ఆలోచనలతోనే జీవన్ వున్నాడా? అవి ఆచరణలో పెట్టడాని కుద్యుక్తుడైనాడా? మరి నే నెందుకు ఆచరణలో పెట్టలేకపోతున్నాను!

మనస్సంతా చిలికినట్లవుతోంది.... గతమంతా గిరగిర తిరుగుతోంది.

* *

చిన్నప్పట్నుంచీ "క్రమశిక్షణ" అంటే నాకు పరమ అసహ్యం. ఆ పేరుతో పెద్దవాళ్ళు పిల్లల్ని ఎలా యంత్రాలుగా మలిచేదీ నాకు తెలుసు. మా నాన్నగారి క్రమశిక్షణ అంతా ఇంతా కాదు! అమ్మ సరేసరి! జమీందారీలు పోయినా, ఆ లక్షణాలు అరువు తెచ్చుకున్న కుటుంబం నుంచి వచ్చిందామె. "క్రమశిక్షణ" అన్నమాట ఆమె శ్వాసలో ఒక భాగమైపోయింది! బహుశా నాన్నగారి క్కూడా "క్రమశిక్షణ" ఆమె నుంచి సంక్రమించిన జబ్బై వుండాలి!

వాళ్ళిద్దరికీ నే నొక్కడినే "ఎర" గా దొరికాను! అంతే! ఆస్తమానూ కాల్చుకు తినేవాళ్ళు! ఎండలు మండిపోతూ, జోరు చెమటలు కారిపోతున్న రోజుల్లోనయినా సరే, మోకాళ్ళవరకూ మేజోళ్ళు వుండి తీరాలి! వంటయింట్లో నయినాసరే జోళ్ళు విప్పకూడదు! ఇస్త్రీ మడతలు నలక్కూ-



యువ

తదు! ఇరుగుపొరుగు పిల్లలతో ఆడుకో కూడదు - బట్టలు, వొళ్ళూ మట్టి అవు తుందట పొరబాటుగానయినా....సోఫాలో తప్ప....గచ్చునేలమీద కూర్చోకూడదు! ఎండలోకి పోకూడదు ...వానలో తడవ కూడదు ...ఎక్కువగా నవ్వకూడదు ... ఇలా ఎన్నో ఇంకెన్నో!....

అందుకే నాకది ఏనాడూ "మాఇల్లు" అనిపించలేదు. ఖర్మవశాత్తూ త్రోయబడిన జైలు అనిపించేది! తర్వాత కాన్వెంటు చదువు....మా ఇంటికీ, ఆ స్కూలుకూ తేడా తెలీలేదు నాకు!

కాలేజీలో చేరాక కొంచెం ఊపిరి నలిపినట్లయ్యింది. అప్పుడే కొంచెం "ఫ్రీగా" మాట్లాడటం నేర్చుకున్నాను.. అదయినా "జీవన్" ధర్మమా అని!

టౌన్ బయట వున్న చెరువుదగ్గరకు షికారుకు వెళ్ళేవాళ్లం నేనూ జీవన్ చెరువు గట్టున వున్న పెద్ద మఱ్ఱిచెట్టు చివరలకు ఎక్కి, ధభీమని నీళ్ళలో దూకి, ఈత కొట్టేవాడు జీవన్!

"నువ్వూ రా కృష్ణా! నీకు నేను నేర్పుతాను!" అనేవాడు!

కానీ నాకు నీళ్లంటే చచ్చే భయం! చిన్నప్పుడు తోటిపిల్లలతో "ఈత" నేర్చుకోవాలని ఉబలాట పడినందుకు.... నిక్కరు, చొక్కా తడిసిందని....నీళ్ళ దగ్గర వున్నానని....కబురుతెలిసి, నాన్న గారు "క్రమశిక్షణ" పేరుతో అలాటి వెధవ వేషాలు వెయ్యవద్దని నన్ను చావ కొట్టిన సంఘటన నాకినాడూ గుర్తుంది!

"వుహూ! నాకు రాదు!" అనే వాణ్ణి.

"నేర్పుతాగా!"

"వూహూ! నాకు భయం!"

జీవన్ నన్నుచూచి జాలిపడేవాడు....

"కృష్ణా! చాలా జాగ్రత్తగా పెంచు తున్నామనే భ్రమతో ...మీవాళ్ళు నిన్నెం దుకూ కొరగానివాడిగా.... పిరికిపందగా జీవితంలో ఏవి ముఖ్యమైనవో అవి నేర్పకుండా....గాజుబొమ్మలా తయారు చేశారురా!" అనేవాడు! ఆ క్షణంలో నే నెంత పనికిమాలినవాణ్ణో నాకు స్పష్టంగా తెలిసిపోయింది!

కాలేజిలో చేరిన కొత్తలో, సీనియర్ విద్యార్థులు కొందరు నన్ను అల్లరి పెట్ట డానికి వచ్చి....చక్కలిగిలి పెట్టసాగారు.. నవ్వి, ఏడ్చి, సొమ్మసిల్లి పడిపోయే సమ యంలో, జీవన్ సుడిగాలిలా వచ్చాడు. .. ఆ విద్యార్థులు ముగ్గుర్నీ బూతులుతిడుతూ తన్నాడు ... అదో పెద్ద గొడవై పోయింది....ఎలాగో ప్రిన్స్‌పాల్ సర్దు బాటు చేశారు తర్వాత.

"కనీసం ప్రతిఘటించటమైనా చేత రాదా నీకు కృష్ణా!" అంటూ విరుచుక పడ్డాడు జీవన్. .

నాకు నామీద అసహ్యం వేసింది! నిజమే! ఎర్రగా, భారీగా వున్న నాలో.... కనీసం—ఎదుటివాడు నన్ను తన్న బోతుంటే. శక్తిమేరకు నన్ను రక్షించు

కోవాలన్న కనీసం సజ్ఞానమన్నా ఎందుకు లేకపోయింది?

దీనికి కారణమేమిటి?

అందుకు జవాబు, యధాలాపంగా ఓ రోజు జీవన్ చెప్పాడు.

"నువ్వే కాదురా కృష్ణా! నీలాటి వాలామంది వున్నారీనాడు! మీరు పెరిగిన "క్రమశిక్షణ" ఎలాటిదంటే, ఎవరేనా మీకు అన్నీ అమర్చిపెడితే—అనుభ వించగలరేగానీ ...జీవితావసరాలు, జీవి తాని క్కావలసినవి అమర్చుకోవటం, సాధించుకోవటం ఎలా? అన్నది మీకు చేతరాదు.... అసలుతోచదు.... ప్రకృతి శక్తులను ఎదుర్కొనే శక్తి మీకులేదు.. అంచేత మీకు ఆత్మరక్షణ కూడా రాదు

జీవన్ సాహచర్యంలో నేను మానసికంగా చాలా ఎదిగాను— "జీవన్! మరి నీకు ప్రకృతితో సాన్నిహిత్యం ఎలా ఏర్పడిందిరా? మా కాన్వెంటులో మాదిరిగా, మీ వూళ్ళో, మీ నౌకర్లూ, ఆయాలూ మిమ్మల్ని పిక్నిక్కు తీసికెళ్ళే వారా? స్విమ్మింగ్పూల్లో "డైవ్స్" వేసి దింపేవారా, "డాగ్" "బుల్" "బర్డ్స్" చూపేవారా?" అన్నా నోరోజు కుతూహలంగా!

నా ప్రశ్న విని జీవన్ విరగబడి నవ్వాడు....నవ్వినవ్వి, అలసిపోయి, ఎలాగో నవ్వు ఆపుకున్నాడు.

"కృష్ణా మాకు నౌకర్లూ లేరు. ఆయాలూ లేరు! స్వచ్ఛమైన తెలుగులో.. ఎద్దులు...ఆవులు ...కుక్కలు, పిల్లులు.. వీటన్నిటిమధ్య పెరిగాం.... హాయిగా మాతృభాషలో "కుంకా, వెధవ...." ఇంకా పెద్ద పెద్ద తిట్లూ తిట్టుకుంటాం.. ఓసారి మా వూరురా! నీకు తెలుస్తుంది!" అన్నాడు.

ఆసారి శలవులకు....ఇంటికి వెళ్ళకుండా, జీవన్తో బాటు వాళ్ళ వూరికి వెళ్లాను. జీవన్ తలిదండ్రులేమంత కలిగిన కుటుంబంవారు కారు. కానీ మర్యాదలేని మనుషులు మాత్రం కారు.

జీవన్కు ముగ్గురు తమ్ముళ్ళూ! ఇద్దరు చెల్లాయిలూ వున్నారు. ఇంటిచుట్టూరా గేదెలూ, ఎద్దులూ, ఆవులూ వున్నాయి! అందరికందరూ ఇంటిపని, పొలం పని చేస్తారు. నేలమీద కూర్చునే భోజనం చేస్తారు. జీవన్ తమ్ముళ్ళు....ఆఖరువాడు పదేళ్ళవాడు.... పెద్ద బావిలోకి ధభీమని దూకి.... పెల్లికిలా పడుకుని ..నీటిలో మునిగి....రకరకాల మొగ్గలు వేస్తూ ఈదులాడాడు!

ఉదయం, సాయంత్రం స్నానాలు చేస్తారు....ఈలోగా బట్టలు మురికైనా, జీవన్ తల్లి తిట్టదు....కొట్టదు. అస్తమానూ జోళ్ళు వాడరు!

ఆసాయంత్రం వాళ్ళలోగిలిలో కనిపించిన పెద్దపామును జీవన్ చెల్లాయి కర్రతో కొట్టి, కర్రమీద వేసుక వచ్చింది! చచ్చిన పామును చూస్తుంటేను నాకు కాళ్ళలో వణుకు పుట్టింది! నాపదహారో

ప్రమీలలా నీ కోసం నేనెంతటి
త్యాగమైనా చే చే చే..........





Jayaraj

ఏట కాటోలు....పెరట్లో, నూతి గట్టున కనిపించిన ఓ మూరెడు పొడువుపాము కనిపిస్తే....నాన్నగారూ, అమ్మా, నేనూ కేకలువేసి....నౌకర్లను పిలిచాం ...వాళ్ళు ఇద్దరుకలసి పామును చంపు తూంటే, మేం ముగ్గురం ...వంట ఇంటి గడపలో జాగ్రత్తగా నిల్చున్నాం....ఏ మాత్రం పాము ఇటు తిరిగినా....లోపలికి పరుగెత్తి, తలుపులు వేసుకోవటానికి వీలుగా! (అదినీటిపామని చెప్పారు ఎవరో తర్వాత!)

జీవన్ రెండో తమ్ముడు పధ్నాలుగేళ్ళవాడు ఆరు మండ్రగబ్బల్ని, రెండు తేళ్లనీ కొండీలకు దారం కట్టి చేతిలో పట్టుక వచ్చాడు!

"రాక్షసవెధవా! వాటి నెందుకు పట్టావ్?" అంటూ కోప్పడింది జీవన్ తల్లి... వాడునవ్వేశాడు.

"అవును! ఎలా పట్టావురా?" అన్నాన్నేను కుతూహలంగా!

"ఏముందీ: ఆరుబయలు .... బోరియలో నీళ్ళు పోస్తాను ... తేళ్ళు .... మండ్రగబ్బలూ బయటకువస్తాయి.... నల్లేరుకాడవాటి కొండీల దగ్గర పెడతాను. దాన్ని అవికుడతాయి. నల్లేరు కాడనల్లగా పోతుంది విషంతో! ఇక ఆ తేళ్లకు తిరిగి కొండీలలో విషం కూడ టానికి కొన్ని గంటలు పడుతుంది! ఈలోగా అవిమనల్నెన్నిమార్లు కుట్టినా విషం ఎక్కదు.... పట్టుకుని దారం కడతాను!' అన్నాడు వాడు అదేదో అతి సాధారణమైన విషయమన్నట్లు!

ఇదేదో కొత్త లోకం లావుందినాకు। ఆ నల్లేరేమిటో....నాకు తెలీదు....అసలు తేలు బొమ్మంటేనే నా ఒళ్ళు జలదరి స్తుంది....పిల్లలు వెర్రిగోల చేస్తుంటారు. చింతచెట్లు, తాటిచెట్లు ఎక్కుతారు.... పడతారు, లేస్తారు....దెబ్బలు తగులు తుంటాయి. బొప్పులు కడుతుంటాయి. కాస్తంత నీరు సున్నంరాసు కుంటుం టారు. కాస్సేపు ఏడ్చి వూరు కుంటారు ఇష్టంవచ్చినట్లు....ఈతకాయలు ... తాటి కాయలు....తింటారు ...ఎక్కడా కట్టు బాటు లేదు ...

''ఇలా పిల్లలు అల్లరిచేస్తే . .మట్టిలో పొర్లాడితే....మీరు ఏమీ అన రా పిన్ని గారూ। వాళ్లకు జబ్బులురావా ? ''అన్నాను జీవన్ తల్లితో....

ఆమెనవ్వింది. ''ఈ వయసులో గాక పిల్లలు అల్లరిచేసేదెప్పుడు నాన్నా కృష్ణా ? అన్నీ నేర్చుకొనే వయసిది.... ఎవరికేపనిలో ఉత్సాహం వుంటే.... వాళ్లాపని నేర్చు కుంటారు....మీ అంత య్యాక....ఇప్పుడు నువ్వూ, జీవన్ అల్లరి చేస్తున్నారాచెప్పు ? ఈలోగా వాళ్ళకు వాళ్ళకు లేనిపోని ఆంక్షలుపెట్టి....కమ్మటి ఆ చిన్నతనపు హాయినెందుకు పోగొట్టాలి నేను ? పడితే పడతారు....వాళ్లేలేస్తారు .. తన్ను కుంటారు....తిట్టు కుంటారు ... వాళ్లే తిరిగి ఆడు కుంటారు।''

నా కదోమహా విశ్వ విద్యాలయంలా కనిపించింది। నాలాటి నిర్భాగ్యులను.... అన్నీవున్నా.... ఏమీరాని దౌర్భాగ్యు లనూ....ఈవిద్యాలయంలో వేస్తేచాలు.. వాళ్ళు నిజమైన మనుషులుగా తయా రౌతారు....అనిపించింది....

చదువులు పూర్తయి....జీవన్ ఢిల్లీకి వెళ్ళి పోయాడు....చిన్న ప్రైవేటు కంపెనీలో ''మెకానిజం''కు సంబంధిం చిన ఓ చిన్న ఉద్యోగంలో చేరాడు.... పెళ్లాడాడు....తనమేనత్త కూతురినే ... అతగాడికిడబ్బు సంపాదించాల్సిన అవ సరంవుంది.. .మిగతా కుటుంబం అతని మీద ఆధారపడివుంది. నాకునిజానికి ఉద్యోగం చేయాల్సిన అవసరంలేదు.... కానీ వ్యాపకం అంటూ వుండాలి కాబట్టి రెండోది మానాన్నగారు ఈ మధ్యే చని పోవటంవల్ల....అమ్మ ఆస్తులు మేనేజ్ చేసుకుంటూ అక్కడే వుండి పోవటం వల్లా....ఇకఅమ్మ దగ్గరే వుంటే, ఆమె ''క్రమశిక్షణ'' పాఠాలు జీవితాంతం నేర్చుకోవలసి వుంటుందేమోనన్న భయం వల్లా ...ఇక్కడ ఉద్యోగంలో చేరాను... చెప్పుకో కూడదుగానీ, జీతం చాలా ఎక్కువే।

ఏరి, కోరి, అమ్మకు కూడా నచ్చటం వల్ల . ..విజయ అర్ధాంగిగా వచ్చింది. చదువూ, సంస్కారమూ, అందమూ, తెలివీ సమపాళ్ళలోవున్న విజయ ... నాకు ఎంతగానో నచ్చింది ...

''మనకు పుట్టబోయే పిల్లల్ని మనం ప్రత్యేక పద్ధతులలో పెంచాలి విజయా?''

అంటూ నా ఆదర్శాలు (నేచేయలేనివి.... నాకు చేతరానివి) చెప్పేవాణ్ణి....

విజయ విస్ఫారిత నేత్రాలతో నాకేసి చూస్తూ వింటూండేది .... విజయ నా భావాలతో ఏకీభవిస్తుందనీ, నాకు సహకరిస్తుందనీ గంపెడాశ పెట్టుకున్నాను ...

కానీ .... బాబు వుట్టాక ...వాడు పెరుగుతున్నకొద్దీ, తిరిగి పాప పుట్టాక.. దానికి ఏడాది నిండే సరికి ...నాకర్థమై పోయింది।

' యూకాంట్ రన్ అవే ఫ్రమ్ఇట్।'' అన్నట్లు ...నేనే ''క్రమశిక్షణ'' నుంచి తప్పించుకోవాలనీ, నాపిల్లల్ని తప్పించాలనీ చూశానో ...అదేవేయి నాలుకలతో విజయలో ప్రవేశించి మాచుట్టూరా పరచుకుంది।....నిజానికి విజయలో స్వతహాగా అంతటి పట్టుదలా, పద్ధతులూ లేవు। కానీ....విజయ అన్నయ్య రామారావు, వదిన లతల పుణ్యమని, ఆమెకా జబ్బు వచ్చేసింది। నా బావమరిది రామారావు, నాకు పెళ్లయ్యేసరికి గుమాస్తాగా వుండే వాడు। మాబాబు పుట్టే సమయానికి .. అతగాడు గుమాస్తా గిరికి రాజీనామా ఇచ్చి, ఏదో చిన్న వ్యాపారం మొదలెట్టాడు.... సిరివరించింది .... మాకుపాప పుట్టేసరికి ... రామారావు ''డబ్బుగల వాడిగా'' పేరుతెచ్చుకున్నాడు। రామారావు లతల అంతస్థు మారిపోయింది. పద్ధతులు మారిపోయాయి....

ఓసారి వాళ్ళ ఆహ్వానం మీద నేనూ, విజయా పిల్లలూ వెళ్ళాం. అంతే తిరిగి వచ్చేసరికి విజయ డూప్లికేట్ ''లత' లా మారిపోయింది। వారానికోమారు లత ఉత్తరం వ్రాస్తుంది విజయకు....

''మీ శ్రీవారికి తిక్కకోపం జాస్తిలా వుంది. మొన్ననే గమనించానులే। బాత్ రూంలో ఐదారు రకాల సోప్స్ పెట్టు.... పిల్లలకూ, మీ వారికీ పూట కోరకం ''సోప్'' వాడుకోవటం అలవాటుచెయ్యి. శీతాకాలంలో పాండ్స్ పౌడర్ వాడు, వేసవి కాలంలో ''ప్రిక్లీహీట్'' వాడు, వర్షాకాలంలో ''క్యూటి క్యూరా'' వాడు. పిల్లలకి మేజోళ్ళు... బూట్లు అలవాటు చెయ్యి. లాగులు, గౌనులు వైట్‌గా కుట్టించు. లొడాయి బుడాయిలా కుట్టించకు డ్రెస్సులు. ఎబ్రాసుల్లా వుంటారు. ''మద్దె'' వెధవలతో ఆడుకోనివ్వకు. మొన్న మీ రిక్కడకు వచ్చినపుడు మీ బాబు పాపని ''....ముండ ...'' అని తిట్టడం విన్నాను ... రాస్కెల్, స్కౌండ్రల్....ఫూల్ .... లాటి తిట్లే నువ్వు వుపయోగించు....వాళ్ళకవే వస్తాయి. వెధవతిట్లురావు.

భోజనం తయారుచేసేటప్పుడు నువ్వు ''ఏప్రన్'' కట్టుకో. అన్నం పెట్టేటప్పుడు పిల్లలకు ''ఏప్రన్''లుకట్టు. వాళ్ళని కాస్త నాగరికులుగా తయారుచెయ్యి....''

ఇలా సాగుతుందామె ఉత్తరం. ఆమె ఉత్తరాలంటే నా కసహ్యం. లక్షరీ వి ఎక్జిబిట్ చేసుకోవాలనే తాపత్రయం

బావుందిగానీ.... ఈ పద్ధతిలో నాకు నచ్చదు అందునా పిల్లల విషయంలో.

"ఒక్కమాటలో చెప్పాలంటే మతి లేని వెధవలుగా, మరమనుషులుగా తయారు చెయ్యమంటోంది మీ వదిన.... మన పిల్లల్ని!" అన్నాను హేళనగా ఓ ఉత్తరం (పైలాటిదే!) గిరవాటు వేస్తూ.

విజయకు లత పద్ధతులు వేదవాక్కులుగా వున్నా యీ మధ్య! కారణం లత డబ్బు కలది.... అతి నాగరికత తెలిసింది అన్న భావమే! నా మాటకు బాగా కోపం వచ్చింది.

"మీ జీవన్ ఒక్కడే మనుషుల్ని సృష్టించగల మహామేధావి." అంది విసురుగా.

నాకు చివుక్కుమంది. కానీ ఏమీ అన లేక పోయాను. విజయకు నచ్చచెప్పటం నా తరంకాదని తెలిసిపోయింది!

జీవన్, తనుచేస్తున్న జాబ్‌తో.... తన చొరవతో, సమర్థతతో బంతిని గాలిలోకి తన్నినట్లు పైకి వచ్చేశాడు. ఆరేళ్ళు తిరిగే సరికి లక్షాధికారి అయ్యాడు! ప్రైవేటుగా "మెకానిక్ షాప్స్" ఓపెన్ చేసాడు! ఇప్పుడు ఢిల్లీలో జీవన్ ఒక గుర్తింప దగిన వ్యక్తిగా మారిపోయాడు...

ఓ రోజు నేను క్యాంప్‌నుండి యింటి కొచ్చేసరికి విచిత్రమైన దృశ్యం కంట బడింది. మూడేళ్ళపాపను .... డైనింగు టేబిల్‌మీద కూర్చోబెట్టి, చిన్న గిన్నె లోని, పేస్ట్‌లాటి పదార్థమేదో స్పూన్‌తో పాపనోట్లో పెడుతోంది విజయ. ఆ గిన్నె లాక్కోవాలని పాప మారాం చేస్తోంది.

"పాపకు వాళ్ళు బాగా లేదా విజయా అదేమందు?" అన్నాను కంగారుగా డైనింగ్ టేబిల్‌కేసి వెడుతూ.

విజయ నవ్వింది "భలేవారే! "బేబీ ఫుడ్" ఇది! అసహ్యంగా అన్నం పెడితే వొంటినిండా పడేసుకొంటోంది పాప! ఇద యితే చక్కగా స్పూన్‌తో పెట్టవచ్చు.... నిన్ననే ఓ టిన్ తెచ్చాను.... మనకు టైం కలిసొస్తుంది. వాళ్ళు నీట్‌గా వుంటారు."

నేను నిర్ఘాంత పోయాను. చివరకు నోరు, పళ్ళు, చేతులు చక్కగా వున్న పాపకు స్పూన్ ఫీడింగా! ఇక ఈ తర వాత తరం వాళ్ళు...వాళ్ళ బిడ్డలకి ... ఆహారం ఏ ఇంజక్షన్ ద్వారానో ఇచ్చి కనీసం ఆహారం నోటితో, తినటం కూడా చేతకాని చవటలుగా మారుస్తారా?

"ఏమిటలా ఆలోచిస్తున్నారు! ఈ టిన్స్‌లోని బేబీఫుడ్ 'పాక్' చేయబడింది. ప్యూర్‌గా వుంటుంది కావలిస్తే ఇన్‌స్ట్రక్షన్స్ కంపెనీ వివరాలూ చూడండి!" అంటోంది విజయ.

నేను కుర్చీలో కూలబడ్డాను.

"లేదు విజయా! అవి చాలా బాగా "పాక్" చేయబడ్డ టిన్సే! రేపట్నుంచీ నువ్వూ, నేనూ కూడా పుచ్చుకుందాం. టైం కలిసొస్తుంది. మనకూ నమిలిమింగే బాధ తప్పుతుంది. ఇంకొన్నాళ్లు పోయాక, మనల్నీ మన పిల్లల్నీ "స్ట్రెచర్"ల మీద

నౌకర్లు తిప్పుతారు. అప్పుడు నడిచే బాధ కూడా వుండదు ...''

విజయకు కోపం వచ్చింది. ''మీరనే దేమిటి?'' అంది కోపంగా.

''అర్థం చేసుకో విజయా! ఆది మానవుడు అతి అనాగరికుడే కావచ్చు.... కానీ అతగాడి ఆత్మ విశ్వాసం ఎంతటిదో తెలుసా? తన స్వశక్తితో.... వన్యమృగాల బారినుంచి తనను తాను రక్షించుకుంటూ, ఆహారం సంపాదించుకునేవాడు.

ఈనాడు మన పిల్లలకు మనం నేర్పుతున్నదేమిటి? వండిన మెతుకుల్ని....తిన లేని అర్భకత్వం ..''

నా మాటలు పూర్తికాకముందే విజయ ఛర్రుమంది.... ''మీ సిద్ధాంతాలూ ఓ రు మీ జీవన్‌కు చెప్పుకోండి!'

ఇప్పుడు నాకు నేను చిన్నతనంలో పెరిగిన వాతావరణానికీ ఈ నాడు మా ఇంటికీ, మా పిల్లల పెంపకానికీ తేడా కనిపించుటలేదు. అప్పట్లో నేను పాములకూ, తేళ్ళకూ, నీళ్ళకూ భయపడితే, ఇప్పుడు నా పిల్లలు, కుక్కలకూ, పిల్లులకూ, కోళ్ళకూ, చీమలకూ కూడా భయపడ్తున్నారు! రంగువేసిన మట్టి బొమ్మల్లా పెరుగుతున్న నా పిల్లల్ని తలుచుకున్న కొద్దీ నాకు బాధా జాలి కలుగుతుంటాయి.

ఆ మధ్య ఓ వివాహానికి గ్రామం వెడుతూ పిల్లలనూ, విజయనూ పిల్చి కెళ్ళాను. విజయ ఎంత కట్టుదిట్టం చేసినా పంజరం నుంచి బయటపడ్డ పక్షుల్లా పిల్లలు, మిగతా పిల్లలతో ఆటలకూ, పాటలకూ ఎగబడ్డారు.

''అంతే, తిరిగివచ్చాక విజయ వాళ్ళకు పూటపూటా ''డెట్టాల్' వాటర్‌తో, శాండల్‌వుడ్ ఆయిల్ వేసిన వాటర్‌తో స్నానాలు చేయించింది! నేలమీద భోజనాలు చేయటానికి కూర్చోవటంవల్లా, భోజనం చేసినందువల్లా, నేలమీద దుమ్ము వాళ్ళ పిర్రలో ఇంకిపోయి, కడుపులోకి పోయివుంటుందనీ.... లోపల.... సెప్టిక్ అయివుంటుందనీ....బాధపడింది....వాళ్ళి ద్దరినీ ''స్టెరిలైజ్'' చేసినంత పని చేసింది!

ఇక లాభం లేదు....నా పిల్లలు.... నేను అనుకున్న విధంగా ఏనాడూ తయారు కారు....

జీవన్‌కు బాగా డబ్బు వచ్చిందని తెలిశాక. ..విజయ జీవన్‌ను ''జీవన్‌బాబు'' అంటోంది. వెనకటిలా,''మీ జీవన్....మీ జీవన్'' అంటూ ఎత్తిపొడవటం లేదు.

''జీవన్‌బాబు....పెద్ద కాన్వెంటులో చేర్పిస్తారేమో ఆయనగారి పిల్లలిద్దర్నీ! మాంచి ఆంగ్లో ఇండియన్స్‌ను పెట్టి ట్యూషన్ చెప్పిస్తారేమో....లేక ఫారిన్ పంపేస్తారేమో.... ఎంతైనా ఫారిన్‌లో పిల్లల పెంపకమే వేరు! మనదేశం.... మన వెధవ పద్ధతులు. . అక్కడుండవు.. ఇంకా మనబోటివాళ్ళం....మా లతపదిన, అన్నయ్యలాటివాళ్ళూ కొందరున్నారు

కాబట్టి....ఇతర దేశస్తు లెవరేనావచ్చినా.. ముచ్చటగా వుండే మన పిల్లల్ని చూచి, వెక్కిరించటానికి వెనుకాడుతున్నారు గాసీ....లేకుంటే....వెర్రి వెంగళాయిల్లా ....ఎడ్డిమడ్డిగా వుండే పిల్లల్ని చూచి విరగబడి నవ్వరూ!'' అంటూంటుంది విజయ తరచుగా....

*　　　*　　　*

''ఇంకా మీ రిక్కడే కూర్చుని వున్నారేం? భోజనానికి రాండి!'' అంటూ వచ్చింది విజయ....సుమారు ఓ గంట సేపుగా....గతమూ, వర్తమానమూ కల గాపులగంగా ఆలోచిస్తున్న నా ఆలోచన లకు ఫుల్‌స్టాప్ పడిపోయింది.

''అన్నట్లు జీవన్‌బాబుగా రెప్పు డొస్తారూ?'' అంది తిరిగి విజయ....

''రేపో....ఎల్లుండో!'' . భోజనానికి లేచాను. రెండు రోజుల తర్వాత జీవన్ వచ్చాడు....మనిషి కొంచెం లావెక్కాడు. సరదాగా ఎన్నో సంగతులు మాట్లాడు కున్నాం....

''అంకుల్.... అంకుల్'' అంటూ మా పిల్లలిద్దరూ జీవన్‌తో చిలకపలుకులు పలికారు....వాళ్ళమ్మ చెప్పిన మేరకు!

''అంకుల్ ఏమిట్రా మీ బొంద.... మామయ్యనురా!....'' అన్నాడు జీవన్ నవ్వుతూ....నావేపు తిరిగి ''వీళ్ళనీ నీ డూప్లికేట్స్‌గా తయారుచేస్తున్నావు కదూ?'' అన్నాడు.... తప్పులు చేసినట్లు తల వంచుకున్నాను....విజయ కోపా న్నణుచుకుంటూ పని వున్నట్టు లోపలికి వెళ్ళిపోయింది.

''ఇంతకూ నీ పిల్లల సంగతేమిటి? గ్రామంలో వదిలివచ్చావా?'' అన్నాను టాపిక్ మారుస్తూ. విజయకూడా వచ్చి కూర్చుంది....కుతూహలంగా వింటూ.

''అవున్రా కృష్ణా! ప్రస్తుతం నే నున్న వాతావరణంలో నా చుట్టూరా వున్న నా స్థాయి మనుషుల మధ్యలో నా నా పిల్లలు పెరగటం నాకు సుతరామూ నచ్చలేదు. కచ్చికతో పళ్ళు తోముకొచ్చా దని—వాడి స్నేహితుడింట్లో, చిన్న వెధ వని పళ్ళు రాలేలా కొట్టిందో తల్లి! టూత్‌పేస్ట్..బ్రష్‌మీద వేస్తే తప్ప ... అది లేకుంటే పాచిపళ్ళతో ''బ్రేక్‌ఫాస్ట్'' తీసుకోవటం తప్ప...కచ్చికతో పళ్ళు తోముకోవడ మన్నది నీచాతినీచమైన విషయం! అనలా కచ్చికంటే ఏమిటో తెలియదు వాళ్ళకి!

స్విమ్మింగ్‌పూల్‌లో పైరు సాయంతో తప్ప....చిన్నమడుగులో కాలుజారిపడితే బయటకు రాలేని అర్భకులానాగరికులు..

గేదెకూ, దున్నపోతుకూ, గొర్రెకూ. మేకకూ తేడా తెలీని పెంపకాలు! 'బగ్స్' అంటూ ఎగిరిపడటమే తప్ప నల్లిని కాలి తోనో, వేలితోనో చంపగల ధైర్యమైనా లేని వెధవలు!

షో కేస్‌లో అందంగా అమర్చటానికి పనికివచ్చే గాజుబొమ్మలే తప్ప....ఆ షో కేస్‌ను పగలగొట్టటంగాని, తయారు

చెయ్యటంగానీ చేతరాని చవటలు....

ఛీ ...ఛీ.... నా పిల్లలను అక్కడే వుంచితే....అలా పెంచక తప్పదు.... అందులోనూ డబ్బు సంపాదించటం అవసరంలేని పరిస్థితిలో...ప్రకృతికి దూరంగా ....ప్రకృతిలోని ఏ అణువూ పరిచయం లేకుండా ...చూపులకు మాత్రం నాజూకుగావుండే గాజుబొమ్మలుగా తయారయిపోతారు.... వాళ్ళకు "కండ" వుంటుందేమోగానీ "గుండె" వుండదు.. "మెదడు' వుంటుందేమోగానీ "మేధ" వుండదు...."ఆలోచనలు" వుంటయేమోగానీ ఆచరణలో పెట్టగల "ఆత్మవిశ్వాసం' వుండదు. "మురికి" లేకపోవచ్చుగానీ "పిరికిదనం" మస్తుగా వుంటుంది.

మా వూరూ మారిపోయింది....అంటే ప్రకృతిగో, పరిసరాలూ మారలేదు.... మనుషులు మారిపోయారు .... మరలకు దగ్గరగా వచ్చారు....మా నాన్నగారు.... బాగా పెద్దవారై పోయారు.... ఆయనకు తెలుసు....పిల్లలెలాటి వాతావరణంలో పెరగాలి? ఎలా మనుషులుగా రూపొందాలి? అన్నది....అందుకే....ఆయన తన యావదాస్థీ.... "ప్రకృతి బాలల ఆశ్రమంగా" రూపొందించారు....అది మాకు నమ్మకమైన మనుషులుచేత....నడపబడుతోంది....జీవితానికి నిజంగా అవసరమైన చదువేదో అది ముఖ్యంగా నేర్పుతుంటారు పిల్లలక్కడ.... మామూలు చదువూ చెబుతారు...ఇక డిగ్రీ చదువుల కోసం "షరా మామూలు" పద్ధతులు వుండనేవుండె దేశమంతటా! డిగ్రీలు ఎక్కడేనా తెచ్చుకోవచ్చు!

అందుకే నా పిల్లల్ని అక్కడ వదిలి వచ్చాను .ఆ స్వేచ్ఛలో క్రమశిక్షణా వుంది....కానీ అది వారిని మనుషులుగా మలిచేందుకు మాత్రమే ఉపకరిస్తుంది గానీ....చేయి తగిలితే, పొరబాటున జారి పడితే ముక్కలయ్యే గాజుబొమ్మలుగా మాత్రం మార్చదు" విజయ వినుగ్గా లోపలికి వెళ్ళిపోయింది ... బహుశా జీవన్‌కు పిచ్చిపట్టిందని రూఢి చేసుకుని వుంటుంది.... బహుశా జీవన్‌లాటి . రామారావులాటివాళ్ళు వరసగా తమ పిల్లలను అలా పంపిస్తే...విజయ కూడా అదే ఫాషననే ఉద్దేశ్యంతో మాత్రమే ఆచరిస్తుందేమో .కానీ ఆ మంచి పద్ధతి ఫాషన్ క్రిందికి మారి, మా విజయ మనసు మారేసరికి....మా పిల్లలు ... మేము అమర్చిపెట్టిన "షో కేస్ ' లో అందమైన "గాజుబొమ్మలు"గా మారే పోతారు....ఇది నిజం.



అక్టోబరు నెల

# భావపరియపోటీ

బహుమానం రూ. 10—00



**ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.**

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి. వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులోపంపినవి అంగీకరింపబడవు.

మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమాన మివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు సెప్టెంబరు 5 వ **తేదిలోగా చేరాలి.** యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొన వచ్చును. ప్రవేశరుసుములేదు.



కొడవటిగంటి కుటుంబరావు

వెళ్లొస్తానమ్మా!'' అన్నాడు శ్రీరాములు ట్రంకుపెట్టె పట్టుకుని. సీతారామమ్మగారికి కాస్త కంట తడి పెట్టుకోవటం శుభమని తోచింది.

''ఇన్నాళ్ళు పెంచి, ఇన్ని ముచ్చట్లు చేసుకుని, చివరకు—'' పైన ఆవిడకు మాటరాలేదు.

''వెళ్లొస్తా నాన్నా!'' అన్నాడు శ్రీరాములు తండ్రి వంక తిరిగి.

''పదినిమిషాలకిందే బయలుదేరమన్నాను, వెళ్ళదలుచుకున్న తరవాత రైలువాళ్ళ కట్టుదిట్టాలను గౌరవించకపోతే ఏం లాభం?'

శ్రీరాములు మళ్ళీ తల్లిదగ్గిర శలవు పుచ్చుకున్నాడు. ఆవిడ కళ్ళొత్తుకుంటూ ''ఇట్లా రాసిపెట్టిఉంటే ఆ మూడు పోచలూ ఎటా పడతే? ఎన్ని లగాలు పెట్టుకున్నా ఏదో అవాంతరం! పద్దెనిమిదేళ్ళవాడేమిటి, ఇంకా వడుగైనా కాకపోవట మేమిటని అంతా ఆశ్చర్యపడేవాళ్ళే! ఇంతకూ కనటం పెంచటం నావంతు—''

''సరేలే ఆ ముక్క ఎన్నిసార్లంటావు? ఈ ఆడవాళ్లు, రామరామ—'' అని శ్రీరాములు అన్నగా రడ్డంవచ్చాడు తల్లికి. తమ్ముడు దత్తుపోవటం తనకేమాత్రమూ యిష్టం లేదని సూచించటానికి కుర్రవాడు ఆ రోజల్లా మొహం మటమట లాడిస్తూనే ఉన్నాడు.

''ఇహపదవోయ్, ఆలస్యం చెయ్యక?' అన్నాడు తండ్రి. శ్రీరాములు బయలుదేరాడు. తండ్రి కొడుకు ననుసరించాడు. వాకిట్లో శ్రీరాములు వదినెగారు ఎదురొచ్చింపిది. ఆ పిల్ల కిటువంటి విష

యాల్లో పట్టుదల జాస్తి.

శ్రీరాములు రైలెక్కి కూర్చున్నాడు. తండ్రి బయట నుంచుని కిటికీలోనించి అతనితో మాట్లాడుతున్నాడు. రైలు కదలటానికింకా అయిదారు నిమిషాల వ్యవధి ఉంది.

"అబ్బాయి, ఒక్క విషయం తెలుసుకో; మీ అమ్మ నిన్ను వెంకటప్పయ్యగారి వంశం నిలబెట్టటానికి పంపుతున్నది, కాని నేను నీవంశం నిలబెట్టటానికి పంపుతున్నాను, నాకు దత్తతలో ఎన్నడూ నమ్మకంలేదు. నువ్వు కొద్దిపాటి మంత్రాలతో వెంకటప్పయ్యగారి కొడుకువైపోవు. చిన్న పిల్లలు చేసేబొమ్మల పెళ్ళికీ, ఈదత్తతకూ ఏమీ తేడాలేదు. కాని యిందువల్ల నీకు దారిద్ర్యనరకం తప్పుతుంది, నీకు భగవంతుడు తెలివితేటలు ప్రసాదించాడు, కాని డబ్బు లేకపోతే నువ్వెందుకూ పనికిరావు. ఈ విధంగా డబ్బు సంపాదించటం లంజరకంతో సమానమని నేను నిరూపించగలను. ఈ వేసవి కాలం రెండుమూడు నెల్లూ వారు నిన్ను పరీక్షించ దలుచుకున్నారు—నువ్వు వారిలో అతుకుతావో అతకవో చూతామని. నువ్వంతరాత్మను మూవత్తూ చంపుకుని లంజటక్కు లన్నీ వినియోగించి వారిమెప్పు సంపాదించు. వెళ్ళిన క్షణం నించీ అందర్నీ వరసలు పెట్టి పిలు. ఒకరోజు కొంచెం వస్తాయి స్తీవా తరువాత నీతరంకాదు.

"ఇటువంటిపని నీచేత ఎందుకు చేయిస్తున్నానా అని నీకు సందేహం కలుగుతుందేమో! విను. ప్రస్తుత సాంఘిక, రాజకీయ ఆర్థికపరిస్థితుల్లో నీతిగా డబ్బు సంపాదించట మసంభవం—ముఖ్యంగా నీవంటి పుట్టుదరిద్రుడికి, ఈ పరిస్థితులు ఒక రోజులో మారేవికావు, ఒకడివల్లనయ్యే పనికాదు. కాదు కూడదు, నాకు నీతే ప్రధానమంటావా! మాడి చావడానికి సిద్ధపడు.

"నాకు చెడ్డపేరు రానేవచ్చింది. అస్తంతా చెడగొట్టానని, ఎందుచేత? నేను నీతిగా సంఘసేవచేసే జీవించుదామని కంకణం కట్టుకోవటంచేత? నేనింతకూ సంఘసేవ చేశాను. నాకు సంఘం పట్టెడన్నం పెట్టలేదు. నామనస్సు విరిగిపోయింది. నాకుసంఘసేవలో నమ్మకంపోలేదు. తద్వారా జీవించటంలో నమ్మకం పోయింది. నేనొక్క మహాపాతకం కూడా చేశాను లోకందృష్టిలో? అదేమిటంటే పశువల్లే జీవించక మనిషల్లే జీవించాను. కటుకునేటందుకు మంచి గుడ్డా, ఇంట్లో మంచిదీపం, తినేటందుకు మంచి ఆహారం మొదలైనవి అత్యవసరమైన వాటిల్లో చేరిపోయినై. ఇవికాక ఇంకా యితర ఖర్చుకూడా చేశాను. అవన్నీ నాతత్వానికి అవసరమని ఇతర్లు ఊహించలేకపోయినారు.

డబ్బుయొక్క విలువ ఖర్చు చెయ్యటంలోవుంది. ఖజానాలోనుంచి బయ

టికిరాని డబ్బు. చేతులు మారనిడబ్బు. మట్టితో సమానం. అది పీకువద్దు. రోగాలు మొదలైన యిక్కట్లకుమాత్రం అట్టే పెట్టుకొని మిగిలినడబ్బు ఖర్చు చేసెయ్యి. నీ అవసరాలు వృద్ధిచేసికో. ఎంత మంచియింట్లో వుండగలవో ఆంత మంచి యిల్లు సంపాదించి—నీడబ్బును పట్టి. మూర్ఖులు విరివిగా డబ్బు ఖర్చుచేసే భాగ్యవంతుణ్ని చూసి కన్నుకుట్టి ఈర్ష్య పడతారు. డబ్బు ఖర్చుపెట్టే ధనికుడు లోకోపకారి. డబ్బు పేరబెట్టే కుచేలుడు సంఘద్రోహి. ఒక్కటిమాత్రం మర్చి పోకు. నీ మనస్సునూ శరీరాన్నీ ఆరోగ్యంగా అట్టేపెట్టని కర్చు ఒక్కదమ్మిడీ చెయ్యకు. పాపాలన్నిటికి మూలవిరాట్టు దారిద్ర్యం. దాన్ని తలతన్నిన మహాపాతకం. డబ్బు ఎట్లావాడుకోవాలో తెలియకపోవటం. నీకీవిషయాలన్ని కాలేజిలో చెప్పారనుకుంటాను.''

''చెప్పలేదు. నేను వాటినిగురించి ఆలోచించనూ లేదు. కాని ఆలోచించి నట్టే అర్థమౌతున్నది నువ్వు చెప్పే దంతా!''

''మంచిది. ఈ సమస్యలను గురించి మళ్ళా ఆలోచిస్తూ కూర్చోకు. వీటికోసం రెండు జీవితాలు వ్యర్థంకావటం నా కిష్టంలేదు. తెలిసిందా? ముందు వెంకటప్పయ్యగారి ఆస్తికి హక్కుదారుడివై, తరువాత ఆలోచించు. నా మతంలో ఏదైనా లోపమేవుంటే తరువాత సర్దుకొటం తప్పుగాదు. నేను లంబటక్కలవి చెప్పినమాట మరిచిపోయ్యేవు సుమా, జాగర్త. దానికింకో పేరులేదు. గత్యంతర మంత కన్నా లేదు!....వస్తా!''

శ్రీరాములు తండ్రి అకస్మాత్తుగా నిష్క్రమించాడు.

శ్రీరాము లంతవరకు ఆ పెట్టెలో యెక్కిన యితర ప్రయాణీకులను గురించి ఆలోచించలేదు. అతని శరీరం ఒక్కసారి జల్లుమన్నది. తండ్రితనతో రహస్యంగానేమాట్లాడాడు. గాని అతని చెవిలో ఆయనమాట లింకా ప్రతిధ్వనిస్తుండటంచేత అతనికి దగ్గరగా అరిచి మాట్లాడి నట్టుంది. ఎవరైనా తమ సంభాషణ విన్నారేమోననీ, విన్న చిహ్నలెవరి మొహాన్నైనా ఉన్నవేమోననీ అతనందరి మొహాలు పరికించి చూశాడు.

అతని పక్కనే కూర్చున్న ముసలి మనిషికి బహుశా చెముడే అయివుంటుంది. ఆవిడవల్ల యిబ్బంది లేదు. ఆవిడ పక్కన ముడుచుకుని పడుకున్న తలగుడ్డ మనిషి జాగ్రతావస్తలో లేదు. ఇంకా కొంచెం దూరంలో కూర్చున్న సాయబుగారూ బాబుగారూ నైజాం దేశస్తులు. చివర కూర్చుని ఏదో డ్రామా నాటక పుస్తకం బిగ్గిరిగా పఠిస్తున్న కోమటి కిందటి శతాబ్దంనించీ ఆపనిలోనే నిమగ్నుడై ఉన్నట్టున్నాడు. పోతే....

ఈ సమయానికి సరిగా శ్రీరాములు దృష్టి అపిల్లమీద పడ్డది. వెంటనే అతను

దృష్టి అక్కణ్ణించి తిప్పేశాడు కాని వెన కటి ఆలోచన శాశ్వతంగా అంతరించి పోయింది.

అతనికి కొత్తగా అంకురిస్తున్న యౌవనం. అతని మనస్సులో స్త్రీకి అప్పుడప్పుడే స్థానం ఏర్పడుతున్నది. ఆడదాని సౌందర్యంచేత ఆకర్షించబడటం స్త్రీనిగురించి మధుర భావాలు కలగటం జరుగుతున్నది. ఆడదానిచే ఆకర్షించ బడటంలో అతని ప్రయత్నం దాదాపు ఏమీలేదు. ఆభావాలు "ఇంతింతై వటు డింతయై" అన్నట్టు ప్రజ్వలించటాని కనుభవం సహాయం లేదు. అందుచేత ఆ భావాలు గడ్డు కాయలుగానే ఉంటుం దేవి

శ్రీరాములుకు స్త్రీ సౌందర్యాన్ని గురించి తెలియదు, అంగసౌష్టవం మొద లైనవి గమనించటంకూడా అతని కళ్లు నేర్చుకోలేదింకా. కాని, మొహంఅందంగా ఉందా లేదా? కళ్ళల్లో స్నేహభావం ఉందా? విరోధంభావం ఉందా? అనే విష యాలు బాగా గమనించగల స్థితిలో ఉన్నాడు. ఈ పిల్లను చూడగానే అతని మనసున ఒకవిధమైన ఆనందం, తృప్తి, స్నేహభావమూ కలిగినై. అతని ఆలో చన అక్కడికివచ్చి ఆగిపోయింది ఆ మీదట ఆపిల్ల తన స్నేహితురాలైతే తమ స్నేహం ఎట్లా ఉంటుంది. ఇద్దరూ ఎట్లా మాట్లాడుకొంటా రనే విషయాలమీద తన కున్న ఒక రిద్దరు స్నేహితుల అనుభవం మీదా భావాన్ని పోనిచ్చాడు.

రైలు బెజవాడ స్టేషనులో ఆగగానే శ్రీరాములు తన ఆలోచనలన్నీ కట్టిపెట్టి ట్రంకు తీసుకుని బండిదిగి చకచకా స్టేషను బయటికి నడిచాడు. బ్రిడ్జిమీదనే ఒక బండివాడు అతన్ని పట్టేశాడు. బండి వాడికి వెంకటప్పయ్యగారిల్లు తెలుసును. శ్రీరాములు బండిదిగి బండివాడిచేతులో బాడుగ డబ్బులు పెడుతూండగా మరో బండి వచ్చి ఆ యింటిముందే ఆగింది. దాన్లోనించి ఆపిల్లా ఇంకో వితంతువూ దిగారు!

కథ నిజమైంది! కలలు సత్యమైనై! ఇది కలల్లోనూ కథల్లోనూ జరిగే సంగతి కాకపోతే మరేమిటి?

ఆ వితంతువు నలభై ఏళ్ళది. కొంచెం మగరాయుడు. శ్రీరాముల్ని మీదేవూరని అడిగింది. అతను బాపట్లన్నాడు.

"ఓహో నువ్వేనా మాఅన్నయ్య—"

అవు నన్నాడు శ్రీరాములు, ఆ విధ అన్నగా రెవరో తెలుసుకోకుండానే. ఆపిల్ల అతని వంకా వితంతువు వంకా చాలాసార్లు చూసింది. ముగ్గురూ కలిసి లోపలికెళ్లారు.

ఆవిణ్ణి అత్తయ్యా అని పిలవాలా?

తప్పుతుందా? గురుజనాజ్ఞ!

శ్రీరాములు తండ్రి చెప్పిన ప్రకారం నడుచుకున్నాడు వెంకటప్పయ్యగార్ని నాన్నా అనీ వెంకాయమ్మగారి నమ్మా అనీ కృష్ణవేణమ్మగారి నత్తయ్యా అనీ



యువ




పిలిచాడు. హైమవతిని ఏమనీ పిలవాలిసిన అవసరం లేకపోయింది. చెల్లెలి వరస, కొన్ని కొన్ని పనులు మొదట కష్టంగా ఉండి అలవాటు మీద సుకరమౌతై. ఈ వరసలు పెట్టి పిలవటాలు మొదట కష్టంగా ఉండి పోనుపోను కష్టతరమౌతై శ్రీరాములు వంటి వాడికి. నోటివెంట అమ్మా అని కాని, నాన్నా అని కాని అనవలసినప్పుడల్లా అంతరాత్మ హోరాహోరి తనతో యుద్ధం చెయ్యటం అట్లాఉండగా వాళ్ళు తన కలుపుకోలుతనం చూసి ఉత్త వెధవని భావించుకుంటా రేమోనని అనుమానం. కాని త్వరలోనే వెంకటప్పయ్యగారూ వెంకాయమ్మగారూ అపరిమితంగా సంతోషిస్తున్నారని తెలిపోయింది. ఆ విధంగానే కృష్ణవేణమ్మ తన్ను వాజమ్మ కింద కట్టినట్టు కూడా కాస్త యించుమించుగా తేలిపోయింది. ఆవిష్కరిస్తే అతనికి చాలామందుకు పోయింది. కొన్నిసార్లు అత్తయ్యా అని ఇప్పుడతనేం చెయ్యాలి? ఒక్కటేదారి కనబడ్డది. సగం ఎగతాళిగా అత్తగారూ అని పిలవటం మొదలుపెట్టాడు. దాంతో అతని మనసు కాస్త శాంతించింది. ఆవిడకీ అత్తగారు సంబోధన అసలిష్టంలేదని తెలిసిన తరవాత శ్రీరాములు పూర్తిగా తృప్తిపడి అత్తగారనే సంబోధన ఖాయపరచాడు.

క్రమేణా అతనికి వెంకటప్పయ్యగారి కుటుంబం తాలూకు బీరకాయపీచు అర్థం కావటం మొదలుపెట్టింది.

వెంకటప్పయ్యగారు చదువుకున్నవాడు కాడు. ఆయనకు తండ్రి పదెకరాల మాగాణి వెయ్యిరూపాయల రొక్కం యిచ్చిపోయినాడు. దాన్ని వెంకటప్పయ్య

గారి పినతండ్రి ముప్పైవేల రూపాయిల ఆస్తిచేసి పోయినాడు.

వెంకటప్పయ్యగారికి ముగ్గు రాడ పిల్లలు సంతానం. పెద్దపిల్ల రత్నం—రత్తమ్మ—సంపన్నుల యిల్లు మెట్టింది. ఆవిడ మొగుడు కంట్రాక్టరు. పెద్ద వుద్యోగస్తుణ్ణనుకునేవాడు. రత్తమ్మకూడా అట్లాగే అనుకునేది. రెండోపిల్ల మాణిక్యాన్ని కూడా భాగ్యవంతులకే యిచ్చారు కాని ఆపిల్ల మొగుడు పెళ్లయిన కొద్ది రోజులకే పోవటం, అత్తవారు మాణిక్యమ్మకు సాలుకు పుట్టి మనోవర్తి యివ్వటం తటస్థించింది. మొదటినించీ మాణిక్యం గడుసుపిల్ల. శాస్త్రోక్తంగా వైధవ్యం అనుభవించటం ఇష్టంలేక ఆపిల్ల ఎవరితోనో లేచిపోయి వెంకటప్పయ్యగారి పాలసముద్రమంటి వంశానికి కళంకం తెచ్చింది. ఆ పిల్లను గురించి ప్రసంగం తేవటం ఎవరికీ, ముఖ్యంగా కృష్ణవేణమ్మత్తగారికి, ఎంతమాత్రమూ ఇష్టం లేదని శ్రీరాములు గ్రహించాడు.

హైమవతి కడసారి పిల్ల. ఆ పిల్లకు పెళ్లయిన కొద్ది రోజులకే ఆమె భర్తకు క్షయరోగం ఉందని తెలిసింది. అతనిప్పుడు సంవత్సరంనించీ చాలా బాధ పడుతున్నాడు. ఇది ఇట్లా ఉండగా పిల్లను కాపరానికి పంపమని వెంకటప్పయ్యగార్ని వియ్యాలవారు తొందర చేస్తున్నారు. శ్రీరాములుతో కలిసి వచ్చేటప్పుడు హైమవతి అత్తింటినించే వస్తున్నది.

కృష్ణవేణమ్మకూడా చిన్నతనంలో భర్తపోతే ఆవిడ మర్యాదగా అత్తవారింట్లోనే ఉండాలని ప్రయత్నం చేసి కొద్దికాలానికే తన మామగారి ప్రవర్తనను గురించి అనుకోటానికి కూడా వీలులేని అనుమానాలు తగిలి అన్నగారి దగ్గిరికి వచ్చేసింది. వెంకటప్పయ్యగారికి పెద్దతుగా ఉండాలని.

సంవత్సరానికి పదిహేను వందలకూ లేక నెలకు నూరు రూపాయలకూ తక్కువ రాబడి గలవాళ్ళతో ఏటువంటి సంబంధం పెట్టుకోదలచలేదు. ఆయన ఎవరెవరితో సంబంధం పెట్టుకోదలచుకున్నాడో వాళ్లంతా విద్యావంతులై ఉండటం చేత వాళ్ళంతా ఆయన ఎదటనే ఆయన్ని చూసి నవ్వటం. వాళ్ళెందుకు నవ్వుతున్నారో తెలీక, తెలీదని తెలియచెయ్యటం ఇష్టం లేక ఈయన వాళ్ళకన్న ఎక్కువగా నవ్వటం మొదలైన అవాచ్యాలు జరుగుతూండేవి. ఇరుగు పొరుగు వాళ్లు చెప్పుకునే కథలన్నీ నమ్మవలసిన కారణం కనిపించదు కాని వెంకటప్పయ్య వాకిళ్లకు తెరలూ గోడలమీద రంగులువేసిన కుండబొచ్చెలూ మొదలైన అలంకారాదులు ఎవరినోచూసి చేసినవని స్పష్టంగా తెలుస్తూనే ఉంది. ముగ్గు రాడపిల్లల పెళ్ళిళ్లూ చాలా జయప్రదంగా చేశాడని అందరూ ఏకగ్రీవంగా ఒప్పుకున్నారంటే ఎంత డబ్బు ఖర్చు చేసి ఉంటాడో, అంతులేని



యువ

డబ్బు వ్యయంచేసి ఆడపిల్ల పెళ్లిచేసి అనరానిమాటలు పడ్డ అనుభవశాలులకే గాని తెలీదు.

శ్రీరాములుకు ఈ జీవితం చాలా బాగుంది. అతన్ని గురించి ఇంట్లో ఉన్న వాళ్ళకు మంచి అభిప్రాయమే ఏర్పడ్డది. అతనికి అందులో ఎవరిని గురించీ ఘనమైన అభిప్రాయం ఏర్పడలేదు. కాని పైకి అందరి కష్టసుఖాలూ గమనించి ప్రవర్తించేవాడు.

అతను హైమవతిని వరసపెట్టి పిలవాలి సొస్తే చాలా ఇబ్బందే కలిగేది. ఆ పిల్ల తన కాబోయే చెల్లెలని తెలిసిన క్షణం నించీ ఆ పిల్ల ఆలోచనకు పచ్చిపుండయి పోయింది. సాధ్యమైనంతవరకు ఆమెను చూడటం కాని ఆమెతో మాట్లాడటం కాని మానేశాడు. కాని ఆమె పెళ్లిని గురించి వినగానే అతని మనస్సులో కొంత ఆందోళన ప్రారంభమైంది. తన దృష్టిపథంలోకి రాకుండా ఉంచిన ఈ పచ్చిపుండును మధ్యమధ్య రహస్యంగా పరిశోధించటం మొదలుపెట్టాడు. ఆ పిల్లనుగురించి ఆలోచించడం అతనికి తప్పనిసరయింది.

శ్రీరాములుకు పుట్టింటిదగ్గర—అంత కన్న నచ్చేసపదం ఏముంది?...జీవితం నిస్సందేహంగా మురికిగుంటే. ఇక్కడికొచ్చిన కొత్తలో ఈ జీవితం ఒక పెద్ద చెరువుగా కనపడ్డది. సంతోషించాడు. కాని లోతుకు దిగి ఆలోచిస్తే దానికీ దీనికీ భేదం అట్టే కనిపించలేదు. ఇక్కడి నమ్మకాలూ, పద్ధతులూ, ధనవ్యయం— మొత్తంమీద జీవిత మక్కడికన్న పెద్దత్తుగా ఉన్నా, నిజం ఆలోచిస్తే రెండు చోట్లా నిలవనీరే. ఈ నిలవనీటికి చలనం కలగటం ఎట్లా? దీన్ని ఏవిధంగా ప్రవాహం చెయ్యటం? తన తండ్రి కేవలం అట్లా చెప్పకపోయినా, ఆయన అన్న మాటల్లో యిటువంటి అభిప్రాయం ఒకటి లేకపోలేదు. ఈ ప్రశ్నం హైమవతిని గురించి ఆలోచించటం మొదలుపెట్టిన వెంటనే బయటపడ్డది. ఈ నిలవ నీటిలో ఈరెండు తెప్పలూ ఒకదాన్నొక్కటి సమీపించట మసంభవం. ప్రవాహమైతే?

అయితే ఏమిటో అతనికీ తోచలేదు. సంఘం తనకూ హైమవతికీ మధ్య కనపడని గోడ కట్టింది. ఆమె నతను పర స్త్రీగా భావించుకుని లోకం [illegible] అసమ్మతిని ఓర్చయినా [illegible]టం మొదలుపెట్టలేడు. కాని [illegible] తుంది. సొంతచెల్లెలిని [illegible] ఆమె మంచిచెడ్డల్లో తను భాగం పొందలేడు. దాని కామె పరస్త్రీ [illegible]. ఈ నూతన బాంధవ్యం ఏవిధంగా [illegible] భవంలోనైనా వస్తుందా? దక్కు[illegible] వాళ్ళకు తప్ప? ఇప్పుడతనికి ఆడవాళ్ళ జీవితంలో కష్టం తెలిసొచ్చింది. ప్రతి ఆడదానికీ ఈబాధ తప్పదుగదా, తన తండ్రి చెప్పిన "బోగం ట[illegible]" సుఖంగా కొత్త మొహంతో [illegible] చెయ్య[illegible]

ప్రతి ఆదరదీ చెయ్యవలిసిందే. తరతరాల నించీ చేస్తూ ఉండటంచేత వాళ్ళ కవి ఈ పాటికి అలవాటయి ఉండవచ్చును. అంత మాత్రానికి అవి భోగం టక్కులు కాకుండా పోతవా? ఎవరో పరాయి మొహాలను వరసపెట్టి పిలవాలి. లోపల లేని గౌరవం చూపించాలి, తనకు సంబంధించని విషయాల్లో శ్రద్ధతీసుకోవాలి. తనకన్న చిన్నవాళ్ళనుకూడా ఏమయ్యా, ఏమమ్మా అనాలి కాని ఏమిరా, ఏమే అనరాదు. తనకన్న పాతికేళ్ల చిన్నవాళ్ళయినా తప్పదు. ఇంతకన్న వేరే నిర్బంధం ఏంకావాలి? మొగుడూ అత్తగారూ మొదలైనవాళ్లు చేసే నిర్బంధం దీంతో పోలిస్తే ఎంత? ఇది మనిషికి దాస్యం. అది ఆకారమైనాలేని ఆచార పిశాచానికి దాస్యం?

ఏ కారణం చేతో హైమవతికూడా తన్ను తప్పించుకు తిరుగుతున్నట్టు కనపడ్డది. ఆ సంగతి తెలుసుకున్నప్పుడు శ్రీరాములుకు చాలా కష్టం వేసింది— అకారణంగా, మొదట తన్ను అనుమానంతో చూసిన కృష్ణవేణమ్మ క్రమంగా అభిప్రాయం మార్చుకోవటం అతనికి మరింత చిరాకు కలిగించింది. ఈ పాడు లోకంలో తృప్తనేమాట మనిషికి లేనే లేదనుకున్నాడు. జీవితం యావత్తు లోపాలమయం. సృష్టికూడా అంతే. భగవంతుడూ అంతే!

• •

హైమవతి భర్త పోయినాడు. శ్రీరాములు ఆశ్చర్యపడలేదు. అటువంటి దేదో జరక్కపోవటమే విపరీతం. కృష్ణవేణమ్మ కేశఖండనాన్ని గురించి ప్రస్తావన తీసుకురాగానే అతనిగుండె బద్దలయింది. కాని మరెవరూ అందుకొప్పుకోలేదు. జరిగిపోయింది.

చెల్లెల్నిఆదరించి పోవటానికి రత్తమ్మ వచ్చింది. జ్ఞాపకం పెట్టుకుని శ్రీరాములావిణ్ణి వచ్చిన మరుక్షణంనించీ అక్కాఅని పిలవటం మొదలుపెట్టాడు. ఆవిడకు ఎంతమాత్రం ఈపద్ధతి రుచించినట్టు కనపడలేదు. మొత్తంమీద ఆవిడ అతిశయాహంకారా లతనికి చాలా తలనెప్పి కలిగించినై.

ఆవిడ వచ్చిన మర్నాడే చెల్లెలి నూతన వైధవ్యాన్ని గురించి మరిచిపోయినట్టు కనిపించింది. ఎంచేతంటే ఆవిడకు ఉన్న నాలుగురోజులూ తండ్రిని సాధించటంతోనే సరిపోయింది.

"మహాపెట్టావులే! చేశావులే! హయ్యో రామ! పక్షపాతాలుంటే దిగమింగుకుని లోపలే పెట్టుకోవాలి కాని ఒకర్ని ఒకవిధంగా ఇంకోర్ని ఇంకోవిధంగా చూస్తే అదిమాత్రం ఏం బాగుంటుంది? ఎవరైనా వింటే నవ్వుతారు.మా వూళ్ళో అంతా నవ్వేవాళ్ళే. నాకు చచ్చినట్టుందమ్మా. చెప్పొద్దూ! తల్లిదండ్రులు బాగానే ఉండిరిగదా పండగలూ పర్వాలూ వచ్చినప్పుడు ముద్దు ముద్దుగా కూతుర్నీ అల్లుణ్ణీ"—అంటారా? అవరా?"



"మీ అమ్మని తీసుకురాకుండా నిన్ను ఒక్కత్తెనే రమ్మని వుత్తరం రాసేను గదా! మళ్ళీ ఎందుకు తీసుకొచ్చేవు మీ అమ్మని?"

"మీరు రాసిన ఉత్తరం మా అమ్మ చదివింది. సంగతేమిటో కనుక్కుందామని స్వయంగా వచ్చింది...."

---

"ఔనౌను!" అన్నాడు శ్రీరాములు నిట్టూర్పు విడిచి. రత్తమ్మ భయంకరంగా అతనివంక చూసి మళ్ళీ చాటభారతం ఎత్తుకుంది.

"ఔనులే! ఆమాణిక్యం బతికుండీ చచ్చినదాంతోనే సమానంకదా? నేను సరేసరికదా? ఇక మీకు గారాబపు అమ్మాయి అదేగా? ముద్దు అల్లుడు దాని మొగుడేగా!"

"మొన్న శ్రీరామనవమికే కాదుటే తీసుకురాంది నిన్ను? అతనేమో చావు బతుకులమీద ఉండెను. చూడబోయినా మనేగా నీసాధింపు? అదిమాత్రం నీ వంటిదికదూ? దానికేమీ తెలీనప్పుడు నీకు పెట్టలేదా చెయ్యలేదా? ఇప్పుడా వచ్చి నతన్ని సాధిస్తావేమిటి?"

"అబ్బో! మహాపెట్టావులే! చేస్తావులే:"

శ్రీరాములుకు తలనెప్పి జాస్తయింది: అతనక్కణ్ణించి లేచి మేడమీదికి పోయినాడు. అక్కడ ఒంటరిగా కుర్చీలో కూర్చుని హైమవతి కళ్ళనీళ్లు పెట్టుకుంటున్నది. అతని అడుగుల చప్పుడు విని ఆపిల్ల తలఎత్తి చూసింది. శ్రీరాములు తిరిగి కిందికి వెళ్ళిపోదామా అని ఆలోచిస్తూ ఒక్కక్షణం నిలబడి వద్దని తీర్మానించుకుని ఒక కుర్చీ ఆమె దగ్గిరగా ఈడ్చుకుని కూర్చున్నాడు.

నిలవనీరు పారటం మొదలుపెట్టింది!

మనిషి జీవితానికి చలనం కలిగించే యంత్రాలు మనిషి బుర్రలోనే ఉన్నవని శ్రీరాములు తరవాత గ్రహించాడు.

హైమవతి కళ్ళు తుడుచుకుని అతని వంక నిదానించి చూసింది. అతనది గమనించలేదు. అతనికల్లా సంభాషణ ఎట్లా ప్రారంభించాలాఅని. చివరకాపని హైమవతే చేసింది.

"ఏదో పనిమీద వచ్చినట్టున్నారు. పని చేసుకుపొండి. నేను ఒంటరిగా కూర్చో దలచుకున్నాను."

శ్రీరాములుకు తాత్కాలికంగా ఆగ్రహం వచ్చింది. ఆ బహువచనం!

"నేను కాస్సేపు మీదగ్గర కూర్చుని మంచి చెడ్డలు మాట్లాడ దలచుకున్నాను-"

హైమవతి లేచింది.

"ఈవిధంగాకపటప్రవర్తనచెయ్యటం దుర్భరంగా ఉంది. నేనెన్నడూ నెల రోజులపాటు ఇంత దొంగవేషం మీద ఉండలేదు. ఒక్కసారి తమతో అసలు శ్రీరాములల్లే మాట్లాడదామని వచ్చాను."

హైమవతి కాస్సేపు నిర్ఘాంతపోయి చివరకు మెల్లిగా కుర్చీలో కూర్చుంది. ఈమాటతో ఆపిల్ల మనస్సులో ఉన్న పెద్ద సంశయం ఒకటి నివారణ అయింది. శ్రీరాములు పరసలు పెట్టిపిలవటం, ఆప్తుడల్లే ప్రవర్తించటం మొదలైనదంతా దొంగెత్తేనని హైమావతి మొదటనే కనుక్కుంది. అతనిచర్యల అమె చాటు అసహ్యమనికూడా అనిపించింది. ఒక వేళ అది దొంగెత్తు కాకపోతే శ్రీరాములంత దద్దమ్మ పుట్టబోడు, పెరగబోడన్న మాట. శ్రీరాములు కపటంగా ప్రవర్తించటమే కాక అట్లా ప్రవర్తిస్తున్నట్టు ఒకరి దగ్గరయినా ఒప్పుకోటానికి సిద్ధంగా ఉన్నాడన్నమాట. సాహసే! బహుశా తన ప్రవర్తనకు కారణం చెబుతాడేమో! వినదగినదే? కాని హైమవతి కోరిక నెరవేరలేదు. ఆమె కూర్చోగానే శ్రీరాములు విషయం మార్చాడు.

"మీ అక్కయ్యకు చిన్నతనంలో తలమీద బలమైన గాయం తగిలి ఉండాలి. అంచేతే మతిపోయింది."

ఇప్పుడు హైమవతికో చిక్కొచ్చి పడ్డది. వొకసారి మీరు అని అతన్ని పిలిచి ఇప్పుడు నువ్వని మార్చటానికి తగిన కారణం ఏముంది? ఇంతా మీరు మీరంటూ మాట్లాడటంలో అర్థంలేదు. ఏకోపంమీద అట్లా సంబోధించిందో ఆకోపం అతను తన ప్రవర్తనకు కారణం చెప్పకుండానే పోగొట్టాడు. చాలాపనకు గట్టివాడే! ఏమైతేనేం, ప్రస్తుతం ఆమె మాట్లాడితే వినే స్థితిలో ఉందికాని మాట్లాడే స్థితిలో లేదు. "ఆవిడమాట్లాడుతుంటే నాకు మోకాట్లో మెడస్వరం పట్టుతుంది!" అన్నాడతను, ఇంకా రత్తమ్మను గురించే.

"ఆవిడకు అహంకారం జాస్తిగా

కనపడుతుంది!'' అన్నాడు కొంచెం సేపుండి.

"వాళ్ళు చాలా భాగ్యవంతులు!" అంది హైమవతి.

"ఆఁ! వాళ్లెటువంటి ఇళ్ళలో ఉంటారేం? ఎటువంటి తిండి తింటారేం?"

"తింటారనా?" అన్నది హైమవతి.

"తిసరని నాకు తెలుసు, తింటారనికాదు. తినాలని! డబ్బుంటే ఎందుకు? లేదవాడికీ భాగ్యవంతుడికీ ఏమిటి భేదం? ఆరోగ్యకరమైన ఆహారం, ఇళ్ళూ, దుస్తులూ లేకపోయినందువారు. నాకు ఈ సామాన్యజీవితం అనలేను. ప్రస్తుతం భోజనంకింద పరిగణింపబడే చెత్తా, ఇళ్ళకింద పరిగణింపబడే సక్కా గుంటలూ నాకు చాల్లేదు. ఈగొడ్డు బతుకుమానేసి మనిషల్లే బతకటమత్యావశ్యకమైంది. అందుకు డబ్బుతప్ప సాధనోపాయంలేదు. దానికోసం వచ్చాను. అందుకోసం వచ్చినవాణ్ని మరెందుకు వచ్చినట్టెందుకు ప్రవర్తించటం? ఏషరతులమీద నాకు మీనాన్నగారి డబ్బు లభిస్తుందో ఆషరతులకులోబడి నాగర్వాన్ని అహంకారాన్ని చంపుకుని ఒకవిధంగా నడుచుకుంటున్నాను. అనేక కారణాల వల్ల అందరం వెధవపనులు చెయ్యాల్సొస్తుంది. అంతమాత్రానికే అందరం వెధవలమని అనుకోటంగాని మనం చేసే పనులు నిజంగా వెధవ్వి కావనుకోటం గాని నాకు అవసరంగా కనిపించలేదు. నిన్నుచూసిన క్షణంనించీ నీకూనాకూ మధ్య రహస్యాలు అవసరం లేదనుకున్నాను. అందుచేత నీకిదంతాచెప్పేస్తున్నాను. నేనుచేసే మంచి పనులకెప్పుడూ మెప్పవసరంలేదు. నేనుచేసే పాడుపనులేవైనా ఉన్నప్పుడు నీవంటిదాని సానుభూతికావాలి. నువ్వర్థం చేసుకుంటే నామనసుకు చాలా తృప్తిగా ఉంటుంది. నేను చేసిన పని నీకు సమ్మతమేనా!"

హైమవతి కాస్సేపు ఆలోచించి "నాకేమీ అభ్యంతరం చెప్పటానికి కనిపించటం లేదు!" అన్నది.

"మా అన్నయ్య ఎంత దురదృష్టవంతుడు. మా వదినెగారు వేదాంతి, ఆచారసంపన్నురాలు. నీతిమంతి. ఆవిడ ప్రతిరోజూ తీరుబాటు చేసుకుని మొగుడి దుష్ప్రవర్తన చూపుతూ ఏకరుపెట్టి ఖండిస్తూ వుంటుంది, మా వాడు కేవలం దుర్మార్గుడు కాకపోయినప్పటికీ ఆవిడ అయినన్న చాలా బాగుచేసిందని ప్రతీతి, నాకావిడంటే చాలా భయం. నీవంటి వాళ్ళకు మొగుళ్ళు పోలారు! మాయ ప్రపంచం!"

హైమవతి అటువంటివాణ్ణే యెన్నడూ చూడలేదు. అతను మాట్లాడుతూంటే తనకు మతి పోయినట్టనిపించింది. అయిదునిమిషాలు విడనకుండా యెన్నడూ ఆలోచించి ఎరగని తన్నుతను యెక్కడికో మబ్బులమీద తీసుకుపోతున్నట్లయింది. మెల్లిగా ఆలోచన చిక్కబట్టి

సమాధానం ప్రారంభించింది. "మీరు-"

"నువ్వు చాలు. నన్నసలెవ్వరు గౌరవంగా పిలవరు. పైగా నేను నీకంటే రెండుమూడేళ్లే పెద్ద."

"ఇంత విపులంగా అరిటిపండు ఒల్చిపెట్టినట్టు చెబితేనేగా, నా కర్థమయింది. నేనుమాత్రం పొరపాటు పళ్ళేదా?"

హైమవతి నువ్వో మీరు కూడా చేసింది.

"పోనీ అప్పటికైనా అందుకున్నావు."

హైమవతి లేచి పిట్టగోడ మీదిగా చూసింది. బండి ఒకటి యింటి ముందాగినట్టు శ్రీరాములు కూడా తెలుసున్నాడు.

"మా మాణిక్యం!" అంది హైమవతి ఆశ్చర్యంతో. ఆమె గొంతులో కొంత సంతోషం లేకపోలేదు.

"నాకు అప్పా! చెల్లెలా?" అన్నాడు శ్రీరాములు

"చెల్లెలేమో ననుకుంటా! నాకన్న రొండేళ్లు పెద్ద."

"భేష్! "చెల్లెలా రమ్మ. ఏది చూచెద"—ఈవిడే కాదూ వంశానికి కళంకం తెచ్చింది?"

"ఆ! కళంకం కాదు గడ్డలు! దానంత మంచిది లేదు."

"దటీజ్ ఒరిజనాలిటీ!"

మాణిక్యమ్మ యింట్లో అడుగు పెట్టగానే అందరూ గొల్లుమన్నారు—దుఃఖం కాదు ఆగ్రహం.

"ఏడిచారులే! హైమీయేదీ పైనుందా? మళ్ళీ వచ్చి మాట్లాడతాను. ఇప్పుడే గొంతులు చించుకోకండి!" అంటూ ఆమె మెట్లెక్కి పైకొచ్చింది. శ్రీరాములు తిరిగ్గా లేచి యింకో కుర్చీ తెచ్చి దగ్గర వేశాడు.

శ్రీరాములును చూసి మాణిక్యం వాకిట్లోనే ఆగి ఎవరు వీరన్నట్టు చూసింది హైమవతివంక. ఆమెను చూస్తూనే అతను మనసులో మనిషట్లా ఉండాలనుకొన్నాడు. మాణిక్యం నఖశిఖపర్యంతం ఆరోగ్యంతో వెలిగిపోతున్నది. మనిషి అమిత పరిశుభ్రంగానూ, కట్టూ బొట్టూ వగైరాలయందు చాలా శ్రద్ధగలదిగానూ చూడగానే కనిపిస్తున్నది.

"నేను ప్రస్తుతం ఇక్కడ ట్రయల్ మీద ఉన్నాను. ఈ రెండు మూడు నెల్లూ చూసి పనికొచ్చేటట్టయితే నన్ను మీ అన్నగా పరిగ్రహిస్తారు మీనాన్నగారు. ఎందుకో నాకు తెలీదు. నా అభ్యంతరం ఎంత మాత్రంలేదు" అన్నాడు శ్రీరాములు.

"నాకర్థం కాలేదు!" అందిమాణిక్యం.

"నాన్న పెంచు కుంటున్నాడు!" అన్నది హైమ.

"నాన్నా! ఈయన్నా!" అంది మాణిక్యం ఆశ్చర్యంతో.

"అందు కేమైనా బలమైన అభ్యంతరం ఉందా?" అన్నాడు శ్రీరాములు.

అబ్బా! తల నొప్పి విపరీతంగ వుంది సార్!
ఒక్క రోజు సెలవిప్పించండి సార్!!




"తప్పకుండా ఉంది, మానాన్నకేముంది పెంచుకోటానికి? ఆయన దివాలా తీశాడు."

"ఇప్పుడు నాకర్థం కాలేదు!" శ్రీరాములుకు నిజంగా అర్థం కాలేదు.

"మానాన్నకు బోలె డప్పుంది. ఇంకా అప్పులవాళ్ళకు తెలీ దెంతఉందో. ఎప్పుడో పిడుగుపడుతుంది, సర్వనాశనమే. ఒక్క పరక, ఒక్కపోచ మిగల్దు. నాకు తెలుసును."

శ్రీరాములు ఉత్సాహం యావత్తూ వచ్చిపోయింది.

"నిజంగానా?"

"మాముగ్గురి పెళ్ళిళ్ళకూ చేసిన అప్పు ఇప్పుడు యిరవై ఐదు వేలయింది, ఇదిగాక యింకా పదివేలు యితరత్రా చేశాడు."

శ్రీరాములు నిట్టూర్పు విడిచాడు.

"నువ్వేంచేస్తావే హైమా? నిన్ను ఓదార్చటానికి రాలేదు నేను. వెధవ ముండగా అక్కపక్షల్లే బతకదలచుకున్నావా? మళ్ళీ పెళ్ళి చేసుకుని నీవిధిని నిర్వర్తించాలా? నీకిక్కడ గ్రహాలు చాలా ఉన్నై. అవి నిన్ను ఆవహించి నీచేత ఏమీ కాకుండా చేస్తై. నాకు తెలుసు. కాని నీమీద యింకా పట్టి పీకులాడుతున్నది, అందరిమీదా పోయినాకూడా! అందుకని నాబుద్ధికి తోచిన ముక్కలు రెండూ చెప్పి పోదామని వచ్చాను."

"హైమవతికి యితరులకూ గల తేడా నేనుకూడా ఇది వరకే గమనించాను. నేను పొరపాటు పడలేదన్నమాట!" అన్నాడు శ్రీరాములు.

"చూడు బాబూ! నీపేరేమిటో?"

"నా పేరు శ్రీరాములు."

"అట్లా అయితే నువ్వుదీన్ని తీసుకుని మీ ఊరు లేచిపో."

"నకు చెల్లెలి వరస!"

"ఇదెక్కడి చెల్లెలి వరస? ఈ పెళ్ళుడుకు ఒప్పుకోనేవద్దు. నామాట నమ్ము."

"గోత్రం?"

"ఎక్కడో గోత్రమంటా వేమిటి? ఈగోత్రం యెప్పటిదో? ఈలోపల వాళ్లలోనూ మీలోనూ నావంటి ప్రతివ్రత లెంత మందిఐనారో? నానాగోత్రోద్భవస్యా' కాలా వంశాలు? అసలు మా అమ్మ విషయమే నాకనుమానంగా—"

"ఏమిటే చిన్నక్కయ్యా అది! మరీ యెలితం యేనాది పచ్చవుతున్నా" వంది హైమవతి. మాణిక్యం బిగ్గరగా నవ్వింది.

"సరే నేవెళ్ళొస్తా. బండివాడితో పదిహేను నిమిషాలన్నా. ఇంకా కింద కొంచెంవడ్డింపులు కావలసి ఉన్నై." అంటూ మాణిక్యం వెనక్కి తిరిగింది.

వాకిలి దగ్గర మళ్ళీ ఆగి "నేను చెప్పినసంగతిని గురించి యిప్పుడే మాట్లాడుకోండి ఇద్దరూ. రెండు నిమిషాలు యెవరూ పైకి రాకుండా అపుదల చేస్తా!" అనిమెట్లుదిగి పోయింది.

మాణిక్యం వెళ్ళిపోగానే శ్రీరాములు మనసులో నీరసం మరీజాస్తయింది. కాస్త ప్రవహించటం మొదలుపెట్టిన జీవితం మళ్ళీ ఘనీభవించింది. నిస్పృహ మంచల్లే మనస్సు మీద పడి కప్పెయ్యటం మొదలుపెట్టింది. నిద్దరను ఆపుకో దలచిన వాడు శరీరం విదిలించుకున్నట్లు శ్రీరాములు ఒక్కసారి మనస్సును విదిలించాడు.

ఇది తీరిగ్గా మాట్లాడుకోవలసిన సమయంకాదు.—యిష్టంలేకపోతే హైమవతిరొండుతిడుతుంది. ఈ నిస్పృహ కన్న తిట్లు తినటంలో ఉన్నచైతన్యం లక్షరెట్లు నయం.

అతను చప్పునలేచి హైమవతిని సమీపించి వంగి మొహంపెట్టి "మీఅక్కయ్య చెప్పిన సలహాప్రకారం చేదామా" అన్నాడు,

హైమవతే తన మొహం అతని మొహానికి అనించి ఉండాలి. లేకపోతే అతని ప్రయత్నం లేకుండా అరొండు మొహాలు యెట్లాకలుసుకున్నై!

శివుడి జడల్లోనించి అవతరించిన గంగ మోస్తరుగా ఆతనిలో జీవశక్తి ప్రవహించటం మొదలు పెట్టింది. అతని చెవుల్లో హోరు అలాపతే నేమోకూడాను!






భగవంతుని పేరెత్తేవారంటే నాకు మంట. అతనివల్లే సృష్టి జరుగుతుందంటే నాకు కోపం....అతనంత పక్షపాతి మరెవరూ లేరు. కొందరికి కోరినవన్నీ యిస్తాడు. మరికొందరికి కనీసపు కోర్కెలు గగన కుసుమాలు చేస్తాడు. యెందుకు? యేమో ..

''ఇక్కడ నిల్చున్నావా తలంటుకోవూ?'' ప్రశ్నించింది తల్లి . . . .నా కన్నతల్లి. నన్ను కన్నందుకు పదిసార్లు కించపడే తల్లి. ఇందాక అక్కయ్యకు ప్రేమగా తలంటిన మాతృమూర్తి.

''ఊం. '' అన్నాను. మర్నాడు సాయంత్రము మా వివాహాలు. స్నానాల గదివైపు వెళ్తూ హాల్లోకి చూచాను. సర్వాలంకారంతో ముసి, ముసిగా నవ్వుతుంది. అక్క చుట్టూ చేరిన బంధుజనము హాస్యంతో పరిహాసాలతో ఆమెను ఉక్కిరి, బిక్కిరి చేస్తున్నారు. నా హృదయం భగ్గుమంది. తొట్టెడు నీళ్లు నా హృదయంలోని మంటల నార్పలేక పోయాయి.

''ఇదిగో తుండు.'' పొడిగా తుండు

యిచ్చింది అమ్మ. అక్కయ్య, తల పీపు ఆప్యాయంగా తుడిచిన అమ్మ. అందు కున్నాను.

"శ్రీ లతకేం బంగారుబొమ్మ....మీ అత్తగారు చాలా నగలు కొన్నారట కదూ!"

"అయ్యో వెర్రిమాలోకమా! అత్త గారు కాదు. అతనే స్వయంగా అన్నీ కొనిపించాడట."

"అందం, అదృష్టం, ఐశ్వర్యం అన్నీ ఉన్నాయి"

వాళ్ళు మాట్లాడే మాటలు నా మండే గుండెలలో ఆజ్యం పోశాయి. మరోమాట వినాలని లేదు. అయినా అమ్మలక్కలు ఊరుకుంటారా!

"మీ జయలత అత్తగారేం కొన్నారు వదినా?"

"వారేం కొంటారు? అబ్బాయి ఏదో విశాల భావాలున్నవాడు కాబట్టి పెళ్ళికి అంగీకరించాడు. కట్నం డబ్బే అడ్వా న్సుగా తీసుకువెళ్ళి తన చెల్లెలి పెళ్ళి చేశాడు."

"అంతేలే. ఒకరి అదృష్టం మరొకరికి యెలా వస్తుంది?"

"అమ్మాయి బాధ పడగలదని వాళ్ళ నాన్నే నాల్గు చీరలు, ఓ నెక్లెసుకొన్నారు. ఇది మా శ్రీకి భలేగా నప్పింది."

"శ్రీ....శ్రీ....శ్రీ!" నేలను కసిగా తన్నాను. అన్నీ శ్రీకే కురూపిగా పుట్టడం నాతప్పా! కన్నతల్లి ప్రతిక్షణం ఇద్దరిని కంపేర్ చేస్తుంటే యెలా వుంటుంది! నాకు కొన్న ముష్టి నెక్లెసు కూడా అక్కయ్యకే నప్పిందట.... కనీసం నాకో హృదయముందని ఎందుకు అనుకోరు. ఏడుపు రావటం లేదు. సహ నము చచ్చిపోతుంది. అందరిపైనా కసి, ద్వేషం బయలుదేరాయి.

"జయలతా!.... కొత్తబట్టలు కట్టు కోవూ!" అమ్మ పిలుపు. అక్కయ్యలా నన్ను ముద్దుగా జయా అనో....లతా అనో పిలిస్తే, పిలువరు....ముద్దొచ్చేవారికి ముద్దుపేర్లు.

"చెముడా ఏమిటే?" అమ్మ గదిలోకి వచ్చింది.

"ఏమిటి?" అన్నాను విసురుగా.

"కల్యాణ తిలకం పెట్టాలి. కొత్త బట్టలు కట్టుకుందువుగానిరా."

"నాకే తిలకం వద్దు. నా ముఖానికి అదొక్కటే తక్కువ అయింది."

"బావుందమ్మా నిష్ఠూరం! సమయ మవుతుంది పద" లాక్కెళ్ళినట్టు తీసుకు పోయింది. అందులో ఆప్యాయత, ఆద రణ ఏ కోశాన లేవు. తల్లి అంటే అమృతమూర్తి అంటారు. ఆమె హృద యమంతా నవనీతం అంటారు. ఏది? ... అమ్మ వాక్కులో అమృతం కనిపించదేం? కొంత నా వూహ కావచ్చు. మరికొంత చుట్టూ ఉన్నవారి ప్రవర్తన కావచ్చు. నేనో చట్రంలో బిగించుకుపోయాను. అవతలివారు ఏవి మాట్లాడినా నాకు తప్పు



యు వ

గానే కన్పించేది. నా మనసెరిగిన పెద్దలు లేరు. వారికి నేనో బాధ్యతను, బరువును. ఆ భావన వారి ముఖాలలో చూచినప్పుడు నేను యెంత నరకయాతన అనుభవించే దాన్నో యెవరూ ఊహించలేరు. లాంఛన ప్రాయంగా ఓ చీర, జాకెట్టు యిచ్చింది. అవి తొడుక్కున్నాను.

"శ్రీలత ఒక్కతే ఉంది. జయ ఏది?" ఎవరిదా కంఠము? ఆశ్చర్యంగా బయటకు చూచాను. సుగుణమ్మ టీచర్. వెళ్ళి ఆమె పాదాలు కన్నీటితో అభిషేకించాలనుకున్నాను ఆమె సార్థక నామ ధేయురాలు. భౌతిక కాయం చూచి మాట్లాడే మనిషి కాదు అలా అని ఆమెను కురూపి అనుకునేరు, ఆమెలాటి అందమైనవారు ఆ ఊరిలోనే లేరంటే అతిశయోక్తి కాదు. నాకు ప్రేమాదరణకు అర్థం తెలిసింది ఆమె అమృతవాక్కుల వల్లే.

"భలేవారండీ! అమ్మాయి రానంటే గదిలో వదిలేస్తారా!" ఆవిడ చనువుగా నా గదిలోకి వచ్చింది.

"జయా!" ఆవిడను చూస్తూ నిల్చున్నాను. "ఈ చీర నీకు యెంత బావుంది! ఆ బొట్టు అలా అడ్డదిడ్డుగా పెట్టుకున్నావేం!" ఆవిడ బొట్టు సరిచేసింది. నాలో యెన్నో రోజులనుండి పేరుకుపోయిన ఆవేదన అశ్రురూపంలో బయటపడింది.

"ఛ.. తప్పమ్మా." చక, చకా తల చక్కగా దువ్వి, కబుర్లు చెబుతూ ముస్తాబు చేసింది. మా ఇద్దరికి ఒకే లాంటి బహుమతి ఇచ్చిందావిడ. ఇద్దరిని ఒక చోట కూర్చుండ బెట్టింది. ముత్తయిదువుల చేత పాటలు పాడించింది. హాస్యాలతో నవ్వులతో, కేరింతలతో గంట గడిచిందే తెలియదు. ఆవిడ నవ్వగలదు. నవ్వించ గలదు. ఆమె వెళ్ళి పోయాక మళ్ళీ ఏదో శూన్యం లాంటిది నా హృదయిం ఆవరించుకుంది. పరిస్థితులు, మామూలే.

"విడిదిలో అల్లుళ్లను చూచామే. శ్రీకి భలే జోడి దొరికింది."

"అది పుట్టగానే మా యింట్లో దీపం వెలిగింది. పిచ్చిది.... వెళ్ళిపోతే యెలా ఉంటాము!" కంట తడిపెట్టుకుంది అమ్మ.

"ఏమేవ్!" నాన్నగారికేక.

"ఆ ...ఏమిటి?"

"శ్రీని కాస్త హాల్లోకి పంపు. పెళ్ళి కొడుకు స్నేహితులు చూస్తారట. అబ్బాయి వచ్చాడు."

"ఓయ్.... మీ ఆయనకెంత ఆరాటమే. అప్పుడేను ..."అందరి హాస్యాల మధ్య అక్క వయగారాలు పోతుంది, నా హృదయమున కుచించుకు పోయింది.

"జయలతకు ఆనెక్లెసు ఏం బావుందే!"

"మరింత వికారాన్ని కలుగ చేస్తుంది."

"ఆ సంగతి నాకు ముందే తెలుసు. వద్దంటే ఊర్కుంటుదా!"

అమ్మ వివరణ. ఆ క్షణంలో ప్రాణం

పోతే బావుండును అని పించింది.

అక్క వివాహం అవుతున్నా బయటికి రాలేదు. నేను బయిటికి రాక పోయినా నాక్షేమూర్తులు నన్ను తూర్పార పట్టటం మానలేదు. పాము, తేలు మొదలగు జంతువులు నయం. వాటి జోలికి పోయి, వాటిని తొక్కితేనే కాటు వేస్తాయి కాని ఈ మనుష్యులు మనింట్లో మన మున్నా, నిర్దాక్షిణ్యంగా హింసిస్తారు. పొడిగా నాకు పిలుపు వచ్చింది. మా శ్రీ వారి తరపున బంధువులు యెవరూ అట్టే లేరు. బావగారి ముఖంలోని చిలిపితనం, ఉత్సాహం. మావారిలో మచ్చుకైనా కన్పించ లేదు. ఏదో బాధ్యతగా మూడు ముళ్ళు వేశారు. మమ్మల్ని గుమ్మం దగ్గర పేరు చెప్పమని యెవరూ పరిహాసాలు ఆడలేదు.

''జయలత చురుకయిన పిల్ల, చదివినంత వరకు చదివించండి. ఆమె అంతరంగం చూచి ప్రేమించే పురుషుడు తనంతటి తాను వచ్చిన్నాడు వివాహం చేసుకుంటుంది.'' సుగుణమ్మ టీచరు నాన్నతో చెప్పగా విన్నాను. అయినా నాన్న నాకోసం పెళ్ళి కొడుకును కొన్నారు.

మధురాతి మధురమైన తొలిరేయి అంటారు. నా కెలాంటి అనుభూతులు లేవు. అతను తలనొప్పి అని పడుకున్నాడు. పది నిమిషాలు మౌనంగా దొర్లాయి.

''అమృతాంజనం రాయనా?'' మెల్లగా అడిగాను. ఆ క్షణంనుండి అతను నా వాడు. అతని బాగోగులు నాకు ముఖ్యం.

''వద్దు....'' అన్నారు పొడిగా. కళ్ళు విప్పి నా వంక అయినా చూడలేదు. ఇలా యెందుకు జరిగింది! గంట, రెండు గంటలు గడిచాయి. అతనివైపునుండి... మాట లేదు. లైటు ఆర్పి అలాగే ఓ ప్రక్కకు ఒత్తిగిలి పడుకున్నాను.

మర్నాడు అక్కయ్యా బయటే కన్పించలేదు. ఒక క్షణం బయటికి వచ్చినా, ఏవో సాకుతో బావ పిలిచేవాడు. మావారు ఇంట్లోనే కన్పించలేదు. కొందరు సానుభూతిగా నా వంక చూడటం భరింపలేకుండా ఉన్నాను. సాయంత్రం పెరట్లోకి వచ్చి కూర్చున్నాను. శూన్యంలోకి చూస్తున్నాను. కాలమే తెలియలేదు.

చీకటి పడ్డాక ఇంట్లోకి వచ్చాను. హాల్లో నవ్వులు వినిపించాయి. తొంగి చూచాను. నా హృదయస్పందన ఆగి పోయినట్టు అయింది. మావారు అంత బాగా నవ్వుతారని తెలియదు. అక్కయ్య, బావ ఆయన ముగ్గురు పేక ఆడుతున్నారు. అక్కయ్య ఏదో జోక్ చెబితే ఆయన పగలబడి నవ్వుతున్నారు. ముగ్గురిలో ఏ ఒక్కరికి నేనో మనిషిని ఉన్నానని తెలియదా, చెప్పలేని కోపంవచ్చింది. ఎవరిపైన తీర్చుకోవాలి!

''లైటు వేసుకోకుండా పడుకున్నావేం? భోజనం చేద్దువు రా.'' అమ్మ




పొడిగా పిలిచింది.

"ఆకలి లేదు." అలాంటి రోజులు చాలా గడిపాను, తెలివి వచ్చినప్పటి నుండి. గంట తరువాత ఆయన గదిలోకి వచ్చి బట్టలు మార్చుకుంటున్నారు.

"మేమందరం సినిమాకు వెడుతున్నాం. నువ్వు వస్తావా?" నువ్వు రా అంటే వెళ్ళేదాన్నేమో. ఎంత తేలిక!

"మీరు వెళ్ళిరండి." అంతే! ఆ మాట కెదురుచూస్తున్నట్టే ఆయన వెళ్ళిపోయారు. మలిరేయి సంబరం ఇలా ముగిసింది. మర్నాడు వారందరు షాపింగ్‌కు వెళ్ళారు. నా హృదయభారం తీరాలంటే.... ఒక అరగంట సుగుణమ్మ టీచర్ దగ్గర కెళ్లాలి. వెళ్ళి ఆమె భుజంపై తలవాల్చి భోరుమన్నాను. నా నోటితో చెప్పకుండానే అంత అర్థం చేసుకుంది. ఎన్నో విధాలుగా ఓదార్చింది.

"స్త్రీ జీవితం ఓ శాపం జయా! అది వరంగా మార్చుకోవటం మన చేతిలో పని. పురుషుడు వెంటనే అభినందించేది బాహ్యసౌందర్యం. నువ్వు నీ ప్రేమ, అభిమానంతో ఆయనను ఆకట్టుకో.... నటించాలనుకో. తప్పదు మరి." ఎన్నో విషయాలు చెప్పి పంపించింది. ఆవిడ చెప్పిన విషయాలు మననము చేసుకుంటూ ఇంటిదారి పట్టాను. వాళ్లంతా పేక ఆడుతున్నారు. బావగారు కాఫీ కావాలంటే అందరికీ నేనే తీసుకుపోయి ఇచ్చాను. మధ్యాహ్నము వాళ్ళిద్దరూ స్నేహితులను చూచి రావటానికి వెళ్తే, మావారు హాయిగా నిద్రపోయారు. రెండుగంటలనుండి ఐయిదు గంటల వరకు అలా కనిపెట్టుకుని కూర్చున్నాను. ఆయన లేవగానే కాఫీ తెచ్చిఇచ్చాను. కాఫీ త్రాగి వెళ్లి హాల్లో నాన్నగారి దగ్గర

కూర్చున్నారు.

"పెద్దల్లుడు బెంగుళూరు, మద్రాసు తిరిగి వస్తాడట. మరి మీ ప్రోగ్రాము ఏమిటో?"

"నాకు సెలవు లేదండీ. ఇల్లు చూచుకుని వచ్చి....తీసుకు వెడతాను." నాకు చెప్పలేనంత కోపం వచ్చింది. నా పేరు వుచ్చరించటానికి అంగీకరించని మనిషి నన్నెంత ప్రేమగా చూస్తాడో ఊహించగలను. అయినా నిగ్రహించుకున్నాను.

పురుషుడి కామ వాంఛకు ఓస్త్రీ అవసరము. అలాంటి అవసరాలకు పావునయ్యానే గాని వారి హృదయంలో స్థానము సంపాదించ లేక పోయాను. నటించాలి. అతను వెళ్లటానికి సిద్ధం అయ్యాడు.

"ఏమండీ!" యెంతో ప్రేమగా చేరువగా వెళ్లాను.

"ఏమిటి?"

"మీ వెంట తీసుకు పోరూ!"

"ఎక్కడికి? నేనో స్నేహితునితో ఉంటాను."

"మళ్లీ యెప్పుడు వస్తారు?"

"ఎప్పుడు సెలవు దొరికితే అప్పుడు." బలవంతంగా కళ్లనీళ్లు ఆపుకుని వెళ్లిపోయాను.

* *

అక్కయ్యా భర్తతో హానీమూన్ ట్రిప్పు పూర్తిచేసుకుని రావటం. అదే రోజూ మావారు నన్ను తీసుకు పోవటానికి ఒకేసారి తటస్త వద్దాయి. ఆయన నిదుర పోయాక జేబులోనుండి శంఖుల హారం క్రింద పడింది. నా సంబరం ఇంతా, అంతాకాదు. ఆయన నా గురించి ఆలోచిస్తా రనుకుంటే యెంతో గర్వంగా వుంది. ఆ హారం యథాస్థానంలో పెట్టేశాను. ఆయన చేత్తో యిస్తే యెంత హాయి! తెల్లవారిన దగ్గరనుండి ఆయన చుట్టే తిరుగుతున్నాను. ఆయన హారం సంగతి యెత్తనే లేదు.

"రేపు మనము వెళ్లిపోవాలి." అన్నారు పొడిగా. ఉత్సాహంగా కొత్త సంసారానికి కావల్సిన వస్తువులు సర్దుకుని, సాయంత్రం సుగుణమ్మ టీచరుకు చెప్పి రావటానికి వెళ్లాను. ఆవిడ ఇంటికి తాళం చూడగానే చెప్పలేని దిగులు వేసింది. హృదయ పూర్వకంగా ఆశీర్వదించే వ్యక్తి. ఆవిడను చూడకుండా వెళ్ళటం పెద్ద అపశకునంగా భావించాను. నిరాశగా ఇంటిదారి పట్టాను.

అమ్మ వంట ఇంట్లో బిజీగా వుంది. అక్కయ్య గదిలోకి పోబోయి ఆగిపోయాను. మా వారికి ఆగదిలో ఏం పని?

"ఈ అవకాశముకోసం ఉదయము నుండి చూస్తున్నాను శ్రీలతా. కాదవసు శంఖంలాంటి నీమెడకు ఇది .... ఈ శంఖుల హారం యెంతో బావుంటుంది."

"ఎవరయినా చూస్తే...."

"నేను దురుద్దేశంతో ఇవ్వటం లేదు,



యువ

## డిగ్రీ తరగతులలో బోధనా భాషగా తెలుగు అమలు

హైదరాబాద్, జూన్ 29: ఆంధ్ర ప్రదేశ్‌లో 1971-'72 విద్యా సంవత్సరము నుంచి డిగ్రీ తరగతులలో తెలుగు బోధనా భాషగా వుంటుంది. అయితే యింగ్లీషు







సౌందర్యాన్ని ఆరాధించడము తప్పా! ప్లీజ్ నా తృప్తికోసం '' అక్కడుండ లేక పోయాను. గది యెలా చేరానో, నాకే తెలియదు. హృదయము కుత, కుత లాడుతుంది. సౌందర్యాన్ని ఆరాధించటం తప్పుకాదు, కాని నా కళ్ళ ముందే నా భర్త, నాకు చిన్నతనము నుండి ప్రత్యర్థిగా నిలచిన అక్కను ఆరాధించటమా! అది అక్కకాదు, నా దాయాది! నాపాలిట శని! కపిగా పళ్ల కొరికాను వారిద్దరూ గదిలో నిలబడిన తీరు ఈ జన్మలో కాదు. మరో జన్మలో మరిచి పోలేను. మరిచి పోలేను. మరిచి అతనితో కాపురం చెయ్యటానికి నాలో గుండె వుంది కాని రాయిలేదు.

అందరికి కనిపించే బాహ్యరూపం తేడా వున్నా, స్పర్శ, హృదయము, ఆశలు, అనుభూతులు అందరిలాంటివే కన్నవారు నాజన్మకు జీవితాంతంఏడ్చారు. తోబుట్టువులు నా ఉనికిని అసహ్యించుకున్నారు. చేసుకున్నవాడు.... ఈ అవమానము చాలు. రేపు పిల్లలు పుడితే! ఆయనలా పుడితే నన్ను అసహ్యించుకుంటారు. నాలా పుడితే? ఏముంది నాలానే నరకయాతన అనుభవిస్తారు. ఇంతకంటే ...నేను ఈ లోకంనుండి వెళ్ళిపోవటమే ఉత్తమమైన మార్గము! ఓ నిర్ణయానికి వచ్చాను. నాన్నకు 'మైగ్రేన్' ఉంది. నొప్పివచ్చినప్పుడు మాత్ర వేసుకుని నిదురపొమ్మని డాక్టరు నిదర మాత్రలు యిచ్చాడు. నాన్న గదిలోకి వెళ్ళి సీసా తీసుకుని వస్తూ హాల్లోకి

తొంగి చూచాను. తమ్ముడు, వాళ్లు ముగ్గురూ పేక ఆడుతున్నారు. నా దృష్టి అక్కయ్య మెడలో నిలిచి పోయింది. ఆమె మరిదిగారు ప్రేమతో బహూకరించిన హారం వేసుకుంది. నాకు హారం రాసుకున్నట్టు అయింది. వాళ్ళాయన ముందుపరువు తీయాలి. నెమ్మదిగా వెళ్లి అక్కడ కూర్చున్నాను.

"అక్కయ్యా! హారం చాలా బాగుందే! యెక్కడిది?"

"ఉండవే .... సీక్వెన్స్ కలవక వస్తుందే...." అని కార్డు తీసుకుని, నా వైపు తిరిగింది.

"ఓ స్నేహితురాలు యిచ్చింది."

యెంత నటన! క్రీగంట మావారి వైపు చూచాను. ఆదుర్దాగా మా ఇద్దరినే గమనిస్తున్నాడు. చర, చరా అక్కడి నుండి వచ్చాను. ప్రతి నిముషం నాకు ప్రత్యర్థిగా నిలచిన అక్కయ్య బ్రతకాలెందుకు నేను చావడం దేనికి! ఆ క్షణంలో అసూయా, ద్వేషం, కసి నా అణువణువు ధ్వలనం చెయ్యసాగింది. మంచీ, చెడూ ఆలోచించే శక్తిని కోల్పోయాను. కర్తవ్యం ఆలోచిస్తూ క్రింది పెదవు కొరుకుతూ నిల్చున్నాను.

"జయలక్ష్మీ!" అమ్మ కేక విని వంట ఇంట్లోకి వెళ్ళాను. మినపసున్ని ఉండలు కడుతుంది

"నా చెయ్యి ఖాళీగా లేదు. వాళ్ళకు టీ కావాలట. కలిపి పెట్టవూ!" ఎంత మంచి అవకాశము! నాలోని రాక్షసత్వము ఒక్కుమ్మడిగా పైకి లేచింది. అక్కయ్యకు ఇప్పుడోయే కప్పులో ఒకొక్క నిదురమాత్రే జార విడిచాను. గుర్తుగా స్పూను పెట్టాను. అందరికి టీ ఇస్తుంటే చేతులు వణికాయి. అక్కడ ఉండలేక పోయాను.

"ఇది టీ పెడితే స్ట్రాంగుగా పెడుతుంది."

"బాగానే ఉందే." బావగారి మాటలు.

"నాకు చేదుగా ఉంది. ఒరేయ్ ఒక చంచాడు పంచదార పట్రారా!" అక్కయ్య తమ్ముడితో అంటుంది. అరగంట తరువాత అక్కయ్య గదిలోకి రావటం చూచాను.

"దినమంతా తిరుగుడు. రాత్రి పేక. తల తిరగదూ!" అమ్మ సనుగుడు వినిపించింది.

"పడుకోనివ్వు. రేపు ప్రయాణం పెట్టుకున్నారు." నాన్న మాటలు వినిపించాయి.

వారికేం తెలుసు, కొద్ది సేపట్లో అక్కయ్య శాశ్వత నిదురపోతుందని!. అక్కయ్య కొత్త సంసారానికి సర్దుకున్న సరంజామా చూచి పక్కున నవ్వాలనిపించింది. పిచ్చిగా గంతులు వేయాలనిపించింది. అందరూ భోజనాలు చేశారు. నేను చెయ్యలేకపోయాను. నాలోని మానవత్వము మెల్లగా, అతి మెల్లగా మేల్కొంది.

ఆలోచనలు సాగిపోతున్నాయి. తప్పు నాదా? పదే, పదే ప్రశ్నించుకున్నాను. జవాబు లేదు. కట కటాల వెనుక హాయిగా ప్రశాంతంగా ఉంది.

''జయా!'

తలెత్తాను. కట కటాల కవతల సుగుణమ్మ నిలబడి ఉంది. ఆ అమృత మూర్తికి ముఖం యెలా చూపను?

' జయా!''

''టీచర్!'' కట కటాలను పట్టుకు నిల్చున్నాను. నా కళ్లమ్మటి నీళ్ళు రావటం లేదు.

''యెంతపని చేశావు జయా!'

''అవును టీచర్ ఆ క్షణంలో నేను ఏం ఆలోచించ లేదు. అక్కయ్యను చంపింది నేనేనని పోలీసులకు చెప్పాను. నాకు ఉరి శిక్ష వేస్తారు.''

''వద్దు జయా. అంతమాటనకు.''

''నిజం టీచర్! మీరు పూజ చేస్తారు. ఏదీ ఆభగవంతుడు! అతనుకనిపిస్తే ఒకే ఒక ప్రశ్న అడగాలని ఉంది టీచర్: కురూపిగా పుట్టడం నాతప్పా? మీరయినా చెప్పండి టీచర్?'' అన్నాను ఆవేశంగా.

''ఏం చెప్పను! మీ నాన్నగారు లాయరును పెడతారట ...''

''యెందుకూ!'' న న్నాను. ఆయనతో చెప్పండి. వారిలో ఏపాటి సహృదయత మిగిలినా నన్నిలా వదిలేయమనండి. అక్కయ్యకు నాకు భేదాభిప్రాయాలు కలుగ జేసిందే ఈ తల్లి తండ్రులు! వారే ఈ అనర్థా లన్నింటికి కారణం! తమ సంతానాన్ని ఒకే దృష్టితో చూచే తల్లితండ్రుల వద్ద పిల్లలు ప్రేమాభిమానాలు నేర్చుకుంటారు ...''

''జయా! తప్పెవరి దయినాగాని, విమర్శించే అధికారం నీకు లేదు.''

''అవును. వారు నాకు జన్మనిచ్చారు. అదిలా సార్థకం అయింది.'' పేలవంగా నవ్వాను. యెటు చూచినా శ్రీలతే కన్పిస్తుంది. భారంగా సుగుణమ్మ టీచర్ కదిలింది.

''టీచర్!''

''ఏమిటమ్మా?''

''మీరయినా మీ సంతానాన్ని సమంగా చూడండి. వారిమధ్య అసూయా ద్వేషాలు రగల్చకండి. నా ప్రార్థన....'' అన్నాను. ఆమాట అనేటప్పుడు అప్రయత్నంగా కన్నీరు రాలింది. ఆమె జాలిగా నావైపు చూచి సాగి పోయింది. నేను కోర్టు తీర్పుకై వేచి యున్నాను.



# గాలి షికారు —————→ ఎం. ఎస్. మూర్తి

"శేషయ్యా!"

"ప్రభూ!"

"చల్లగాలికి అలా కాసేపు తిరిగివద్దాం వస్తావా?"

"ప్రభువుల మాటకి నే నెప్పుడేనా అడ్డు చెప్పానా!—పదండి—"

"ఎటువేపు వెడదాం?"

"తమ శలవ్—ఎటు వెళ్ళినా వెళ్ల వచ్చునండి—"

"కాలినడకను వెడదామా, కారులో వెడదామా."

"ఎలా వెళ్లినా వెళ్ళవచ్చునండి—"

"మళ్ళీ ఎంతసేపట్లో తిరిగి వద్దాం?"

"ఎంతసేపట్లోనైనా తిరిగి రావచ్చునండి—"

"పోనీ వెళ్ళడం మానేస్తే?"

"మానేస్తే మానెయ్యవచ్చునండి—"

"అయినా, కాస్సేపు అలా తిరిగి వస్తేనే మంచిదేమో."

"మంచిదే కావచ్చునండి—"

"అయితే వెడదామా?"

"వెడితే వెళ్ళొచ్చునండి—"

"శేషయ్యా! దేవికూడా మనతోబాటు షికారుకి వస్తుందేమో?"

"వస్తే రావచ్చునండి—"

"ఆవిణ్ణికూడా మనతోబాటు కాస్త అలా చల్లగాలిలో తిరగనీయడం మంచిదే కదూ."

"మంచిదే కావచ్చునండి—"

"అయితే మనం 'మేము షికారుకు వెడుతున్నాం—వస్తే రావచ్చును' అని దేవికి కబురు చెయ్యాలి కదూ?"

"చెయ్యవచ్చునండి—"

"మనం కబురుచేసిన పిమ్మట ఆవిడ వస్తే వస్తానంటుందీ, లేకపోతే రానంటుంది—అంతేకాదూ?"

"అంతేనండి—"

"వాస్తానంచే కూడా తీసుకు వెడతాం—?"

"అంతేనండి—"

"రానంటే తీసుకువెళ్ళం—ఏం?"

"అవునండి—"

"దేవికూడా వస్తే కారుమీద వెడితే బాగుంటుందా, కాలి నడకను వెడితే బాగుంటుందా?"

"ఎలా వెళ్ళినా బాగానే వుంటుందండీ—"

"అయినా కారుమీద వెడితేనే బావుందేలా వుంది; దేవి పాదాలు శ్రమకు అలవాటు పడినవి కావు—ఏమంటావ్ శేషయ్యా?"

"మీరు చెప్పింది నిజమేనండి—"

"రైట్! అయితే డ్రైవరుకి కబురు చెయ్యి, కారు తీసుకురమ్మని?"

"అతనింకా వచ్చివుండడండి—"

"ఎక్కడికి వెళ్లాడూ?"

"దేవిగారిని గాలి షికారుకి తీసికెళ్ళాడండి?"

# మాతృప్రేమ

గోపీచంద్

సుందర్రావు ఇల్లు వూరికి కొంచెం పెడగా వుంది. అలకా జనం వూళ్లో ఉండలేరు. కాబట్టి వూరికి పెడగా వున్న సుందర్రావు ఇంటిచుట్టూ జానెడు జానెడు స్థలాలు చౌక్కా కొనుక్కొని గుడిసెలు వేసుకొని కాపరం వున్నారు. ఊరు పెరిగినకొందీ వీళ్ళు తమ స్థలాలు అమ్ముకొని కొంచెం దూరంగా మళ్ళీ స్థలాలు చౌగ్గా కొనుక్కొని గుడిసెలు వేసుకొని కాపరం వుంటున్నారు. సముద్రం నురుగుని బయటకి కొట్టినట్టు వీళ్లని సంఘం ఎప్పటికప్పుడు బయటికి కొడుతూ వుంటుంది. నురుగు ఎట్లా అయితే సముద్రం అంచుల్ని వొదలకుండా వుంటుందో, అట్లాగే వీళ్లు తమను సంఘం ఎన్ని ఇబ్బందులు పెట్టినా దాని దాని అంచుల్ని పట్టుకొని వొదలకుండా వేళ్ళాడుతూ వుంటారు.

ఈ అలకాజనాన్ని చూస్తే సుందర్రావుకి కోపం, జాలి, భయం వేస్తూ వుండేవి. రోజుకి ఏ నలుగురైదుగురయినా కొట్టుకుంటూ వుండేవాళ్లు—కొట్టుకోవటం అంటే బండబూతులు తిట్టుకోవటం, కర్రల్తో బాదుకోవటం, వాళ్ల దెబ్బలాటలు కూడా సుందర్రావుకి విచిత్రంగా వుండేవి. ఒక క్షణం ఎంతో అన్యోన్యంగా నవ్వుతూ, పేలుతూ వుండేవాళ్ళు. మరు క్షణం కర్రలు తీసుకొని బుర్రలు యలక్కాయలకుమల్లే బద్దలు గొట్టుకుంటూ వుండేవాళ్ళు. మళ్ళీ ఆ క్షణం గడవగానే యథాప్రకారం నవ్వుతూ పేలుతూ వుండేవాళ్ళు. గొప్పగొప్ప మార్పులన్నీ క్షణాల మీద జరిగిపోతూ వుండేవి.

ఒకరోజు అతను ఇంటికి వొచ్చేటప్పటికి, తన ఇంటిపక్క గుడిసెలో కాపరం వుంటున్న అంజమ్మ నెత్తీ నోరూ కొట్టుకుంటూ ఏడుస్తూ కూర్చుంది. దానిచుట్టూ, చుట్టుపక్కల వున్న జనం అంతా జేరారు. దాని తలమీద గాయం తగిలి నెత్తురు కారుతూ వుంది. ఎవరికి చేతనైన సహాయం వాళ్ళు చేస్తున్నారు. సుందర్రావు వాళ్లదగ్గరకు వెళ్లి ఏం జరిగిందని అడిగితే ఈ విషయాలు తెలిసినై. అంజమ్మ కొడుకు తప్పతాగి వొచ్చి డబ్బు ఇవ్వమని అంజమ్మని అడిగాట్ట, అంజమ్మ ఇవ్వనన్నదట. వాడు కర్రతో అంజమ్మని బాది, అది మొగుడు పోయినప్పటినుంచీ కష్టపడి కూడబెట్టుకున్న పాతిక రూపాయలూ బలాత్కారంగా లాక్కొని వెళ్లిపోయాట్ట.

ఇట్లాంటి పనులు అప్పుడప్పుడూ సుందర్రావు ఇంటి చుట్టుపక్కల జరుగుతూనే వున్నాయిగాని అంజమ్మ వైఖరి అతన్ని ఆకర్షించింది. అంత బాధపడుతూ కూడా అంజమ్మ కొడుకుని పల్లెత్తుమాట అయినా అంటంలేదు. పైగా "వాడు తాగివున్నాడు, బాబూ! ఏ కారుకింద పడతాడో! ఏ పోలీసోడి చేతుల్లో పడతాడో! పోయి పట్టకరాండి బాబూ ? మీకు పుణ్యముంటాది" అని అందర్నీ కాళ్ళూ, గడ్డాలూ పట్టుకొని బతిమలాడుతూవుంది. "పోతే పోయాడ్లేవే!" అని ఒక పెద్ద మనిషి సలహా చెపితే, "నీకేం తెలుసు బాబూ ? కన్న కడుపు చేతులమీదగా పెంచాను" అని ఏడ్చింది. అంజమ్మకి కొడుకుమీద వున్న ప్రేమకి ముగ్ధుడయ్యాడు.

ఇంటికి వెళ్ళి ఈ సంగతే ఆలోచిస్తూ పడుకున్నాడు. మాతృప్రేమ ఎంత మహత్తరమైనది ? ఎంత నిష్కల్మషమైంది!! ఎంత పవిత్రమైంది!!! ఇలా ఆలోచిస్తూ వుండగానే అతనికి కునుకు పట్టింది....

టకటిక టకటిక అని ధ్వని సూట్‌లో వున్న ఒకమనిషి వొచ్చి అతని ముందు కుర్చీలో కూర్చున్నాడు. అతనికి ఒక కాలు లేదు—కొయ్యకాలు తగిలించి వుంది. మోటించి నడవటానికి చంకలో కర్ర వుంది. టక టిక టక అని మోత చేసేది ఆ కొయ్యకాలూ, ఆ చంకలో కర్రా.

అతను వొచ్చీ రావటంతోనే సుందర్రావుకి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చొని, "మీరు మీరేనా ?" అని అడిగాడు.

"అవును. నేను నేనే" అన్నాడు సుందర్రావు.

"మీరు నన్ను ఎరుగుదురా!"

సుందర్రావు ఎరగను అన్నట్లు తల వూపాడు.

"ఆహా! నన్ను ఎరక్కపోవటం ఏమిటి? ఆంధ్రదేశంలో నన్ను యెరగని వాళ్లు లేరే! ఆబాలగోపాలం ఎరుగుదురు" అన్నాడు. అంటూ చంకలోవున్న కర్ర తీసి, కుర్చీకి ఆన్చి పక్కనే పెట్టాడు. మెడ అటూ ఇటూ తిప్పి హై కొంచెం వొదులు చేసుకున్నాడు.

సుందర్రావు అతడు ఎవ్వరై వుంటాడా? అని ఆలోచిస్తూ వున్నాడు. ఇన్సూరెన్సు ఏజెంటా ? కమ్యూనిస్టా ? పుట్టగొడుగా ? ఇంతలో అతడే మళ్ళీ ప్రశ్న వేశాడు—"అయితే నన్ను ఎరగనంటావు?"

"ఎరగను."

"పోనీ ఒక సంగతి నీకు జ్ఞాపకం వుందా? ..ఒకడు వుండేవాడు....దొంగతనాలు చేసేవాడు....హత్యలుకూడా చేసేవాడు. వాణ్ణి పోలీసువాళ్ళు పట్టుకొని చేసిన పాపాలకు ఉరిశిక్ష వేశారు. వాడు జైల్లో వుండగా వాడి తల్లి "కొడుకా!




కొడుకా!" అంటూ రొమ్ము బాదుకుంటూ వాణ్ణి చూట్టానికి వొచ్చింది. వాడు తల్లిని రహస్యం చెపుతాను రమ్మని దగ్గరకు పిలిచి చెవి కసిక్కున కొరికాడు...."

"జ్ఞాపకం వుంది" అన్నాడు సుంద్రావు. అతని చిన్నతనంలో అంతా ఈ కధ చెప్పుకుంటూ వుండేవాళ్ళు.

"వాణ్ణి నేను" అన్నాడు. అని బిగ్గరగా నవ్వటం మొదలుపెట్టాడు. సుంద్రావుకి ఏమీ తోచలేదు. ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. ఏమి అనాలో తోచక, గుడ్లు వొప్పజెప్పి చూస్తూ వూరుకున్నాడు. అతడు నవ్వినవ్వి అకస్మాత్తుగా సీరియస్ అయిపోయి "తెలిసిందా?" అని అడిగాడు.

"అయితే నువ్వు...."

"స్మశానంలోనుంచి వొస్తున్నాను. ఇంకెక్కడనుంచి వొస్తాను. సమాధిలోనుంచి, మేఘానికిమల్లే, మాతృగర్భంలోని పిల్లవాడికిమల్లే, లేచివస్తున్నా. ఇవ్వాళే ఈ వూరు చైర్మన్ చచ్చిపోయాడు. వొస్తూ వొస్తూ అతని సూట్ వేసుకొని వొచ్చాను. ఎందుకనోగాని నీ దగ్గరికి సూటుతో రావాలనిపించింది."

"ఏం పని?" అని అడిగాడు సుంద్రావు.

"పని వుంది. నాకీ ప్రపంచంలో ఒక్కమనిషితో పనివుంది. ఆ మనిషి కోసం వెతుకుతున్నాను. నా కథ రాసిపెట్టే మనిషి నాకు కావాలి. అందుకు ఎంతమంది దగ్గరకు వెళ్ళాను అనుకున్నావు? రాత్రికి ఒకళ్ళదగ్గరికి చొప్పున

వెళ్తున్నాను. ఏదో తల్లి చెవి కొరికానని తప్ప నా పూర్తికథ అందరికీ తెలియదు. అందరికీ తెలిసేటట్టు చెయ్యాలని నా కోరిక. వ్రాసిపెట్టమని చాలమందిని అడిగాను.''

''ఏమన్నారు?''

''కొంతమంది నా కథలో కథావస్తువు లేదన్నారు. కొంతమంది నా కథలో సస్పెన్సు లేదన్నారు. కొంతమంది క్లయిమాక్స్ లేదన్నారు. కొంతమంది ఏమీ చెప్పకుండానే ఇది కథగా రాయటానికి వీల్లేదు అన్నారు. తిరిగి తిరిగి నీ దగ్గరకు వొచ్చాను.''

''నాకుమాత్రం చాత నవుతుందని నువ్వు ఎట్లా అనుకున్నావు?''

''ఈ ప్రశ్నకు అతనిమొహం విప్పారింది. చేత్తో మీసాలు సర్దుకొని, కుర్చీ కొంచెం ముందుకు లాక్కొని. ఏదో పరమరహస్యం చెపుతున్నవాడికిమల్లే చెప్పాడు—కారణం వుంది, ఆ చైర్మన్ చెప్పాడు. వొచ్చినరోజే తన సమాధిలో కూర్చుని నిన్ను నోటికి వచ్చినట్లు తిడుతున్నాడు. బతికివున్న రోజుల్లో అతనిమీద నువ్వేదో కథ రాశావటగా! నీ కథలో కథావస్తువే వుండదట! సస్పెన్సే ఉండదట! క్లయిమాక్స్ పెట్టటం అసలు నీకు చేతగాదట! ఇవన్నీవింటూ వుంటే నాకు చాలా సంతోషం వేసింది. నాకు తగ్గవాడు నేటికి దొరికాడు అనుకున్నాను. రయ్యిన బయలుదేరి వొచ్చేశాను—నీ దగ్గరికి.... మరి నా కథ వింటావా?''

''చెప్పు'' అన్నాడు సుందర్రావు. అతనికియ్యాడా అతని కథ వినాలని కుతూహలంగా ఉంది.

అతడు మొదలు పెట్టాడు.

''మా అమ్మకీ నాన్నకీ నేనే సంతానం. మా అమ్మకి నేనంటే చాలా గారాబం. నన్ను కిందకు దింపకుండా పెంచింది. నాకు చిన్నతనంలో చాలా జబ్బులు చేస్తూవుండే వట. దీనికి మా అమ్మే కారణం 'అని మా నాన్న నేను పెద్దవాణ్ణి అయింతర్వాతకూడా తిడుతూ వుండేవాడు. ఎప్పుడూ చేతుల్లో పెంచటం, కిందికిదిగి ఆడుకోనివ్వకపోవటం, నేను కావాలన్నదల్లా కొని ఇవ్వటం, బలవటం లేదని కాకిమీదా కుక్కమీదాపెట్టి వొద్దని ఏడుస్తున్నా వినకుండా, మరిపించి అన్నం పెట్టటం ఇవన్నీ నా అనారోగ్యానికి కారణం అనీ, నా జీవితాన్ని నాశనం చేసింది, మా అమ్మే అని మా నాన్న ఆమెను తిడుతూవుండేవాడు. అప్పుడు ఆయన మాటలు నాకు అర్థం అయ్యేవి కావు. మా అమ్మకి నేనంటే ఉన్న ప్రేమా, ఆవిడ నన్ను పెట్టేగారాబం చూస్తూవున్న నాకు మా నాన్న మాటలకు చాలా కోపం వొచ్చేది. నాకు చిన్నబిడ్డ గుణం వొచ్చింది. ఇదిగో చూడూ, వొళ్ళంతా కాల్చారు దీని క్కూడా మా అమ్మే కారణం అంటూ ఉండేవాడు.

నాన్న.

కాని మా అమ్మ ఆయనమాటలను లెక్కపెట్టేదికాదు. ఆయన అనేది అంటూనే ఉండేవాడు. ఆమె చేసేది చేస్తూనే ఉండేది.

నేను కొంచెం పెరిగిన తర్వాతకూడా వాళ్ళిద్దరూ నా విషయంలో పోట్లాడు కుంటూనే ఉండేవారు. మా నాన్న నన్ను బళ్ళోకి వెళ్ళమని కొడితే, అమ్మ ఓర్చుకో లేక కళ్ల వెంట నీళ్ళు పెట్టుకుంటూ "వాణ్ణి మీరు బతకనివ్వరు" అని పోట్లాడేది. నాన్న బయటకు వెళ్లగానే అవీ ఇవీ కొనిపెట్టి "బళ్ళోకి వెళ్లకపోతే పోన్లే నాయనా, ఇంట్లోనే ఉండు" అని బుజ్జగించేది.మా నాన్నసాయంకాలంవచ్చి అడిగితే బడికి వెళ్లివొచ్చానని చెప్పేది. ఇప్పటిదాకా చదువుకొని ఇప్పుడే కన్ను మూశాడు, అనికూడా చెప్పేది. ఇట్లా జరుగుతుండగా నాన్న కాలంచేశాడు."

అతను కథ చెప్పే పద్ధతి సుందర్రా వుకి నచ్చలేదు. అసలు కథకూడా అతనికి ఏమంత బాగాలేదు. అయినా చేసేదిలేక వింటున్నాడు.

"ఇంకేముంది? నాన్న చచ్చిపోగానే నాకు స్వరాజ్యం వొచ్చింది. చేతినిండా డబ్బువుంది వంట్లో సత్తువవుంది. అప్పుడు ఇట్లా ఉండేవాణ్ణా? బజార్న నడుస్తుంటే ఆడవాళ్లు వాకిళ్ళలో నిలబడి ఏం చూసే వారు? కొద్ది కాలంలోనే నాకు చెడు సావాసాలూ, దురభ్యాసాలూ ఎక్కు వైనై. ఒక్క తాగుడేనా? ఒక్క ముండలేనా? — సమస్తం అలవాటు పడ్డయ్....డబ్బు విచ్చలవిడిగా ఖర్చు పెట్టటం సాగించాను. నేను ఎక్కడ కష్టపడతానో, కోపం వచ్చి ఏంచేసు కుంటానో అని అమ్మ కూడా ఏమీ అనేదికాదు. ఎవ్వరయినా, ఏమైనా చెప్పినా "అంతా వొట్టిది-నా బిడ్డబంగా రం - గిట్టనివాళ్లు వేసేమాటలు" అని పోట్లాడేది. లోలోపల మాత్రం "పెళ్ళి అయితే వాడే బాగుపడతాడు" అని సమాధానపరుచుకుంటూ వుండేది. ఈ వుద్దేశంతోనే నాకు పెళ్ళి చేసింది. నేను మొదట్లో పెళ్ళి చేసుకోనని చాలా పట్టు పట్టాను ఎందుకంటే అప్పటికే నా వొళ్లంతా గుల్ల అయింది, నేను ఎంత చెడ్డా అప్పటికి ఇంకా నాలో మానవ స్వభావం పూర్తిగా నాశనం కాలేదు. నేను ఎన్ని చెప్పినా నామాట అమ్మ వినలేదు, "నేను పెంచాను — పెద్దవాణ్ణి చేశాను. నీమీద కళ్లుపెట్టుకొని బతుకుతున్నాను. అని ఆమె బతిమలాడుతూవుంటే నేను ఆమె మాటకు ఎదురు చెప్పలేకపోయాను. లొంగిపోయాను. ఆమె సుఖంకోసం, ఆమెను తృప్తిపరచటానికి పెళ్ళిచేసున్నాను.

కాని నా పెళ్ళి అయింతర్వాత ఏమి అయిందనుకున్నావ్? నా భార్య కాప రానికి వొచ్చిందగ్గరనుంచీ దాని పొత్తు మా అమ్మకు గిట్టేదికాదు. దాన్ని చూస్తేనే చురచుర లాడేది. చీటికీ మాటికీ కజ్జా

పెట్టుకునేది. నా భార్య చాలా మంచిది. మా అమ్మ ఏమన్నా ఎదురు చెప్పేది కాదు. అయినా మాఅమ్మ దాన్ని మంచానపెట్టి రంపానకోసేది. మే మిద్దరం కలసివుంటే సహించేదికాదు. ఏదో వంక పెట్టి దాన్ని పిలిచేది—చడపడా తిట్టేది. నేను ఇంటికి రాగానే దానిమీద నానా పితూర్లూ చెప్పేది.

నేను మొదట్లో మా అమ్మ మాట లన్నీ నమ్మాను. దాన్ని అనేక సార్లు కొట్టాను. చివ్వరికి ఇంటిలోనుంచికూడా వెళ్ళగొట్టాను. అప్పుడు మా అమ్మ ప్రవర్తనాకు అర్థం కాలేదు. తరవాత తరవాత ఆలోచించుకుంటే తెలిసింది. కాని ఏమిలాభం! అప్పటికిఅవాల్సిం దంతా అయిపోయింది'' అని ఒక్క నిట్టూర్పు విడిచాడు.

సుందర్రావు వింటూ కూర్చున్నాడు. అతను కొంచంసేపు వుండి "మా అమ్మ ప్రవర్తనలో మార్పుకి కారణం ఏమిటం టావ్!' అని అడిగాడు సుందర్రావుని.

"నేనేం చెపుతాను? నువ్వేచెప్పు!'' అన్నాడు సుందర్రావు.

"కారణం ఉంది. అప్పట్లో నాకు తెలియదు. యదార్థం కాకపోతే నామీద ఇంత ప్రేమగా వుండే అమ్మ ఇవన్నీ ఎందుకు చెపుతుంది? అనుకున్నాను కాని కారణంవేరు.''

"ఏమిటి?''

"అప్పటిదాకా నన్ను మా అమ్మ తన సొంత ఆస్థిగా చూచుకునేది. నేనూ, తనూ అంతే అనుకునేది. కాని అక స్మాత్తుగా మరొకమనిషి, కొత్తమనిషి, కనిపెంచని మనిషి, నా నా జీవితంలో భాగం పంచుకోవడం మొదలు పెట్టేటప్ప టికి ఆమె ఓర్చలేక పోయింది. నా భార్య తన్నేదో అన్యాయం చేస్తున్నట్టు తన వస్తువుని దొంగిలిస్తున్నట్టు బాధపడింది. దాన్తో నా భార్యమీద కోపం. వైరం పెంచుకుంది. ఆమెకు తెలియకుండానే మారిపోయింది. ఆమె మాతృప్రేమే దీనికి కారణం.'' అని కర్ర చేతిలో తీసుకొని వొకసారి నేలనుకొట్టి పైకి సర్దు కొని కూర్చున్నాడు. కాలం గడిచిపోతూ వుంది. కాని అతడు ఇక మాట్లాడదలచి నట్టు కనపడలేదు. అలాగే కూర్చు న్నాడు.

"తరువాత ఏమయింది?'' అని అడి గాడు సుంద్రరావు.

అతడు వులిక్కిపడి సర్దుకొని ఇలా చెప్పాడు. "ఇక అవటానికి యేముంది? నా భార్య వెళ్లిపోయిం తర్వాత నావని మరీ అధ్వాన్నమయింది. తాగుడూ, తిరు గుడూ ఎక్కువైనై. కొద్దిరోజుల్లోనే ఇల్లంతా గుల్ల అయింది. దొంగతనాలు మొదలు పెట్టాను. చివరికి పోలీసులు నన్ను పట్టుకోవడం ఉరి శిక్ష వెయ్యటం మీ కందరికీ తెలిసిందే! నేను జైల్లో వుండగా అమ్మ నన్ను చూట్టానికి వొచ్చింది. హృదయం తరుక్కుపోయే టట్టు ఏడ్చించి. కాని నాకు ఆమెమీద జాలి కలగలేదు. నా స్థితికి ఆమే—ఆమె మాతృప్రేమే—కారణం అని అప్పటికి నాకు నమ్మకం కలిగింది. రహస్యం చెబుతాను రమ్మనమని దగ్గరకు పిలిచాను. చెవి కసిక్కిన కొరికాను.''



''ఏమో!''

మళ్లీ అతడు మాట్లాడకుండా కూర్చు న్నాడు. కొంచెంసేపు అయింతర్వాత నెమ్మదిగా లేచి కర్ర చంకకింద పెట్టి ''మరి నా కథ రాస్తావా?'' అని అడిగాడు.

''ఇదేనా కథ'' అని అడిగాడు సుంద ర్రావు.

''ఇదే. ఏం? కథకి పనికిరాదూ?'' అని అతడు తీక్షణంగా చూసి అడిగాడు.

''ఎట్లా ఇది కథగా రాయటం?''

టకటక శబ్దం చేసుకుంటూ రెండు అడుగులు ముందుకు వేసి ''ఏం? ఇందులో సస్పెన్సు లేదూ? క్లయిమాక్సు లేదూ? డ్రెమెటిక్ బిగినింగ్ లేదూ? లేక పోతే పెట్టు. నీ యిష్టవచ్చిన వన్నీ పెట్టు. కాని కథరాయి. మాతృప్రేమలో పవిత్రం కానీ, ఔన్నత్యం గాని, స్వార్థం గానీ, లేక పోవడంగానీ, ఏమీలేదని లోకానికి చాటు. అది పశులక్షణమని బోధించు. అది అగ్నికంటే భయంకరమైందనీ, అందర్నీ ప్రేమించే వాళ్ళనీ, ప్రేమకు గురి అయిన వాళ్ళనీ అందర్నీ నాశనం చేస్తుందనీ చెప్పు. ఏం? కథ రాస్తావా?''

సుందర్రావుకి అతన్ని చూస్తే భయం వేసింది. కోపంతో అతను వొణికిపోతు న్నాడు. కళ్ళు యెర్రబడ్డాయి. అదంతా చూచి ''రాస్తాను'' అన్నాడు సుందర్రావు.

''సెభాష్! నువ్వు మంచివాడివి'' అని అతను సుందర్రావు వీపు తట్టాడు. సుందర్రావు నిద్రనుంచి ఉలిక్కిపడి లేచాడు. పక్కగుడిసెలోని అంజమ్మ 'కొడుకా! కొడుకా!' అని యింకా ఏడుస్తూనేవుంది.

# సెప్టెంబరునెల

# భావపరిచయ పోటీ



**బహుమతి పొందిన వ్యాఖ్య**

ఆ॥వె॥ కండబలము కొరకు కసరత్తులను చేసి
చిట్టి ఎలుకజూచి చిందులేల
ఆరునెలలు సాము అవ్వను గొట్టనా?
విశ్వదాభిరామ వినురవేమ:

—కొమ్మూరి నారాయణరావు, బి.ఏ.,
చింతపల్లి.

# తాగితే తప్పేముంది?

కొడవంటి కాశీపతిరావు

పార్థసారధికి ఏ రకమైన అలవాట్లూ లేవు. ఓ సిగరెట్టు త్రాగడు...ఓ సినిమా చూడడు....ఓ పిసరు వక్కపొడైనా వేసుకోడు. ఇది అందరికీ తెలిసిన విషయం.

అయితే పార్థసారధిమాత్రం నాకింత మంచి అలవాట్లున్నాయని చాటుకోడు. దానిక్కారణం తన వ్యక్తిత్వం కాదని.... తనకున్న పెద్ద భయమే తనకీ చెడ్డలవాట్లూ అంటకుండా చేసిందని పార్థసారధి నమ్ముతాడు

పార్థసారధి సుమారు పదిహేనేళ్ళవాడై వుండగా అతని తండ్రి చచ్చిపోయేడు. మామూలుగా కాదు ...ఓ సంవత్సరంపాటు టీబీతో తీసుకుని, పార్థసారధికి ఇరవయ్యేళ్ళ వయసులో అతని పెద్దన్నయ్యకి టీబీ ఎటాకైంది. మరో రెండేళ్ళకి పెళ్ళిచేసుకుని ఎక్కడో దూరానున్న అతని అక్కచెల్లెలు కూడా టీబీతో తీసుకుంటున్నట్టు పార్థసారధికి తెలిసింది.

అంటే తన రక్తంలో ఆ లక్షణాలుండి ఉండవచ్చుననీ, అది ఎప్పుడో తను ఏమరుపాటుగా వున్నపుడు తనమీద ఉరుకుతుందనీ అతని భయం. అంచేత ఆ జబ్బు తనమీద పడకుండా పార్థసారధి జాగ్రత్త పడుతున్నాడన్నది అతనికి మాత్రం తెలిసిన విషయం.

ఈ సంగతెవరైనా తనతో చర్చిస్తే పార్థసారధి తన భయం చెప్పేవాడే. అయితే ఎవ్వరూ నువ్విలాంటి మంచి అలవాట్లు ఎందుకు చేసుకున్నావని అడగరు, అంచేత అతను చెప్పలేదు.

తన మంచి అలవాట్లు గొప్పగా చెప్పుకోక పోవటానికి, సరిగ్గా వాటికి వ్యతిరేకంలో ఉండే అతని తత్వంకూడా కారణం కావొచ్చు. మనిషన్నవాడు ఆరోగ్యంగా వున్నంతకాలం అన్నీ అనుభవించాలని పార్థసారధి అనుకొంటూ వుంటాడు.

సిగరెట్టు తాగితే ఏదో హాయి లేకపోతే, సినిమా చూస్తే ఏదో రిక్రియేషన్ రాకపోతే, వక్కపొడిలో ఏదో స్టిమ్యులేషన్ ఉండకపోతే మనుషులెందుకని అలవాటు చేసుకొంటారు? నిజంగానే వాటిల్లో థ్రిల్ ఉంది. అయితే ఆ అలవాట్లనీ ఓ హద్దుల్లో ఉంచుకుంటే అవి మనకి మంచిని చేస్తాయ్.

ఇంట్లో అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లూ ఉన్నపుడు ఇలాంటి టాపిక్ వస్తే ఈ విషయాలే చెప్పేడు పార్థసారధి. అంతేకాదు. బ్రాందీలాంటి పానీయాలు కూడా జీవితంలో పుచ్చుకుంటేనే జీవితం సారవంతంగా ఉంటుందని, బ్రాందీ కూడా మెడికేటెడ్‌గా తీసుకుంటే ఆరోగ్యానికి

మంచిదని, పెద్దన్నయ్య అది పుచ్చుకుంటే మంచిదనికూడా వాళ్ళడక్కుండానే తన అభిప్రాయాలు చెప్పేడు పార్థసారథి.

"తమ కుటుంబాల్లోనే లేని వెధవ బుద్ధి, పోగాలం వీడి కెలా వచ్చేయ్ చెప్మా....తప్పబుట్టేడు వెధవ." అన్నా రంతా.

పురుగును చూసినట్టు చూసేరు.

ఇంకా తన వాదనను బలపర్చుకో బోతే, "ఒరేయ్....ఆట్టే వాగకు. తాగు తావో,తందనాలాడతావోనువ్వుచేసుకో.... అవి మాక్కూడా ఎందుకు చెప్తావ్." అంటూ చీదరించుకున్నారు.

"అదిగో అక్కడే పొరబడుతున్నారు మీరు. సినిమాలు చూసీ, నవలలు చదివీ తాగుడంటే దేవదాసు తాగినంతగా చిత్రించుకుంటున్నారు. పైగా మీ జీవి తాల్లో ఎదురైన కొద్దిమంది ఈ అలవాటు చేసికొని, అది వదులుకోలేక, త్రాగలేక కుడితిలోపడ్డ ఎలకల్లాగా త్రాగుబోతు లుగా మారి ఉండవొచ్చు. వాళ్ళలా ఒళ్ళూ, ఇల్లూ గుల్లచేసుకొని త్రాగమంటం లేదు నేను. అలవాటు హద్దుమీరకుండా మనస్సు నిగ్రహించుకుని, ఆరోగ్యానికి తాగితే మంచిదేగాని తప్పేం లేదంటున్నాను."

"ఛీ....అప్రాచ్యపువెధవా" అనుకుని పార్థసారథి ఉన్నచోటంతా ఫినాయిలుపెట్టి కడిగించుకున్నారు. వీడెప్పుడో అలాంటి రకాల్లో కలిసిపోతాడని అనుకున్నారు ఇంటివాళ్ళంతా.

పార్థసారథి అలవాట్లూ, అభిప్రాయాలూ మాత్రం మారలేదు. అభిప్రాయాల్ని ఆచరణలో పెట్టటానికి అలవాట్లు మార్చుకోనూ లేదు. అయితే వీళ్ళందరూ తప్పనుకునే ఈ తాగుడు ఒప్పని తనలో ఏ ఒక్కరైనా ఏకీభవిస్తారని పార్థసారథి నమ్మకం.

జబ్బు భయంవల్ల ఏ దనుభవించ టానికీ వీల్లేక పోతూండటంవల్ల, ఇలా కాదని మెడికల్ చెకప్ చేయించుకున్నాడు పార్థసారథి. కాని చెస్ట్‌లో అతనికి టీబీ ప్రారంభదశలో ఉందన్నమాట వినగానే బాగా బెదిరిపోయాడు. అయితే జాగ్రత్త కలవాడు కాబట్టేను, టీబీ ఈ రోజుల్లో ఓ పెద్ద జబ్బుకింద లెఖ్ఖ కాకపోవటం వల్లనూ, ధైర్యం తెచ్చుకుని మందులు 'తిని' నయం చేసుకున్నాడు. తన ఆరోగ్యంమీద మాత్రం అసంతృప్తి పోలేదు. దానిక్కారణం తన స్నేహితుల్లో కొందరు బ్రాందీ మెడికేటెడ్‌గా పుచ్చుకోమనీ, అలా చేస్తే ఆకలిపుట్టి మంచి ఆహారం పుచ్చుకుంటావనీ, త్వరలోనే "యాపిల్ పండు"లా తయారవుతావని ఊరించ టమూ, దానికి తన ఇంట్లో స్థానం లేక పోవటమూను.

ఈ సందిగ్ధావస్థలో ఉంటూండగానే పార్వతితో పెళ్ళయింది. తన భర్తకి సిగ రెట్టు కాల్చడంలాంటి అలవాటుండాలనీ, తాను అది సాకుగా తీసుకుని అలకలు పోతుండాలనీ పెళ్ళిగాకముందు పార్వతి

పరదాపడుతుండేది. పార్థసారధి కెలాంటి అలవాట్లూ లేకపోవడంవల్ల మొదట నిరుత్సాహపడినా, అలగటానికీ.... అలు కలు తీర్చుకోటానికీ చాలా మార్గాలు కన్పించడంవల్ల తాత్కాలికంగా ఆ సంగతి మర్చిపోయింది పార్వతి.

సంవత్సరం తిరిగే సరికి మూడోనెల న్నారు. ఆరోనెల వచ్చేసరికి పార్వతి చాలా నీరసించి ఉండటంచూసి డాక్టరు దగ్గరకు తీసుకెళ్లాడు పార్థసారధి. ఇంటి కొచ్చింతర్వాత, పార్వతి బ్రాందీ మెడికే షెడ్‌గా పుచ్చుకోవాలనీ లేక పోతే పురుడుకు చాలా కష్టపడాల్సి వస్తుందనీ డాక్టరమ్మ చెప్పినట్టు చెప్పేడు పార్థసారధి.

దానికి కస్సుమని లేచింది పార్వతి.

"ఆ పేరెత్తితేనే నాకు పరమ అసహ్యమంటాను. ఆవిడగారు చెప్పిం దంటే చెప్పింది. నాతో చెప్పటానికి మీ కెలా ముఖం చెల్లిందనీ...." అంది ఆదేదో ఘోరమైన తప్పిదంలా.

"అదికాదే పిచ్చిపిల్లా.... ఇంకా ఇక్ష్వా కుల కాలంలా మాట్లాడతావేం? బ్రాందీ శరీరానికి వేడిమినిస్తుంది, ఆకలి పుట్టి స్తుంది. నువ్వు ఇప్పుడు బలంగా లేక పోతే రేపొద్దున్న మన బాబు బలంగా ఉండనూ ఉండడు .... నువ్వూ చాలా నీరసించి పోతావు. అంతగా కావాలంటే కంపెనీకి నేనుంటాను. నువ్వో స్పూనూ, నేనో స్పూనూ త్రాగుదాం" అన్నాడు పార్థసారధి సాదాగా.

పార్వతికి పెద్దపాయింటు దొరికేసింది కోతికి కొబ్బరికాయ దొరికినట్టు.

"అలా చెప్పండి తమరికి తాగాలనుందో, లేకపోతే ఇంతకు ముందే ఏ మాత్రం అలవాటుందో 'కంపెనీ'కి వేసుకోవడం .... ఈ రూపంగా కోరిక తీర్చుకుందామని మీ ఆశ..." అంది పార్వతి.

"ఛీ ...నా కలాంటి అలవాట్లులేవు. సిగరెట్టయినా ముట్టుకోలే దింతవరకూ."

"ఆఁ ఇక్కడి కబుర్లు చెప్పకేం. ఏ ఫ్రెండో అఫర్ చేస్తే తాగకుండా ఉంటారా ఈ మగవాళ్ళు....ఏదో నాకోసం పాపం శ్రమపడి పోయినట్టు...పెళ్ళాల దగ్గర తియ్యతియ్యగా మాటాడుతారుగానీ ..." అంది పార్వతి. "నిజంగా నీకోసమే చెప్తున్నాపారూ...." అనిపించుకోవాలని పార్వతి ఆశ.

"సంవత్సరంబట్టి కాపరంచేస్తున్నా గ్రహించలేదంటే నీ ఖర్మ. తాగితే తాగుతాను. ఆరోగ్యానికి తీసుకుంటే తప్పేమీ లేదు. ఏదో నీ ఆరోగ్యానికి నువ్వు తీసుకుంటే బాగుంటుందని చెప్తే ఇంత సాధించావు...." అని అప్పటికే పార్వతి కోసం తెచ్చి ఉంచిన సీసాలోంచి ఓ స్పూను నోట్లో వేసుకున్నాడు పార్థసారధి. తరువాత ఆ సీసా బీరువాలో పెట్టేసి....తాళాలు పార్వతికే ఇచ్చేశాడు.

పార్వతేం అనుకుందోగానీ, అప్పటికి

మరేం మాటాడలేదు.

ఓ నెలరోజులు తిరిగేసరికి పార్థసారథి యాపిల్‌పండులా అయితే తయారవలేదుగానీ, ఆరోగ్యంగా మాత్రం కనిపించేడు పార్వతి కళ్ళకి. డాక్టరమ్మగారు బ్రాందీ తీసుకుంటున్నారా అని పార్వతి నడిగితే తలూపేస్తూంది. "ఈ నెల్లాళ్ళలో మీరు బాగా తయారవ్వవలసింది మీవారు బాగా తయారయ్యేరేవిటి కథ..."అని ఓ రోజు డాక్టరమ్మగారు నిలదీసేసరికి పార్వతికి చెప్పక తప్పిందికాదు.

"అదేమిటిపార్వతిగారూ చదువుకున్నవారు మీరే బ్రాందీ తాగడం తప్పనుకుంటే ఎలా? అయినా మీరుట్టిమనిషి కాదు కాబట్టి తాగమన్నాను కాని లేకపోతే అది ప్రిస్క్రైబ్ చేస్తానా? భలేవారే మీరు! రేపోమాపో పురుడువచ్చినపుడు కొంప దీసి అల్లరి పెడతారా ఏం?" అంటూ మెత్తమెత్తగా చీవాట్లు వేసింది డాక్టరమ్మగారు.

పార్వతి నీరసంగా ఉండటంచేత త్రిప్పటగా ఉంటుందని, తనే యింటికి వస్తున్న డాక్టరమ్మకి ఈ కొద్దికాలంలో అలాటి చనువు వచ్చింది. ఇకనుండి అది పుచ్చుకోపోతే తను ట్రీట్ చెయ్యటంవల్ల కాదని ఆఖరి అస్త్రం ప్రయోగించి లేచి వెళ్ళిపోబోతూంటే పార్థసారథి వచ్చేడు.

"మీ మెసెస్ కెలానో నచ్చచెప్పి పట్టించాలన్నానుగానీ, మిమ్మల్ని పుచ్చుకోమన్నానా నేను? ఇప్పటికే చాలా ఆలస్యమైంది. కనీసం ఇవాళ్టినుండైనా ప్రారంభించేట్టు చూడండి. అది మీ డ్యూటీ—" అంటూ వెళ్ళిపోయింది డాక్టరమ్మ.

అది విన్నాడో లేదో కానీ కుర్చీలో కూలబడ్డాడు పార్థసారథి. ఇంక డాక్టరుగారి ఆదేశానుసారం ఎక్కడ పురాణం విప్పుతాడోనని తప్పించుకోవడానికి అతికష్టంమీద వంటింట్లోకి వెళ్ళిపోయింది పార్వతి.

తిరిగి కాఫీ కప్పుతో వచ్చిన పార్థసారథి ఇంకా అలా కుర్చీకి అతుక్కుపోయి వున్నాడు. అదోలా ఉన్నాడని అప్పటికి గ్రహించింది పార్వతి.

"ఏవిటండీ...అలా వున్నారేం?"అని పార్వతి అడగటమే తరవాయి, బాధంతా బయటికి కక్కేసాడు పార్థసారథి.

ఆంతకు ముందురోజు ఆ వూరు వచ్చిన ఒక ఆఫీసరు గౌరవార్థం పుర ప్రముఖులంతా ఆవేళ "విందు" ఏర్పాటు చేసారు. పార్థసారథి ఆ వూళ్ళో అంతో ఇంతో ప్రముఖుడే గాబట్టి అతన్ని ఆహ్వానించడంవల్ల వెళ్ళక తప్పిందికాదు. నాన్ వెజిటేరియన్ చూసి మొదట జంకేడు. జబ్బులో ఏదో తీసుకునేవాడు తప్ప పెద్ద అలవాటేమీ లేదతనికి. పైగా అక్కడ చూస్తే రకరకాల ఎన్.వి డిషెస్ ఉన్నయ్. అవి చూసి నోరూరడం వల్లనూ, అన్నిరకాల పదార్థాలు తింటే తనకు పడదేమోనని భయం వున్నా



పెద్దలమధ్య తినను అనడం బాగోదేమో ననీ, అన్ని రకాలూ అనుభవించడం ఆతని తత్త్వం కావడం మూలాన పార్టీ లాగించేసేడు పార్థసారధి.

అంతటితో పార్టీ అయిపోతుం దను కున్న పార్థసారధికి తరువాత 'వెట్‌పార్టీ' కూడా ఉందని తెలిసి గతుక్కుమన్నాడు. ఆ వెంటనే అతనికి కోపం కూడా వచ్చింది. ఇలాంటి పార్టీలకు పిలిచేటప్పుడా గెస్ట్‌లకు అలవాటందో లేదోనని ఆలో చించుకుని పిలవాలిగానీ బలవంతాన ఇలా పార్టీ ఏర్పాటు చేయడమేమిటి? ఈ కోపాన్ని పెద్దల ముందు కక్కలేకపోవడం వల్ల ఆ కోపం గొంతులోనే దిగమింగు కోవడంతో ముఖం ఎట్లాగో అయి పోయింది పార్థసారధికి.

రెండు రౌండ్సు తిరిగినా ఒక్క పెగ్గూ ముట్టుకోని పార్థసారధిని విషాలో ఉన్నవాళ్ళు పుచ్చుకోమని బలవంతం చేసేరు. ఆ మాత్రం ఈ మాత్రం చను వున్న ఓ పెద్దమనిషి పార్థసారధి నోటి కూడా అందించబోయాడు. అప్పటికి పార్థసారధి కోపం భళ్ళున పగిలి పోయింది .. ఆ పెద్దమనిషి చేతిలోని సీసా లాగేశాడు.

"పార్టీ అంటే ఏదో నాలుగయి దయి టమ్సుతో ముగుస్తుందని నేను అను కున్నాను గానీ....దాని తర్వాత ఈ వెట్

పార్టీలూ, ఆపైన ఇంకా ఇంకా చెక్కభజనలూ ఉంటాయనుకోలేదు. ఫర్ ది హెల్తాఫ్ అని చెప్పి ఆరోగ్యం పాడు చేసుకునే ఈ పార్టీల లక్ష్యం పెదతోవలు పట్టించడమే అని తెలిస్తే రాకనేపోదును. పెగ్గుమీద పెగ్గు పట్టింది ఇలా అసహ్యకరంగా సభ్యత మరిచిపోయిన మీ ముందు నుండి విందు మధ్యలో వెళ్ళిపోవడం అసభ్యత అని నేను తలచడం లేదు.... వస్తాను....గుడ్ బై...'' అని చెప్పేసి బయటికి రాబోయిన పార్థసారధికి, అప్పటికింకా ఒకటి రెండు మెట్లమీదే ఉన్నవాళ్లు క్షమాపణలు చెప్పుతున్నారు.

ఇదంతా విన్న తర్వాత పార్వతికి పార్థసారధి ఎంతో ఉన్నతుడిగా కన్పించేడు. అతని తత్త్వంగూడా అర్థం అయింది.

కాఫీ గొంతులో దిగింతర్వాత పార్థసారధిలోని ఆవేశం కరిగిపోయింది. మామూలు పార్థసారధిని చూసి అప్పుడు మొదలెట్టింది పార్వతి...''పోన్లెద్దురూ... అవన్నీ మర్చిపొండి....సరేగాని డాక్టరమ్మగారు మెడికేటెడ్‌గా పుచ్చుకోమంటున్నారుగదా .... మంచిదేనంటారా? తప్పేమీ లేదూ....''

పకపక నవ్వేసేడు పార్థసారధి.

''మొత్తానికి ఆడదాని వనిపించుకున్నావ్ పార్వతీ....తప్పయితే నేను పుచ్చుకుంటానా ... నిన్ను పుచ్చుకోమంటానా. మెడికేటెడ్‌గా అయితే ఫర్వాలేదు. పార్టీలో తీసుకోవడం మంచిదికాదని నా అభిప్రాయం గానీ.... తప్పన లేదే....

''అది కాదండీ, ఆడవాళ్ళంకదా ఎలా తీసుకోవడమని కాస్త సంకోచంగా ఉందండి....''

''అది టానిక్ అనుకుంటే సరి'' అన్నాడు పార్థసారధి తేలిగ్గా.

''అలా అనుకుంటే సరా ...పక్కింటి కమలా, ఎదురింటి విమలా అసలే కాని వాళ్ళు....ఆ టానిక్ పేరేమిటో చెప్తే మేమూ తీసుకుంటాం అంటారు.''

''అబ్బబ్బ ఏం సందేహాలురా బాబూ. మనస్ఫూర్తిగా ఆరోగ్యం కావాలనుకుంటే తాగులేకపోతే మానెయ్. ఇన్ని సందేహాలతో తీసుకుంటే వంటబట్టదు కూడా'' అన్నాడు పార్థసారధి లేచిపోతూ.

అతని దగ్గర మురిపించుకునే అదృష్టం పోతుందే అనుకుంటూ ''అది కాదండి....'' అంటూ సాగదీయబోయిన పార్వతిని మాటాడనివ్వకుండా తన ఒళ్లోకి తీసుకుని....బుగ్గలు రెండూ సాగదీసి పట్టించేసేడు పార్థసారధి.

ఆ అదృష్టానికి మురిసిపోయిన పార్వతికి తను తాగిందేమిటో తెలుసుకునే అవసరం లేకపోయింది.




పెళ్ళికొడుకు వంగి మా శకుంతల మెడలో తాళికడుతున్నాడు. శకుంతల సిగ్గుపడుతూ మెడను, గువ్వపిల్లలా కదుపుతోంది. బాజాలు గుండెలదిరేట్లు మ్రోగుతున్నాయి. పురోహితులు పెంకులెగిరేట్లు మంత్రాలు చదువుతున్నారు. ఆకాశమంత పందిరి క్రింద ఆశీనులయిన అందరి దృష్టి ఆసమయంలో కల్యాణ మండపం మీదే వుంది. కాని నేను మాత్రం అసలు అటువేపు చూడటమే లేదు. ఆఖరి వరుస కుర్చీల్లో, చివర కూర్చుని నావంకే చూస్తున్న అతనినే

చూస్తున్నాను. అతను నావంకే ఎందు కలా చూస్తున్నాడో నాకు అర్థంకాలేదు. నేను పందిరి గుంజ కానుకొనినుంచున్న తీరు అతనికి నచ్చిందా: లేక నారూపం అతగాడికి నచ్చిందా ...మరి ఆ చూపు కర్థమేమిటి? ఏమో! ఏమయినా కానీ, నాకూ అతన్నే చూడాలనిపిస్తోంది. అతని దగ్గర అలా అనిపించటానికి కావలసినంత ఆకర్షణవుంది. అంతే అందం వుంది. కళ్ళల్లో ఏదో మెరుపుంది. నే చేస్తున్న పని తప్పు! నేనేకాదు. వాలా, ఖర్మకాలిపోయిన ఏ ఆడదిచేసినా తప్పే. ఇది రూల్! అంతే! ఎదురుతిరిగితే ఒళ్లు హూనమయిపోయేట్లు చీవాట్లేస్తుంది సంఘం. సంఘం అంటే మాపిన్నీ. ఇంకా అలాంటి వాళ్ళూనూ. ఓ రోజున అంతపనీ జరిగింది కూడానూ. తలంటు పోసుకొని మేడమీదకు ఎక్కి వాలి పోతున్న సూర్యుడిముందు జుట్టారబెట్టు కొంటూ నుంచున్నాను. ఎదురుగ్గా ఆకాశంలో ఇంద్రధనస్సు ఏర్పడింది. వాటి రంగులు చిన్నప్పటినుంచి చూస్తున్నా ఆ రోజున అందులో ఏదో విశేషం కనిపించింది నాకు. నాజీవితానికీ, ఆ ఇంద్రధనస్సుకీ ఏమయినా పోలికలున్నయ్యా అని చిత్రమయిన అనుమానం వచ్చింది. పిచ్చిదానిలా ఆ రంగులవంకే చూస్తూ నుంచుండి పోయాను. ఎప్పుడు వచ్చిందో మా పిన్ని వెనుకనుంచి వచ్చి నన్ను చూసి ఉగ్రురాలయి. పోయింది.

"హవ్వ! సిగ్గనేది ఏకోశాన్నయినా ఉందా? ఆ ఎదురింటి కుర్రాడలా నిన్ను కళ్ళప్పగించి చూస్తుంటే, అక్కడినుంచి తప్పుకోవల్సింది పోయి మవ్వా చూస్తూ నుంచువున్నావా? ఎవరయినా చూస్తే ఇంకేమయినా ఉందా. మా పరువూ, మర్యాదా ఏమయినా మిగిలేవా? తల్లీ! రాక్షసీ! మా కొంప ముంచకమ్మా! నీకు దణ్ణం పెడతాను! లోపలికిపద: లేనిపోని తద్దినం తెచ్చి నెత్తిన పెట్టుకొన్నందుకు ఇంత శిక్షవేయకు! చెంప లేసుకొంటున్నాగా! నాకు పిల్లలున్నారమ్మా! వాళ్ళకి పెళ్ళిళ్లు కావాలి పదవే!" అంటూ లోపలికి రెక్కపుచ్చుకొని ఈడ్చుకు పోయింది. అప్పుడు గాని నేనీ లోకంలోకి వచ్చి పడలేదు. ఎదురుగ్గా ఇంద్రధనస్సు క్రింద డాబాలోని కిటికీలోనుంచి ఆస్టూడెంట్ నా వంకే చూస్తూండటం కనబడింది. ఆ కుర్రాడిని అంతవరకూ నేను గమనించనే లేదు. తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు గాని, ఆ విషయం మా పిన్నికి చెప్పి నమ్మించటం సాధ్యంకాని పని అంచేత బుద్ధిమంతురాలిలా నోర్మూసుకొని లోపలికి వెళ్ళిపోయాను. మర్నాడు మా పిన్ని హుకూం జారిచేసింది. నేను మేడ ఎక్కకూడదు. అధవా ఎక్కాల్సి వస్తే వెంట ఎవరయినా తోడుండాలి. అంటే ఆల్ మోస్టాల్ నేనో ప్రిజనర్ నయిపోయాను. మా ఇంట్లో అప్పుడే నాకు ఖైదంటే ఎంత ఘోరంగా వుంటుందో తెలిసింది. నేను

చిన్నప్పటినుంచి ఇలాంటి ఖైదు జీవితానికి అలవాటు పడిందాన్ని కాదు. మా నాన్నా, అమ్మ నాకు విపరీతమయిన స్వేచ్ఛ ఇచ్చారు. పెద్దదాన్నయినా కూడా ఆ స్వేచ్ఛను నే దుర్వినియోగ పరచలేదు. చదువూ, స్నేహితురాండ్రూ, సినిమాలే గాని నా దృష్టి ఎప్పుడూ ప్రేమమీదకీ, మొగపురుగులమీదకీ పోలేదు. యస్సెల్సీ చదువుతోండగా కొంతమంది మా క్లాసు అబ్బాయిలు వంతుల వారిగా రోజూ మా యింటివరకూ బాడీగార్డులుగా పన్జేసేవాళ్లు. వాళ్ళలా వెంబడిస్తోంటే నాకు వాళ్ళమీద అసహ్యం కలిగిందేగాని ప్రేమ కలుగలేదు. వాళ్ళవంక కనీసం చూడ బుద్ధేనా వేశేదికాదు. అసలు నా ఆశయం వేరే వుంది. నా స్నేహితురాలు మైథిలి వాళ్ళక్కయ్య శైలజను ఓసారిచూశాను. ఆవిడ శెలవులకు మా ఊరువచ్చి ఆరోజు మమ్మల్నిద్దరినీ పార్కుకి షికారు తీసుకెళ్ళింది. అక్కడ ఓ రెండుగంటలు కూర్చోబెట్టి బోలెడు విషయాలు, మా బుర్రల్లో కెక్కించింది. పెళ్ళయితే ఆడదానికి స్వేచ్ఛ పోతుందట. మగాడు ఆమెని ఓ తలగడలా ఉపయోగిస్తాడేగాని ప్రాణం ఉన్న మనిషిలా చూడ్డట. అందుకనే తను ఎమ్.ఏ. వరకూ చదివి లెక్చరరుద్యోగం సంపాదించుకొందిట. ఇప్పుడు తను చాలా హాయిగా సంతోషంగా వుందిట. ఆమె మాటలు విన్న తర్వాత మే మిద్దరం తులసిచెట్టుదగ్గర ప్రమాణాలు చేశాం, ఎప్పటికయినా మేమూ ఉద్యోగాలు చేసి పెళ్ళిచేసుకోకుండాదర్జాగా గడపాలని. ప్రమాణాలుచేసిన కొద్దిరోజుల్లోనే నాఖర్మ చాలా ఘోరంగా కాలిపోయింది. అంతవరకు దేదీప్యమానంగా వెలుగుతోన్న నా అదృష్టరేఖ ఓ రోజు తెల్లారేసరి కల్లా ఆరిపోయింది. నాన్న ఆ రోజు ఉదయం లేవలేదు. లేవడానికి వెళ్ళిన అమ్మ బిగ్గరగా కేకలువేసి స్పృహ తప్పిపోయింది.

"ఇక మీకు నాన్నలేరు!" అన్నారు చుట్టుప్రక్కలవాళ్లు.

బాబాయి వచ్చాడు. అమ్మనీ, నన్నూ తనింటికి తీసుకువచ్చాడు. మమ్మల్నిద్దరినీ, అలా ఇంటికి తీసుకొచ్చి మేపటం మా పిన్నికి ససేమిరా నచ్చలేదు. (తప్పు పీది కాదు పిన్నీ! మగాడి తోడులేందే ఆడది జీవింతలేదన్న వాదాన్ని సృష్టించి విజం చేసిన ఈ వ్యవస్థది) పైగా పెళ్లీడు కొచ్చిన నన్ను, అనాధ్యతమూ నెత్తినేసు కోవటం బాబాయిచేసిన అవివేక మయిన పని. అందుకని వారంరోజులు మాపిన్నీ, బాబాయి కొట్లాడుకొని మాట్లాడుకో లేదు. ఆ వారం రోజులూ, నేమూ, మా అమ్మా ఆకుటుంబంలోని శాంతిని హత్యచేసిన ఖూనీ కోరుల్లాగా గజగజ వణుకుతూ గడిపాం. ఆ తరువాత మా ఇద్దరి పీడా (మా పిన్ని భాషలో) తనకు తప్పదని తెలుసుకొని మా పిన్ని తను కొంచెం తగ్గి ఊరుకొంది. ఊరుకొన్న కొద్దిరోజు

ల్లోనే మా రిజల్ట్సు వచ్చినయి. నేను యస్సెల్సీ పాసయ్యాను. కాలేజీలో చేర తానని బాబాయితో పిన్ని వినకుండా చెప్పాను. బాబాయి పిన్నికి వినేట్లు చెప్పాడు.

"కాలేజా, గాడిదగుడ్డా! వాళ్ళ పెంకుటిల్లు అమ్మిపారేసి, ఆ వచ్చిన డబ్బుతో పెళ్లిచేసిపారెయ్యకా!" అంటూ తేల్చిపారేసింది పిన్ని.

నేను అమ్మదగ్గర ఏడ్చాను. అమ్మ నన్ను కౌగలించుకొని తనూ ఏడ్చింది. అసలీ అమ్మలకు ఏడవటం తప్ప మరేం చేతవును?

నాన్న త్రాగి వచ్చి చావకొడితే అమ్మ ఏడ్వాలి. నాన్న గుండెనొప్పితో బాధ పడితే అమ్మ ఏడవాలి. కొడుకు పెద్దాడయి ఉద్యోగానికి పరాయిదేశం పోతే అమ్మ ఏడవాలి. కూతురు అత్తారింటికి పోతూంటే అమ్మ ఎడవాలి. కొడుక్కి పెళ్లవుతుంటే ఆనందం పట్టలేక అమ్మ ఏడవాలి. ఆ కొడుకు, పెళ్లాం కాపరానికొచ్చిన రెండో రోజున తల్లిని కొట్టటానికొస్తే, అమ్మే ఏడ్వాలి. అబ్బో! ఒక టేమిటి. తల్లి పాత్ర అంతా ఏడుపే! అందుకనే ప్రపంచంలో ఈ పాత్ర చాలా కష్టమయింది. అయినా ప్రతి ఆడకూతురూ తెలిసో, తెలీకో ఈ వేషమే వెయ్యాలని ఉబలాట పడుతూంటుంది.

మా ఊరు మా రాష్ట్రపు రాజధాని కాదు. కనీసం దాన్దగ్గరకూడా లేదు. అంచేత మా పెంకుటిల్లు, కారు చవగ్గా అమ్మచూసినా కొనేనాథుడు లేకపోయాడు. ఇది మా ఊరి ఖర్మ..

నేను ఏడ్చిన నెత్రోజులకి నన్ను చూడ్డానికో మృగం వచ్చింది. దాన్ని మా బాబాయి, పిన్నీ తెప్పించారు. ఏ 'జూ' నుంచి తెప్పించారో తెలీలేదు మరి. మృగం సోఫాలో కూర్చుంది. ఎదురుగ్గా క్రింద చాపమీద నన్ను అలంకరించి కూర్చుండబెట్టారు. మృగం నన్ను చూసింది. చూసి ఇకిలించింది. ఇది మా బాబాయి, పిన్నీ చూసి వాళ్లూ ఇకిలించారు. మృగం బాబాయితో ఏదో మాట్లాడి వెళ్ళి పోయింది. అతగాడి మొదటి పెళ్ళాం చచ్చి రెండేళ్ళయిపోయిందిట. రెండేళ్లూ బావుండదని ఊరుకొని టింగురంగా మంటూ నన్జూడ్డానికొచ్చాడిప్పుడు. (అతగాడికి పెళ్ళాం చచ్చిపోయింది గదా! అలాగే ఎక్కడయినా మొగుడు చచ్చిపోయిన అమ్మాయుంటే చేసుకోకూడదూ! ఊహూ! అల్లాక్కాదు. పదహారేళ్ళ కన్నె పిల్ల కావాల్సార్!) కట్నం అవసరం లేదుట. పెళ్లిఖర్చులు పెట్టుకుంటే చాలుట. బాబాయి ఎగిరి గంతేశాడు. పిన్ని లావు మూలాన ఎగరకుండానే గంతేసినంత పన్జేసింది. నా పెళ్ళి నిశ్చయ మయిపోయింది. నలభై ఏళ్ళు దగ్గరగా ఉన్న రెండో పెళ్ళాడితో పదిహేడేళ్ళు నిండని నాకు పెళ్ళి. అయినా ఇది వింత కాదు. అసాధారణ సంఘటన కాదు. తన్నినా!




ఇంట్లోంచి బయటకు వెళ్ళగొట్టినా, గొంతు పిసికినా పరే భారతస్త్రీకి పతియే ప్రత్యక్ష దైవం'' లాంటి సూల్సు, రెగ్యులేషన్లు కోకొల్లలుగా ఉన్న ఈ దేశంలో, అందునా ఆ సూత్రంమీదే కథాంశం గల సిన్మాలు (స్త్రీలకు ప్రత్యేకం) శతదినోత్స వాలు జరుపుకొంటూన్న ఈ ఆంధ్ర దేశంలో అలాంటి విషయాలు లెఖ్ఖచేసే మహాపురుషుడూ లేడు. మహాతల్లులూ లేరు. అంచేత నా ఖర్మ మరోసారి కాలి పోయింది. అతనితో నాకు పెళ్ళయింది. పెళ్ళికి మా బంధువులు బోలెడుమంది వచ్చారు. ఆడాళ్ళు జరీచీరలు, సిల్కుచీరలు, టెరిలిన్ చీరలు గంటకొకటి మారుస్తూ తోటి ఆడది ఘోరంగా బలి అయిపోతున్న ఆ దురదృష్ట క్షణాల్ని పండుగలా జరుపు కొన్నారు. (ప్రియమయిన స్త్రీలారా! నాకు పట్టిన గతి మీకందరికీ పడితే ఎలా ఉండేదో ఒక్కసారి ఊహించుకోండి. పైగా నా కిష్టం లేకుండా ఆ మృగం నా మెళ్లో తాళి కడుతూంటే శుభప్రదమయిన అక్షింతలు నవ్వుకొంటూ మా నెత్తిన చల్లుతారా? మీకు సిగ్గుందీ? మొగిలి పువ్వంటి మొగుణ్ణివ్వాలే అని నేనూ పాటలు పాడాను, నాలానే యవ్వనంలో అడుగెడుతూన్న సోగ్గాడు నన్ను కట్టు కొంటే, ఆ మధురక్షణాలు అనుభవించా లని నేనూ ఉవ్విళ్లూరాను. ఇద్దరం రేపు, నిన్నలను మర్చిపోయి ఎప్పటికప్పుడు ''ఈ రోజే'' అనే ఆనందంలో మునిగి పోవాలని కలలు కన్నాను. ఇప్పుడు ఆ రాస్కెల్ నాకు తనూ, తన మొదటి

పెళ్ళాంతో గడిపిన హనీమూన్ గురించి చెప్తాడు. వాళ్ళిద్దరూ కలసి వెళ్ళిన సిని మాలు గుర్తు చేసుకొంటాడు. ఆ పెళ్లాం కనిపిస్తే పిల్లల్ని చూపించి "నువ్వే వీళ్ళకి తల్లివ"ంటాడు. వేగంగా ప్రవ హించే నా యవ్వనానికి ఇలాంటివన్నిటినీ కలిపి ఓ ఆనకట్ట కట్టేస్తాడు. పెళ్ళయిన మర్నాటినుంచే నన్నో అమ్మమ్మలా చేసే స్తాడు. అంచేత ఈ కన్నెపిల్ల ఉసురూ మీకూ, నన్ను జాలి లేకుండా పెళ్ళా డేస్తూన్న అతనికీ తప్పక తగుల్తుంది. కన్నెపిల్ల ఉసురు సామాన్యమయింది కాదు. తప్పక దెబ్బతీస్తుంది). ఆ రాత్రి అతను నన్ను కౌగలించుకొన్నాడు. నేను సిదరించుకొన్నాను. వారంరోజు లవ కుండానే అతను మార్కెట్‌నుంచి సైకిల్ మీద వస్తోంటే లారీ వచ్చి గుద్దింది. రెండురోజులు హాస్పిటల్లో బ్రతకటానికి ప్రయత్నించి అతను చనిపోయాడు. అతను చనిపోయినప్పుడు నాకు ఏడుపు రాలేదు. అసలు ఏడవాలనే అనిపించలేదు. ఎక్కడో దూరపుబంధువు మనమెప్పుడూ చూడనివాడు పోతే ఎలా ఫీలవుతామో అలాగే ఫీలయ్యాను. మా పిన్ని నన్ను చూసి శాపనార్థాలు పెట్టింది.

"రాక్షసీ! ఏడవ్వే! ఎవరయినా చూస్తా రనయినా సిగ్గు లేదేం? అయ్యో! అప్ర తిష్ఠ! మొగుడు చచ్చాడన్న విచారం లేకపోతే మానే. ఎవరయినా చూడ్డాని కొచ్చినప్పుడు కళ్ళవెంబడి నీళ్ళయినా పెట్టుకు అఘోరించు...."

నాకు నవ్వువస్తోంది కాని, ఏడుపు రావటం లేదు. నేనేం చేయను! పదిహే డేళ్ళు నిండకముందే, పెళ్లాట్టం, మొగుడు భస్తం, "అన్‌ఫిట్ టు లివ్ నార్మల్ హ్యూమన్ లైఫ్" అనే సర్టిఫికెట్ తీసుకోడంకూడ జరిగిపోయాక, ఇంక ముందున్న జీవితం ఓ ప్రక్కా, ఈ సంఘాన్ని మరో ప్రక్కా చూస్తే నవ్వు రాదూ? తప్పకుండా వస్తుంది. అసలు పగలబడి నవ్వాల్సిన "ఆకేషన్" అది. కాని బావుండదని ఊరుకొన్నాను. లేక మా పిన్ని తిట్లకు భయపడి ఊరుకొన్నా నన్నా సరే! నన్ను చూట్టానికప్పుడు (అప్పుడు నన్ను ఓసారి చూడాల్సింది. ఫాన్సీ డ్రెస్ వేసినట్లు తెల్లని చీర. గాజుల, బొట్టూ లేకుండా—హాయ్! ఒక చేమిటి, 'జూ'లో కేజ్‌లో పక్షిని పెట్టి నట్లు పెట్టారు నన్ను ఎగ్జిబిషన్‌కి) అందరూ రావడం, నేను ఏడవకపోవటం చూసి చెవులు కొరుక్కోవటం, వెళ్ళిపోవటం— ఒకరిద్దరు దేవతాస్వరూపిణులు నా మొఖం మీదే దీవించబోయారుకూడా. "నోర్మూసు కొని మీ పన్జూసుకోండి!" అంటూ తిక్క రేగి జవాబిచ్చాను. వాళ్ళు వెనక్కి తిరిగి కూడా చూడకుండా బయటకు పరిగెత్తారు. ఇజ్జరిగి రెండేళ్ళయిం తర్వాత మా పిన్ని పెద్దకూతురు 'అరుంధతి' పెళ్ళయింది. వరుడు సురేందర్ ఎమ్మెస్సీ. లెక్చరర్. దానికి పద్దెనిమిదేళ్ళు. అతనికి ఇరవై

మూడేళ్ళు. కట్నం ఎనిమిది వేలు. చిలకా గోరింకల్లా ఇద్దరకూ జోడీ సరిపోయిందని అందరూ అనుకొన్నారు.

(చెల్లాయ్! నాకు దక్కని అదృష్టం నీకయినా దక్కింది. అయినా నాకు నీమీద ఈర్ష్య లేదమ్మా! కలకాలం చల్లగా ఉండండి).

ఇప్పుడు మా పిన్ని రెండో కూతురు శకుంతల పెళ్ళవుతోంది. నా వయసు ఇప్పుడు ఇరవైనాలుగేళ్లు. నా వయ సమ్మాయిలందరూ మొగుళ్ళతో పంది ళంతా దీపాల్లా తిరుగుతున్నారు. పిల్లల నెత్తుకెళ్ళి భర్తల కండిస్తున్నారు. మళ్ళీ తెచ్చుకొంటున్నారు. ఎవ్వరూ చూడకుండా భర్తలను వెక్కిరిస్తున్నారు. ఎవ్వరికీ విన బడకుండా వేళాకోళ మాడుతున్నారు. దొంగతనంగా వాళ్లను గిల్లుతున్నారు. ఇదంతా, ఇవన్నీ నేనేం పాపం చేసుకొన్నానో, నా కంట పడుతున్నయి. అప్పుడే నా యవ్వనం మేల్కొని నన్ను ఇబ్బంది పెడుతూండేది. ఇదే కాదు. అరుంధతి పెళ్లయిన క్రొత్తలో నా పని మరీ ఘోరంగా ఉండేది. అరుంధతి భర్త సురేందర్ నాతో మాట్లాడ్డానికి ప్రయత్నించాడు. అతని ప్రయత్నాలు అన్ని విధాలా వమ్ముచేయడానికి ప్రయత్నించేది అరుంధతి. అసలు నన్ను అతని ఛాయ లకు కూడా రాకుండా జాగ్రత్త పడుతూండేది. అతనికి నామీద సానుభూతి తప్పితే మరేమీ లేదు. నా కది తెలుసు. అతనిది యువక రక్తం, నాకు జరిగిన అన్యాయం అరుంధతిద్వారా తెలుసుకొన్నా డతను. అప్పటినుంచీ నాతో సాను భూతిగా రెండుమాటలు మాట్లాడాలనీ, నాకు ధైర్యం చెప్పాలనీ అతని అభిలాష. అరుంధతికేమో అతను ఓసారి నాతో మాట్లాడితే తనను మర్చిపోతాడేమోనని అనుమానం.

(పిచ్చి అరుంధతీ! అంతకింత పరచకు తల్లీ! నీతోటి ఆడదాన్ని ఇప్పటికే మనగతి అధ్వాన్నంగా ఉంది. మేల్కొని సాటి ఆడదాన్ని నమ్మటం, గౌరవించటం నేర్చుకోమ్మా! లేకపోతే మనఖర్మ ఎప్పుడూ ఇలాగే తగలడుతుంది.) వేళ్ళలోగా అతను ఎలాగోలా అవకాశం కలిగించుకొని నాతో మాట్లాడాడు.

"మీరు ఎవ్వరిమాటలూ వినవద్దు. అందరూ గట్టున ఉండి కబుర్లు చెప్పే వాళ్ళు కాలేజిలో చేరండి! లేపోతే నర్సుగానో, టీచర్‌గానో ట్రయినింగ్ తీసుకోండి. ముందు ఎలాగోలా మీకాళ్ళ మీద మీరు నిలబడే సత్తువ తెచ్చుకోండి. తరువాత మీ మన సుకేది వచ్చితే అది చేయండి. మీ భవిష్యత్తు మీచేతుల్లో ఉంది. మిమ్మల్ని నా చెల్లాయ్‌గా భావించి సలహా ఇస్తున్నాను. ఈ విషయంలో మీకే సహాయం కావాలన్నా చేయడానికి సంసిద్ధంగా ఉన్నాను."

అతనిమాటలు నాకు ఓ క్రొత్త ఉత్సాహాన్నికలుగ జేసినయి. ఏంచేయ

దానికి తోచక సతమత మవుతోన్న నాకు అతనిచ్చిన సందేశం ఓ మార్గాన్ని చూపింది. కాని అవేమీ ఫలించలేదు.

"అలాంటి పిచ్చి వేషాలేమీ వెయ్యొద్దని" పిన్నిగట్టిగా వార్నింగిచ్చింది.

రెండు రోజులు ఏడుస్తూ కూర్చున్నాను. అమ్మకు నాదే బెంగ. మంచం పట్టింది. మనోవ్యాధికి మందులేదని నాకు తెలుసు. అమ్మకి మనోవ్యాధో కాదో చూట్టాని కసలు డాక్టరు కూడా రాలేదు. నీకు నా పరిస్థితి చూపి ఉక్రోషం ముంచుకొచ్చింది.

సురేందర్‌కి ఉత్తరం వ్రాద్దామని కూర్చున్నానుగానీ, అది మళ్ళీ ఏమేం గొడవలకు దారితీస్తుందోనని ఊరుకొన్నాను. ఈలోగ ఇప్పుడు శకుంతల వెళ్ళి చివరకుర్చీలో కూర్చుని నా వంకే చూస్తూ అతను—వధూవరులకు కట్నాలు చదివిస్తున్నారు. అతను నావంక చూసి చిన్నగా నవ్వాడు. నేనెందుకు నవ్వకూడదో నాకు తెలీలేదు. మొగాణ్ణి చూసి నప్పుడు జీవితంలో మొదటి సారిగా అప్పుడు నాకు సిగ్గువేసింది. తల ప్రక్కకు తిప్పి చూపులు మరల్చుకొన్నాను. కాని ఎంతోసేపు అవకుండానే తిరిగి అతనివంక చూశాను. అతను పంజాబీడ్రస్ వేసుకొన్న ఓ అమ్మాయితో ఏదో మాట్లాడుతున్నాడు ఆ అమ్మాయి నవ్వుతోంది. ఇరుగ్గా బట్టలేసుకొనే అమ్మాయిల మీద నాకు సదభిప్రాయం బొత్తిగాలేదు. పైగా అతని లాంటి మొగాడు ఆ అమ్మాయితో అలా నవ్వుతూ మాట్లాడటం అసలు నచ్చలేదు. ఆ అమ్మాయి అక్కడి నుంచి కదిలి అందరినీ తప్పించుకొని నా దగ్గరకు వచ్చింది. నే నతనివంకే చూస్తోన్న సంగతి పసిగట్టిందేమోనని భయంవేసింది నాకు.

"నాపేరు అవంతి. పెళ్ళి కొడుకు మాఫామిలీ ఫ్రెండ్. మరి మీ పేరు?" అడిగిందామ్మాయి.

ఆపిల్ల చొరవ నాకర్థం కాలేదు.

"జ్యోతి" అంటూ జవాబిచ్చాను.

"వెరీగుడ్! ఎ నేమ్ టు రిమెంబర్! మీరుపెళ్ళి కూతురికే మవుతారు"

"శకుంతల నా కజిన్" అన్నాను.

"ఐసీ!" అందామె.

నాకు మీ బాబ్‌డ్ హెర్ పూర్తిగా నచ్చలే దందామని నోటిదాకా వచ్చింది కాని తమాయించుకొని ఊరుకొన్నాను.

ఆ తరువాత ఇద్దరం చాలాసేపు పెళ్ళిళ్ల గురించి, పెళ్ళిళ్ళల్లో అచారాల గురించీ మాట్లాడుకొన్నాం. భోజనం కూడా ఇద్దరం కలిసేచేశాం, ఆరాత్రి వెన్నెల పాలలా ప్రవహిస్తోంది. నేనూ అవంతి చాలాసేపు ఇంటి ముందు ఇసుకలోకూర్చుని కబుర్లు చెప్పుకొన్నాం. అవంతి తన గురించి నాకు చెప్పింది, నాకథ తెలుసుకొని జాలిపడింది. మాపిన్ని సంగతి విని మండిపడింది.



"లచ్చీ, ఆ పింగాణీ ప్లేట్లు జాగ్రత్త సుమా, చెయ్యి జారి పడేను..."
"ఏం పర్లేదమ్మా. పడితే మాత్రం అవేటి సేస్తాయి నా కాళ్ళకి!"

"ఇంతకూ నేను మీతో ఎందుకు పరిచయం చేసుకొన్నానో తెలుసా?' అనడిగింది.

'ఎందుకూ?' అనడిగాను ఆశ్చర్యంగా

"మా అన్నయ్య కోరికపై!" అంది.

"అదేమిటి?" అన్నాను ఏం మాట్లాడాలో తెలీక.

"ఊహు ఏమీతెలీనట్లు...." అందామె నవ్వుతూ.

"నిజం జ్యోతీ! అన్నయ్యకి మీరు నచ్చారు! మిమ్మల్ని చేసుకోవాలని అన్నయ్య కోరిక. మీగురించి వివరాలు కనుక్కుందామని వచ్చాను...."

"కాని....కాని...."మాటలు దొరక లేదు నాకు. తడబడ్డాను.

"మీరు విడో అనేగదా మీ అనుమానం! ఈకాలంలో కూడా ఇంకా ఈ ఆచారాలూ వల్లకాడూ ఏమిటి? ఆ మూఢ నమ్మకాలు పట్టుకుని మీ జీవితం ఎందుకు నాశనం చేసుకొంటారు?"

"నేననేది నాగురించి కాదు ..మీ తల్లి....దండ్రులు...."

"హోస్! మా నాన్నగురించి మీకు తెలీదు. పదేళ్ళ ఇంగ్లండ్‌లో ఉండి వచ్చారు. అంచేత వచ్చేప్పుడు వాళ్ళ ఆచారాలూ, సంస్కృతి కూడా తీసుకొచ్చారు. మా ఇంటి నిండా అదే వుంది, అంచేత మీ కాభయం అక్కర్లేదు!"

నేనే మీ మాట్లాడలేదు. అతనింత ధైర్యం చేయగలడని నేననుకో లేదు.

పైగా ఈ ఇరుకు బట్టలేసుకొన్న పిల్ల గాడంటె ఇంత విశాలం అని కూడా నేను ఊహించలేదు.

(భగవంతుడా నువ్వున్నావ్। ఎందుకంటే నామీద జాలిపడే ఓ స్త్రీ ఉంది. ఆ పిల్ల నాకు విముక్తి కలిగించటానికి శ్రమపడుతోంది. ఆడపిల్ల లందరకూ ఇరుకు బట్ట లివ్వమని నేను వేడుకోను గానీ, కనీసం ఆ విశాల హృదయం ఇవ్వ కూడదూ? నీకు ఆజన్మాంతం ఋణపడి వుంటాను.)

తరువాత కథ అంత ముఖ్యమయింది కాదు. అవంతి అన్నయ్య శకుంతల భర్త రికమండేషన్‌తో మా యింటికి వచ్చి నన్ను పెళ్లాడే విషయం బాబాయిని అడిగించటం, పిన్ని ఏమన్నా సరే వల్ల కాదనీ, తనమాట కాదంటే వల్లకాదేమో నని గొడవ చేయడం—ఎవ్వరూ ఏమీ చెయ్యలేని పరిస్థితిలో అవంతీ, నేనూ, అమ్మా టాక్సీలో అతనిల్లు చేరుకోవటం, అక్కడ మాపెళ్ళి చాలా సింపుల్‌గా అందంగా జరగటం—ఇంతే। ఇదే జరిగింది. కానీ ఓ విశేషం మాపెళ్ళికి పిలచిన బంధువు లెవ్వరూ రాలేదు. అందరూ ఓ యింట్లో గుమికూడి నాగురించి తిట్లూ శాపనార్థాలతో చెప్పుకొన్నారట. మా పిన్ని "మాజ్యోతి చచ్చి పోయింది. పీడా విరగడయి పోయిందని అందరితోనూ అన్నదట." ఇక్కడ నాకర్థం కాని దొక్కటే. ఈ రెండో పెళ్ళివాడు ఓ పసిపిల్లని చేసుకొంటూంటే తగుదునమ్మా అని వచ్చి దీవించిన పెద్దలందరూ ఓ రెండో పెళ్ళి అమ్మాయి ఓ అబ్బాయిని చేసుకొంటూంటే ఎందుకు దీవించటానికి రాలేదు. మన సంఘం ఎందుకింత కుళ్ళి పోయింది? మగాడు ఎన్ని పెళ్ళిళ్ళయినా మహారాజులా చేసుకొంటాడా! అదే ఆడదయితే ముఖాన్న ఉమ్మి వేస్తారా? ...అయినా సరే! నేను "కేర్" చెయ్యను. నాకు ఎవ్వరితోనూ పనిలేదు. ఈ జీవితం నాది. అనుభవించేది నేను. నన్ను శాసించే అధికారం ఎవ్వరికీ లేదు. నాక్కావలసింది ఈ కుళ్ళు సంఘం తాలూకు దీవెనకాదు. నా భవిష్యత్తు నాకు ముఖ్యం.



# బతుకు తెరువు



శివలెంక భాంత్యావేషి

అమ్మ మరీ మరీ చెప్పింది. నే బయల్దేరుతూంటే—బస్సుదిగగానే వాడికోసం చూడు, వస్తాడు. ఒకవేళ రావడం కొంచెం ఆలస్యమయినా కాసేపాగు అక్కడే వాడు వచ్చేవరకూ. ''తెలీక పోతుందా'' అని అడ్డం పడిపోకు. కాని వూరు పల్లెటూరు కూడాను. అందరూ ఎబ్బెట్టుగా చూస్తారని. ''అలాగే'' అన్నట్లు తల తాటించాను. అయినా మళ్ళీ చెప్పింది. ''అలాగేలేవే'' అన్నా నీసారి విసుగ్గా.

జాగ్రత్త, కానివూరు. అన్నారు నాన్న? "మరేం ఫరవాలేదు" అన్నట్లు నవ్వాను. వచ్చేశాను.

బస్సు దిగగానే అవన్నీ గుర్తొచ్చాయి అన్నయ్య కోసం చుట్టూ చూశాను. కని పించలేదు.

రోడ్డు మీదకు వచ్చి నాలుగు పక్కలా చూశాను. అన్నయ్య కనిపించలేదు. నా వెనకాత లెవరో వొకాయన వస్తున్నాడు. ఆయన దగ్గరకు వచ్చేవరకూ ఆగాను.

రోడ్డుకు అడ్డంగా నిలబడ్డ పిల్లని— నావంక ఆశ్చర్యంగా, వింతగా చూశాడు.

"కామరాజు వారి వీధెక్కడండి." అని అడిగాను ఆయన ఆశ్చర్యాన్ని గుర్తించనట్లు.

"ఎవరిల్లు కావాలి?" కనుబొమలు చిట్లిస్తూ అడిగాడు.

"సుబ్బారావని .." నామాట పూర్తి కాలేదు.

వారింటికా తమరు దయచేసింది. ఏ వెధవని తీసుకు వెళ్ళి దిగబెట్ట మన్నా దిగ బెడతాడు కదండీ. వారింటికి, వీధి పేరు వెతుక్కొంటున్నారు. అంటూ సంభ్రమంగా నవ్వి ముందుకు దోవ తీశాడు నా వెనుక రమ్మన్నట్లు.

వెనకాతలే జాగ్రత్తగా దోవని పరిశీ లిస్తూ నడుస్తున్నాను. ఎంతైన వొంటరి ఆడపిల్లని మరి.

నాలు గడుగులు వేసి ఏదో ఘోరాప రాధం జరిగిపోయినట్లు నొచ్చుకొంటూ అన్నాడు వెనుదిరిగి.

"అదేదో మీరు పట్టుకొన్నారు. ఇటి వ్వండి నేను పట్టుకొంటాను" అని.

"నే పట్టుకొంటాను. నాది నాకు బరువు ..."నామాట పూర్తి కాకుండానే.

"ఎంత మాట . ఎంతమాట ..మీ కేవిటా అవసరం ." అంటూ సూటు కేసు తన చేతిలోకి తీసుకొన్నాడు. నా యిష్టంతో ప్రమేయం లేనట్లు ఆ మని షితో ఏంమాట్లాడాలో, ఏలా మాట్లాడాలో తెలీక మౌనంగా వెనకాలే నడవడం మొదలు పెట్టాను.

కొంతదూరం నడిచాక "మనదే వూరు?" అన్నాడు నడక వేగం తగ్గించి. మా పనిచేసే వాళ్ళుకూడా అంత విన యంగా మాట్లాడటం నేనెరుగను.

"కృష్ణా జిల్లాలే" అన్నాను

"అద్దదీ, అట్లా సెప్పండీ" అన్నాడు ఏదో సరికొత్త విషయం పరిశోధించి నట్లుగా—ఆ మాటెందు కన్నాడో నా కర్థం కాలేదు.

"చూస్తానే తెలుస్తుంది లెండి" అన్నాడు.

"ఏం తెలుస్తుందని" నే నడగలేదు.

"ఇంకొక రెండు ఫర్లాంగులుంది. మీ చేత యింతదూరం నడిపించాం." అన్నాడు ఎంతో అపరాధం చేసినట్లు. బల వంతాన నవ్వు ఆపుకొన్నాను.

"అన్నయ్యకీ, ఆ మనిషికీ ఏవిటి పరి చయం?" నా ఆలోచనలో నేనుండగానే



యువ ✦




"అదిగో ఆ కన్పిస్తున్న ఇల్లే వారిది" అన్నాడు.

మొగుడు పేరు ఉచ్చరించని ఆడవాళ్ల జ్ఞాపకం వచ్చారు నాకు.

"అంటే" అన్నాను ఏమంటాడోనని.

"అయ్యగారిది" అన్నాడు.

"అంటే—సుబ్బారావుగారిదా?" అని అడిగాను నవ్వు దాచుకొంటూ.

"మరేనండి. ఏం చేస్తే ఋణం తీరుతుంది అయ్యగారికి. ఇంత చిన్న వయసులోనే ఎంత ఋది—పూర్వజన్మ సుకృతం" అన్నాడు.

ఈ జన్మని గాలిలోకి వదిలేసి, పూర్వజన్మ గురించి మాట్లాడే ఆ మనిషికి ఏం చెప్పను?

ఇంటిముందుకొచ్చాక తలుపు తట్టాడు. "అమ్మగారూ" అంటూ. చామనఛాయగా వున్నామె తలుపు తీసింది. "దండాలమ్మగారూ" అన్నాడు రెండుచేతులూ పైకెత్తి దణ్ణం పెడుతూ,

అట్టే పట్టించుకోకుండా "రండి లోపలకు" అన్నది నాతో.

ఆ మనిషి వెళ్లిపోయాడు సూట్‌కేసు లోపల పెట్టి.

"ఛాయ వస్తుంది, బస్టాండుకి వెళ్లాలని నిన్నటినుంచీ ఒకటే తొందర పడుతున్నారు. తీరా అవేళ్టికి ఎవరో అర్జెంటుగా పిల్చుకువెళ్ళారు." అన్నది కుర్చీ

ఊరుపుతూ.

"పోన్లెండి, అతనెవరో తీసుకు వచ్చాడు" అన్నాను ముఖానికి పట్టిన చెమట తువాలుతో తుడుచుకొంటూ.

"తీసుకురావడానికేం ఎవరయినా తీసుకువస్తారు, మరి మీ అన్నయ్య పలుకుబడి...." అంటూ అర్థోక్తిగా ఆపి నవ్వింది.

"ఎప్పుడు వస్తాడు?" అన్నాను.

"రావచ్చు—ఎప్పుడైనా," ఏమంటున్నా ఆవిడ ముఖంలో నవ్వుమటుకు దాగటంలేదు.

"స్నానం చెయ్యండి, భోంచేసి తరువాత మాట్లాడుకోవచ్చు" అన్నది.

"స్నానంచేసి వస్తాను, భోజనం అన్నయ్య వచ్చాక చేద్దాము" అన్నాను స్నానానికి లేస్తూ.

"అన్నయ్య భోంచేసి వస్తారు" అన్నది.

స్నానం చేసివచ్చాను. భోజనందగ్గర తనే ఏదో మాట్లాడుతోంది. "మా పెళ్లి కూడా మీరెవరూ రాకుండానే అయిపోయింది" అన్నది.

"పెద్దన్నయ్య పెళ్ళికూడా సరిగా అప్పుడే. రావడానికి వీల్లేకపోయింది" అన్నాను. సంభాషణ తెంపేసినట్లు అక్కడ ఆగిపోయింది.

భోంచేసి వచ్చి ముందుగదిలో కూర్చున్నాను పేపరు చూస్తూ. ఆవిడ వంటిల్లు సర్దుకుంటోంది. బర్రున తలుపు తోసుకు లోపలకు వచ్చాడు అన్నయ్య. చూసి నిర్ఘాంతపోయాను.

ముఖం నిండా విభూతి, దానిమీద గంధం. ఇంతపెద్ద కుంకుమబొట్టు—

ఇలాంటి కర్మకాండను అసలు నమ్మని అన్నయ్య—

"ఏమిట్రా ఈ అవతారం?" అని మటుకు అనగలిగాను.

"ఇందులో నా ప్రమేయమేం లేదు. కాని, నువ్వెప్పుడొచ్చావో చెప్పు ముందర" అంటూ వాకిలితలుపు దగ్గరగా వేసి, వేరే కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

నే నామాట పట్టించుకోలేదు, "నీకు అమ్మ తన రక్తమాంసాలు ధారపోసి చదువు చెప్పించింది యిందుకోసమట్రా? నిన్నుగురించి కలవరిస్తూనే చచ్చిపోయింది, ఇదిట్రా నువ్వు చేస్తున్న నిర్వాకం" అన్నాను. భగ్గుమంటోంది నా గుండె.

"పెద్దలు చెప్పే ఆత్మలనేవి నిజంగా వుంటే, అమ్మ సంతోషిస్తుంది, నేనీనాటికైనా ఏదో విధంగా బతకగలుగుతున్నందులకు" అన్నాడు తాపీగా—ఏనాడో చచ్చిపోయిన అమ్మను తలచుకొంటూ.

"ఒరేయ్! నీ దొంగ వేషాలన్నీ చచ్చిపోయిన వాళ్ళ ఆత్మలంటూ వాటి వెనకాల దాచిపెట్టాలనుకోకు. అమాయకులైన ప్రజల్ని దోచుకు తింటున్నారని, ఒకనాడు కంఠశోష పడ్డ నువ్వు—ఇవాళ ఇలా తయారవుతావంటె నమ్మలేక పోయానురా. చదివిన చదువంతా

పట్టేట్లో కలిపి .... వన్‌వే ట్రాఫిక్ లా వుంది నీ గొడవ. అంటూనే ఫక్కున నవ్వేడు, ఆ నవ్వే నన్ను రెచ్చగొట్టింది.

"ఏవిట్రా...."అన్నాను. నా తల బిరుసు, పొగరు అంతా అందులో వాడికి తెలుసుండాలి.

చిన్నప్పుడు నాకోసం దెబ్బలు తిన్న వాడు వాడు. పెట్టుబడిదారి విధానం, సాటి ప్రజల్ని దోచుకునే విధానం నశించాలని వాడు శోషొచ్చేలాగు వాదిస్తూంటే వాడిని బలపరచి, చివాట్లు తిన్నదాన్ని నేను. అందుకనే నేమో, వాడు తేలికగా నవ్వగలిగాడు.

'నా వాదన కూడా విను. తెలివిగా, బతుకు మీద ఎంతో ఆశతో, వున్నదేదో వూడ్చుకొని, అమ్మ చచ్చిపోయిందన్న విచారాన్ని కూడా దిగమింగి, బియస్సీ పరీక్షలు అయిాయనిపించి, పాసయాను, అంటే — జీవిత సమరంలోకి దూకా నన్నమాట. అన్నీ దెబ్బలే పెట్టుబడి దారి విధానం నశించాలి, యువతరానికి ప్రోత్సాహం కావాలి'' అని వాదించే వాడిని గుర్తుందా?....

అందుకని అమాయక పల్లె ప్రజల్ని మోసం చేస్తావా నీకు నమ్మకం లేని విషయాన్ని ఆధారం చేసుకొని. నాకోపం- ఎంత ఆపుకొందామన్నా ఆగటంలేదు.

''చెల్లాయ్! అని అరిచాడు వాడు. అందులో బాధ స్పష్టంగా కనిపించింది.

''నే నెవర్నీ మోసం చేయడంలేదే! నేనేనే బతుకులో మోసగింప బడింది ...

''అలాగా'' నా గొంతులో వ్యంగ్యం ఆగలేదు.

''అవును. ఏం, నా యిష్టం వచ్చి నట్లు నే సంపాదించు కొంటాను, వద్దనే వాళ్లు వేరే వుద్యోగం చూపెట్టండి, ఇది మానేస్తాను, సామాన్య మానవుడ్ని. ఆకలిబాధ వుంది నాకు, డిన్నర్లలో, టీపార్టీలలో పీకలమొయ్యాతిని. 'నా దేశను బియ్యం త్యాగం చేస్తున్నాను' అడే అవకాశం లేదు నాకు, ఆ బియ్యమే గతి. వాటికోసం ఏ పాట్లైనా పడాలి''

నాలోని వేడి దిగిపోవటం ప్రారంభించింది,

''అందుకని'' అన్నాను.

''అందుకని'' నన్ను అనుకరిస్తూ, ''నాకు చేతనైనది నేను చేసుకొంటాను. నీకు తోచింది....

''బాబుగారూ మీ మేలు మరిసిపోలేను. అంటూ తలుపు తోసుకొని ఒకతను లోపలకు వచ్చాడు. చేతిలోని మంచి గుమ్మడిపండు అన్నయ్యకాళ్ళ దగ్గిర పెట్టాడు.

''దాందేముందిలే'' అన్నట్లు ఒక చిఋనవ్వు నవ్వాడు అన్నయ్య.

''ఎలా వుందిరా మీ అన్నకు.... అని అడిగింది వదిన లోపల్నుంచి వస్తూ,

బాబు కాదు తల్లీ ....భగమంతుడు, భగమంతుడు దయవలన నయమై పోనాది. చిన్నవాడైనా చేతులెత్తి మొక్కాలి తల్లీ? ఆడు ఆ సావుకేసు పట్టినప్పటి నుంచి నిద్దరోయినాడా, మమ్మల్ని నిద్దరో విచ్చినాడా? కలవరింతలు, కేకలు,

పిడుపులు, లగ్గెత్తటాలు ఒకటేమిటి తల్లీ, మమ్మల్ని రచ్చించారు తల్లీ, బాబు ఇల్లు సల్లగా, మీకడుపు సల్లగా....

"పైకాన్ని తొందరగా సర్దమనిచెప్పు అవసరంగా వుంది." సగం నిర్లక్ష్యంగా, సగం అధికారంగా అన్నాడు.

"అలాగేనయ్యా. ఆడు డూటిలోకి ఎళ్ళగానే" ఒక చెయ్యి గాలిలోకి విదిలించేసి, చప్పరించేశాడు. అన్నయ్య అవన్నీ నాకెందు కన్నట్టు. "వెళ్ళి మీ అన్నతో చెప్పు ముందర నేనన్న విషయం" అన్నాడు.

"సిత్తం బాబూ తమరు మళ్ళి ఒకసారి దయసేసి...."

"అలాగే నేనే అనుకొంటున్నానా విషయం, రేపు పొద్దున్న వస్తాను. అన్నీ సిద్ధంచేసి వుంచమను. కొత్తవేమి అక్కర లేదు. అన్నీ లోగడ తెచ్చినవే, మీ అన్నను కూడా స్నానం చేసి సుచిగా వుండమను" అంటూ నావైపు తిరిగాడు. నాకు మండిపోతోంది.

"దండాలు బాబూ" అంటూ వెళ్ళి పోయాడతను.

వాడొక పోలీసు. చావుకేసు పట్టాడు. కక్కుర్తిపడి తప్పుడు సాక్ష్యాలిప్పించాడు. చచ్చినవాడె ఆస్తిచంపినవాడికి పోయింది. గుట్టు చప్పుడు కాకుండా. వాడు దెయ్యమై పట్టాడని పీడికి భ్రమ.

"లేని దెయ్యాన్ని వదిలిస్తానని చెప్పి "

"నువ్వు మాట్లాడకు — నీకీ మనుష్యులు ఏరు తెలీదు" అన్నాడు. కనుబొమలెత్తి నా వంకే చూస్తూ అన్నాడు మళ్ళీ: "నేను కాకపోతే, యింకొకరు— ఆకాస్త తతంగం పూర్తిచేస్తేనే కాని వాడి మనసు కుదుట పడదు. మళ్లీ మనిషి కాడు. అలాటప్పుడు ఏవో ఆదర్శాలు వల్లేసుకొంటూ, సిద్ధాంతాలు గుర్తు తెచ్చుకొంటూ కూర్చుంటే ఏం లాభం? కడుపులో ఆకలి తప్ప మిగిలేదేం వుండదు.

"తెలివుంటె తాయెత్తులు కట్టి బతకొచ్చు ఈ దేశంలో" అని ఒకసారి నువ్వే అన్నావుటగా. ఆదే చివరికి శరణ్యమయింది. మీ అన్నయ్యకు" వదిన అన్నది. నవ్వుతోంది తమాషాగా.

"ఆదా. రోగం స్పష్టంగా కనిపిస్తూంటే ఏదో ఒక డాక్టరు దగ్గర నయం కాలేదని భూతవైద్యులకోసం తిరుగుతున్నవారిని చూపి అనకేం చేయను. అక్కడికీ చెప్పాను. యింకొక మంచి స్పెషలిస్టుకు చూపించమని ఊరుకోలేక."

"పెళ్ళికి ముందరే పాపం ప్రేమలో పడ్డారు. 'సంపాదన లేందే పెళ్ళి చేసుకొని ఏం చెయ్యాలి, వీల్లేదు పొమ్మంది' ఆ అమ్మాయి. అప్పుడు పాపం గొప్ప చిక్కులో పడ్డారు. సంపాదనకోసం వివిధ మార్గాల్ని అన్వేషించసాగింది చురుకుగా బుర్ర. అప్పుడు నీ ఉపదేశం గుర్తొచ్చింది. ఏవో నాలుగు పుస్తకాలు చదివారు, నాలుగు రకాల మనుష్యుల్ని కలుసుకొన్నారు. అంతే: ఊకూ-వాడా, కట్టూ-బొట్టూ మార్చేశారు. నిత్యం జపం చేయడం మొదలుపెట్టారు. ఏ జపం

చేసేవారో, ఏ దేవి నామస్మరణ చేసే వారో మన కనవసరం.''

''ఈ దేవిని పెట్టుకొని యింకో దేవి నామస్మరణ ఎందుకు'' అన్నయ్య.

అడుగుల చప్పుడు వినిపించి మాటలు ఆపేశాడు. తలుపు తోసుకువచ్చింది ఒక పల్లెటూరు స్త్రీ.

''బాబుగారో బిడ్డకు నయమైపోనాది. డాట్టరు మందొద్దన్నా రిక. మీ మేలు మరిసిపోలేను. ఏంటివ్వను మీకు, ఏం టుంది నా కాడ——''

''ఏం వద్దు లచ్చీ, బిడ్డ కోలుకొంది, అంతే చాలు. పో ఇంటకి పో. పిల్ల ఒక్కర్తే వుండుంటుంది'' అన్నాడు. కొంగుముడి విప్పి అన్నయ్య చేతిలో రెండు రూపాయలు పెట్టబోయింది.

వాడి కళ్ళలోని వాత్సల్యం నన్ను కదిలించి వేసింది. ''ఆ డబ్బుపెట్టి పిల్లకు రెండురోజులు పళ్లు కొనిపెట్టు. ఏవన్నా అవసరమయితే మొహమాట పడక వచ్చి తీసుకుపో'' అంటున్నాడు, ''ఏదో నా తృప్తికోసం.''

''చూడు లచ్చీ! ఆ రెండు రూపాయలూ లేకపోతే నాకు గడవకపోటం లేదు. నీకు అక్కరకు వుపయోగిస్తాయి. ఇదే మరి నీ బాబుగారికి తృప్తి.'' వాడు ఆశయాలంటూ వాదిచ్చినప్పటి కళ్లలోని తళుక్కు యిప్పుడు చూడగలిగేను, వెళ్ళిపోయిందామె మళ్ళీ మళ్ళీ కృతజ్ఞతలు తెలుపుకొంటూ.

''ప్చ్! ఎంత నికృష్టపు బతుకులో, తలో సలాగా వెల్లకు మందిప్పించలేక భూత వైద్యమన్నా చేయిద్దామని నా దగ్గరకు తీసుకువచ్చింది. ఆరోజు వాళ్ళను చూస్తే గుండెలో కెలికినట్లయింది.ముందు డాక్టరు దగ్గరకు పంపాను'' వాడి కళ్ళు ఎక్కడో చూస్తున్నాయి. ఆ చూపులను ఒక లాంటి శూన్యత ఆవరించుకొంది.

''మరి అలా చేస్తూంటె నీ దగ్గరకేం వస్తారిక.'' నాలోని కుతూహలం నన్నాగ నివ్వలేదు.

''అందుకూ ఏదో తంతుచేశారు ..'' వదిన.

''వేప మండలూ, నిమ్మకాయలూ అంటూ కూర్చోక ఒక ప్రాణాన్ని నిలప గలిగావే'' మధ్యలోనే అడ్డుకొన్నవదిన. ''ఇది మామూలే'' అన్నది. ఇంతలో ఎవరో వచ్చారు, అన్నయ్య బైటికి వెళ్ళిపోయాడు.

అంతవరకూ మాట్లాడుతూంటె తెలీ లేదు కాని, అప్పుడు అలసటగా అన్పించింది. పక్కగదిలోకి వెళ్ళాను. గోడకు మడతమంచం ఆన్చి కన్పించింది వాల్చుకొని, దిండు——దుప్పటి వేసుకొని పడుకొన్నాను. నిద్రపట్టడం నాకు తెలియదు.

సాయంత్రం పొద్దు వాలిపోతూండగా మెలకువ వచ్చింది. చల్లని గాలి కిటికీ లోంచి వచ్చి శరీరాన్ని తాకుతూ, హాయిని కల్గిస్తోంది. కిటికీ అవతల మాటలు వినిపిస్తున్నాయి. అటుచూశాను,అన్నయ్య కూలీలతో మాట్లాడుతున్నాడు. ఇటుకల బండ్లు నిలిపి వున్నాయి పక్కన. ఇల్లు కడుతున్నాడు అన్నయ్య!



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

"జవాబు చెప్పు. మాట్లాడవేం? కోరి వచ్చిన ఆడపిల్ల చులకన అనే సామెత నా పట్ల నిజంచెయ్యకు. యివన్నీ మనసువిప్పి చెప్పానని, నన్ను సిగ్గు లేనిదానిగా భావించటం లేదుగా నువ్వు!

కృష్ణ చివ్వున నావైపు తిరిగాడు. అతని ముఖం వుత్తేజంగా వుంది. నా రెండు చేతులూ తన గుప్పిటలోకి తీసుకున్నాడు.

"మీనా! నువ్వు కనిపించినప్పుడల్లా నన్ను సుడిగాలిలా వుక్కిరి బిక్కిరి చేస్తూనే వున్నావు! జీవితంలో సవాలు ఎదుర్కోటమంటే నాకిష్టమే! కానీ యింత పెద్ద సవాలుగా నువ్వు నా జీవితంలోకి వస్తావని నేనుకలలో కూడా అనుకో లేదు."

"భయపడుతున్నావా?"

"నిజంగానే భయపడుతున్నాను. భవిష్యత్తులో ఎప్పుడైనా నువ్వు తొందర పడి యీ నిర్ణయం చేసుకున్నాననే రోజు వస్తే, ఆ క్షణంలో నేను జీవన్మృతుడిని అయినట్టే!....

"నువ్వు అలా అనుకునే క్షణంరాదు. ఏవాగ్దానం చేయమంటే అవి చేస్తాను! అతను మాట్లాడ లేదు నేను ఆశించినట్టు ఏవాగ్దానాలూ కోరలేదు. క్షణం ఆగిన తర్వాత, "సరే! నీ యిష్టప్రకారమే కానీ!" అన్నాడు.

"నిజంగానేనా?"

"నిజంగానే!"

"మనస్ఫూర్తిగానే అంటున్నావా?"

"మనస్ఫూర్తిగానే అంటున్నాను."

"మనమధ్య సాక్షిగా యింకెవరైనా వుంటే బాగుంటుందేమో!"

"సాక్షి! నామాటకి మించిన సాక్ష్యం

యింకేం కావాలి!''

''నాతృప్తికోసం, నువ్వుమరోలా అనుకోకు. మీ ఫ్రెండ్‌కి చెప్పేయ కూడదూ!''

''యిప్పుడేగా ఎవరకీ చెప్ప వద్దని షరతు పెట్టావు?'' పట్టుబడ్డట్టు చూసాను.

''అంటే, నీ వుద్దేశం,'' నసిగాను.

''నా కర్థమయిందిలే!'' కృష్ణ నా ముక్కుపట్టి వూపాడు. తర్వాత ''సరే! రా?' అంటూ చెయిపట్టి యివతలకి లాక్కు వచ్చాడు.

''మధూ!'' అంటూ ఆగిపోయాడు. కారణం అప్పటికే మధు గది గుమ్మానికి అభిముఖంగా నిలబడి వున్నాడు.

''క్షమించాలి, మీరు మెల్లగా మాట్లాడటం లేదు, నాకంతా వినిపించింది'' అన్నాడు.

''రక్షించావు. నాకు సగం బాధ తప్పింది మధూ! మీనా—నేనూ రేపు వివాహం చేసుకోవటానికి మాటఖరారు అయింది. దానికి నువ్వు సాక్షివి:'' అన్న కృష్ణ నావైపు ''చాలా?'' అన్నట్టు చూసాడు.

''శుభం! కంగ్రాచ్యులేషన్స్! కానీ పెళ్ళి ఎక్కడ?''

''అదే యింకా నిర్ణయం కాలేదు. రేపు ఆదివారం రిజిష్ట్రార్ ఆఫీసు వుండదు.''

నేను నిరాశగా ముఖం పెట్టాను. ఇది గమనించిన మధు వెంటనే అన్నాడు.

''రిజిష్ట్రార్ ఆఫీసు లేకపోతే పెళ్ళికి మార్గాలే లేవా? యిక్కడికి 10 మైళ్ళ దూరంలో కాలమ్మ గుడి ఒకటి వుంది. అక్కడ జరిగిన వివాహాలు శుభమయం అని ప్రతీతి. మీరు అక్కడకు వెళ్ళ దలుచుకుంటే నాకారు యిస్తాను.'

క్రృష్ణ నా వైపు చూసాడు, నేను అంగీకారం తెలిపాను.

కొద్దిసేపు అయిన తర్వాత మధు వెళ్ళి పోయాడు. రేపుగుడిలో శాస్త్రోక్తంగా వివాహం జరగటానికి అన్ని ఏర్పాట్లూ చూసే బాధ్యత అతను స్వీకరించాడు. కృష్ణ అతను మంచి స్నేహితులని—ఆ కొద్ది సేపట్లోనే నేను గ్రహించాను. మధుని గుమ్మంవరకూ సాగనంపి వచ్చిన కృష్ణ పరధ్యానంగా, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టుగా గది మధ్యలో నిలబడి పోయాడు. అతని ఆలోచన ఏమిటో నాకు అంతుపట్టలేదు.

''నువ్వు యిచ్చిన మాట తప్పావా? చూడుమరి!'' అన్నాను.

''యింకా నమ్మకంలేదా నీకు? యిచ్చినమాట తప్పే అలవాటు నాకెప్పుడూ లేదు. యిప్పుడుకాదు, ఎప్పుడూ నిన్ను నిరాశపరచను.సరేనా?'' అంటూ టేబిల్ దగ్గరకు వెళ్ళి కూర్చుని కాగితం కలం తీసుకుని వ్రాయసాగాడు

''ఏమిటది?''

''వుత్తరం:''

''ఎవరికి?''

''ఒక్క నిముషం ఆగు నువ్వే చూద్దువుగాని.''

నేను ఆగలేక పోయాను. కొంపదీసి నాన్నగారికి కాదుకదా అనిపించింది. అతని వెనకగా వచ్చి నిలబడి భుజంమీద నుంచి తొంగి చూసాను. త్వరత్వరగా వ్రాస్తున్నా అతని దస్తూరి నిలకడగా ఒకే రీతిగా వుంది. అతను వ్రాస్తున్నాడు.

ప్రియమైన అమ్మకి,

కృష్ణ నమస్కరించి వ్రాయునది. కొన్ని కారణాల వల్ల యిక్కడ నేను అత్తయ్యకి—మామయ్యకి తెలియకుండా మీనాని వెంటనే వివాహం చేసుకోవాల్సి వచ్చింది. వివాహం రేపే! ఈ ఉత్తరం తెచ్చిన అతనితో నువ్వు వెంటనే బైలుదేరివస్తే రేపు యిక్కడకి సమయానికి అందుకోగలవు.

ఇల్లు వీరాయికి అప్పచెప్పి వెంటనే బైలుదేరి రాగలవు.

నేను బాగా ఆలోచించే యీ నిర్ణయానికి వచ్చాను. ఇది ఏ మాత్రం తొందరపాటు కాదు.

నీ ఆశీస్సులు కోరుతూ,
కృష్ణ.

ఉత్తరం వ్రాయటం ముగిసిన కృష్ణ తలెత్తకుండానే భుజంమీద నుంచి నాకు ఆ కాగితం అందించాడు.

''చద్దు. చదివాను.''

కృష్ణనాకు అభిముఖంగా తిరిగాడు.

నేను అతని క్రాఫ్ చెరుపుతూ అన్నాను. ''నువ్వు నామాట మన్నిస్తున్నందుకు కృతజ్ఞురాలిని. ఇక భావి జీవితాంతం నీ మాట శిరసావహిస్తాను.''

''థాంక్యూ! కానీ నేనలాటి షరతులేమీ పెట్టటం లేదే.'' అన్నాడు.

నేను నిట్టూర్పు విడుస్తూ అన్నాను. ''అయితే యీ రాత్రికి నేను నిశ్చింతగా నిద్రపోతాను.''

''ఈ రాత్రి వరకూ కాదు, ఈక్షణం నుండి నువ్వు నిశ్చింతగా వుండాలి.''

''అయితే నేను వెళ్ళనా?''

''వెళ్ళి రానా అను!''

''వెళ్ళివస్తాను. సరేనా?''

కృష్ణ నాచేయి తన చేతిలోకి తీసుకున్నాడు, ''మిస్. సైక్లోన్. ఆఖరి క్షణంలో ఠోకా యిచ్చావంటే చూడు. పదిమంది బలగంతో వచ్చి నిన్ను ఎత్తుకుపోతాను.'' బెదరిస్తున్నట్లుగ అన్నాడు. నేను అతని చెయి గిల్లాను. ''తమకంత శ్రమయివ్వను లెండి!''

''తమరు యిక బైలుదేరితే నేను సెక్రటేరియట్‌కి వెళ్తాను. అక్కడ నాకు తెలిసినతను ఉన్నాడు, అతనికి ఈ వుత్తరం యిచ్చి అమ్మకోసంపంపుతాను. అతను త్వరగా వెళ్ళితేకాని, ఈ సాయంత్రానికి యింటికి చేరుకుని, మళ్ళీ రాత్రికి తిరుగు ప్రయాణం కాలేరు. నాకు బజారులో యింకా పనికూడా వుంది.''

కృష్ణనా కోరికమీద టాక్సీలో నన్ను

మామి యింటిదగ్గర దించి వెళ్ళిపోయాడు. మర్నాడు సరిగ్గా యిదే సమయానికి యిద్దరం మామి యింట్లో కలుసుకునేట్టు వాగ్దానం చేసుకున్నాం.

కృష్ణ వెళ్ళిపోయిన తర్వాత మామి నన్ను, "ఏమిటి విశేషం! యింత ఆనందంగా నిన్ను నే నెప్పుడూ చూడ లేదే?. .." అంది.

మామికి నేనూ—కృష్ణా రహస్యంగా వివాహం చేసుకో బోతున్న వైనం అంతా చెప్పాను. ఒక్క అమ్మా, నాన్న లకి మినహా మిగతా సర్వ ప్రపంచానికి నేను అతన్ని పెళ్ళిచేసుకో బోతున్నట్టు చెప్పాలని పిస్తోంది. మామి నా భుజాలు చుట్టు చేతులు వేసి హొదివి పట్టుకుంది. "అమ్మదొంగా! నువ్వేమీ అమ్మకిమించిన దానివి! కోరుకున్నవాడిని చల్లగా, గుట్టు చప్పుడు కాకుండా కొంగుకు ముడేసు కుంటున్నావా?" అంది.

నేను యింటికి వెళ్ళేసరికి అమ్మా—నాన్నా యింటికిరాలేదు. అమ్మ ప్రభావం అడుగడుగునా కన్పిస్తున్న ఆ పరిసరాలు చూసేసరికి వాళ్ల ఆనందం మెల్ల మెల్లగా నీళ్లు కారసాగింది, నేను ఎన్నడు ఎరగ నంత భయం — ఆందోళన నన్ను చుట్టేయ సాగినాయి. నే నసలు యింటికి యెందుకు వచ్చాను? మళ్ళీ కృష్ణని యీ కళ్ళతో చూడగలనా అనిపించ సాగింది.

అమ్మా—వాళ్లతోపాటు యింకెవరో భోజనానికి వచ్చారు. నే నంతకు ముందే ఎంగిలిపడి లేచాను. అమ్మ యింటికి రాగానే గబగబా నా దగ్గరకి వచ్చింది. "ఏదీ చీర? ఏరంగుది తెచ్చారు!" అంది.

"తీరా! షాపులన్ని తిరిగి తిరిగి కాళ్లు నొప్పులు యెక్కాయి మమ్మీ! కానీ ఒక్కటికూడా నచ్చలేదు, చివరికి యిదే బాగుంది అనుకున్నాం!" అన్నాను.

"సరే. ఏడిచినట్టుంది. అలా వున్నా వేం? తల నొప్పిగావుందా!" అంది. అవునన్నట్టు తలవూపాను.

"కాసేపు పడుకో." అని పురమా యించి క్రిందకు వెళ్ళిపోయింది.

ఆ రాత్రి నిద్ర పట్టలేదు. మనసు నిండా పిచ్చెక్కించేటన్ని భయ సందే హాలు! అమ్మ గదిలోకి వెళ్ళి యెవరూ చూడకుండా స్లీపింగ్ టాబిలెట్ తెచ్చు కుని వేసుకున్నాను. అయినా లాభం లేకపోయింది. మత్తుగా అని పించిందే తప్ప కంటిమీదకు కునుకు రాలేదు. రాత్రి పొద్దుపోయిన తర్వాత పడుకో బోయే ముందు అమ్మ గదిలోకి వచ్చింది. నా తలక్రింద దిండుసరిచేసింది. కాళ్ళపైపున వున్న బ్లాంకెట్ తీసి నడుంవరకూ కప్పింది. నాజుట్టు నిమిరి నా నుదుట మీద ముద్దు పెట్టుకుంది, ఆ తర్వాత "పిచ్చి సన్యాసి" అనుకోవడం విని పించింది. అమ్మ వెళ్లిపోయింది. నా గుండెల్లో రాయి పడ్డట్టు అయింది.

*　　　*

తెలతెల వారుతుండగా పల్చటి తెరలా

నిద్ర ఆవహించింది. గాఢ సుషుప్తి లోకి జారుతుండగా కోలాహలంగా మాటలు వినిపించాయి.

"అక్కా—అక్కా" అంటూ కేకలు, పరుగు వినిపించడంతో వులిక్కిపడి లేచి కూర్చున్నాను. నా ఎదురుగా బుట్ట బొమ్మ లాటి గౌనుతో స్వీటీ నిలబడి వుంది. నన్ను చూడగానే "అక్కా" అంటూ వచ్చి మెడచుట్టు చేతులువేసి బిగించింది. స్వీటీ నాకు పినతల్లి కూతురు మా అమ్మా - వాళ్లమ్మా అక్క చెల్లెళ్ల కూతుళ్ళు. బాబాయ్ విశాఖలో కోర మండల్ ఫాక్టరీలో మంచి వుద్యోగంలో వున్నారు. స్వీటీ నాకు మల్లేనే మాపిన్నికి ఒకే కూతురు. చిన్నప్పుడు రబ్బరు బంతిలా వుండేదని మా అమ్మేదాన్ని స్వీటీ అని పిలిచేది. అదే పెద్దయిన తర్వాత కూడా స్థిరపడిపోయింది. వసుంధర అన్న అసలు పేరు ఎవరికీ తెలియదు. చిన్నప్పుడు అదిలావు అని తెలుసుకాని, ఇప్పుడు చూసి ఆశ్చర్యపోయాను. గాలి ఫుల్‌గా వూదిన బెలూన్‌లా వుంది. ముఖం చలిమిడి సుద్దలా నిగనిగలాడుతూ వుంది. దానికితోడు కళ్లకేదో ఎఫెక్ట్ అయిందని జోడు పెట్టుకుంది.

స్వీటీ వెనకే మా అమ్మ—కక్కి లోపలకి వచ్చారు. నా కెలా అలవాటు అయిందో తెలియదు. పిన్నిని కక్కి అని పిలుస్తాను. అమ్మలాగే కక్కికూడా యెంతసేపూ ఆస్తి—అంతస్థు తూకం వేసి మాట్లాడుతూ వుంటుంది.

కక్కి లోపలకి రాగానే నా దగ్గరకు వచ్చి నాచెంపలు రాచి వేళ్లు కణతలకి నొక్కుకుంది.

"అమ్మాయికి అప్పుడే పెళ్ళికళ వచ్చేసింది" అంది.

అమ్మ నవ్వింది. నా తలమీద చెయి వేసి నిమిరింది. అప్యాయత నిండిన ఆ స్పర్శకి నేను ముడుచుకు పోయాను.

"లే! ముఖం కడుక్కుందువు గాని. అప్పుడే నీకోసం సారథి ఫోన్ చేసాడు. మళ్ళీ 8-30కి చేస్తానన్నాడు" అంది.

నేను లేచి క్రిందకి వచ్చాను. అమ్మ నన్ను తలంటుకి సిద్ధం కమ్మని పిలుస్తుండగా మళ్ళీ ఫోన్ వచ్చింది. అక్కడే స్వీటీతో మాట్లాడుతూ కూర్చున్న నేనే వెళ్లి ఫోన్ యెత్తాను.

"హలో! మీనా—" అవతలనుంచి సారథి ఏదో చెప్పబోయాడు.

"మీరు కోరినట్టే జరుగుతుంది. నిశ్చింతగా వుండండి." అనేసి ఫోన్ పెట్టేసాను.

స్వీటీ అపకుండా ఒకటే కబుర్లు చెబుతోంది. స్కూల్లో దానికి పంప్‌కిన్ అని పేరు పెట్టారుట. పరధ్యానంగా దాని మాటలు వింటున్నా—నా మనసంతా చెప్ప నలవి కాని వుద్వేగంతో బిగబట్టినట్టుగా వుంది. ఎంత త్వరగా సాయంత్రం అయిపోతే అంత బాగుండుననిపిస్తోంది. కానీ కాలం కదలటం లేదు. గడియారం ముల్లు

కొత్తగా కదలటానికి యిష్టపడనట్టు కదులుతున్నాయి.

అమ్మ, కక్కి తాయారమ్మ నాకు తలంటిపోసారు. అమ్మ నాచేత తాయారమ్మకి, నౌకర్లకి అందరికీ బట్టలు యిప్పించింది. తలంటి పోసుకుని కొత్త బట్టలు కట్టుకోగానే వెళ్ళి అమ్మకి నమస్కరించాను. "ఓహోహో! ఈరోజు భూమి తల్లక్రిందులయ్యేట్టు ఏదో వుంది. మీ నాన్నగారిని వదిలి మొదట నాకు నమస్కరిస్తావా!" అమ్మ నవ్వుతూ అంటూ లేవదీసింది. నన్ను దగ్గరకు తీసుకుని నుదుటిమీద గాఢంగా చుంబించింది. "ఈరోజు నా జన్మ తరించినట్టుగా వుంది! నిన్నిలా చూడటంకోసం ఎన్నిరోజులనుంచి కలలు కంటున్నానో తెలుసా?" అంది. అమ్మ ఎందుకోగాని యీరోజు చాలా సంతోషంగా వుంది. ఆవిడ సంతోషం చూస్తున్న కొద్దీ నేను మనసులో తప్పుచేసినదానిలా ముడుచుకు పోసాగాను

"అదేమిటి పైకి వెళ్తావేం? ఆఫీసు గదిలో నాన్నగారున్నారు. వెళ్ళి దణ్ణం పెట్టి రా!" అంది అమ్మ.

తప్పనిసరిగా ఆఫీసుగదిలోకి వెళ్లాను. నాన్నగారికి దగ్గరగా వెళ్లాలంటే నా కాళ్లు వణకసాగినాయి. అమ్మ ముందు నే నెంతయినా నటించగలను కానీ నాన్నగారి ముందు చిన్న అబద్ధంకూడా ఆడలేను. ఆయనని బాధ పెడ్తుందేమోనని ఏ మాత్రం అనిపించినా అలాటి ఆలోచనల జోలికే పోను. కానీ రాజు-కృష్ణ విషయంలో నేను చాలా పొరబడ్డానని తెలుసుకున్నాను. నాన్నగారికి వాళ్ళంటే యిష్టం వుంది. కానీ ఎందుకో తెలియదు. వాళ్లతో నా చనువు అంగీకరించటంలే దాయన. ఇది నాకు పెద్ద ప్రశ్నార్థకంగా వుంది.

నేను ఆఫీసురూమ్‌లోకి అడుగు పెట్టాను, బాబాయికూడా అక్కడే వున్నారు. వాళ్లిద్దరూ ఏదో మాట్లాడుకుంటున్నారు.

"అదుగో, మీనా వచ్చింది," అన్నాడు బాబాయ్.

అప్పటికే నాన్నగారు నన్ను చూసారు.

నేను మెల్లగా వెళ్లి మొదట బాబాయి వాళ్లకి నమస్కరించాను. తర్వాత నాన్నగారి కాళ్ళముందు వంగాను. నాన్నగారు నా జబ్బల్ని గుచ్చిపట్టి లేవనెత్తారు. అప్రయత్నంగా ఆయన ముఖంవైపు చూసాను. ఆ కళ్ళలో ఎలాటి నిరాదరణ కానీ, కోపంగానీ లేవు. నాతో అన్నారు: "అమ్మలూ! అత్తయ్యకోసం నిమ్మలూరు నిన్న మనిషిని పంపాను. బహుశా యిప్పుడో, ఇంకా కొద్దిసేపటికో వస్తుంది. కృష్ణనికూడా సాయంకాలం రమ్మని కోరాను" అన్నారు. నా గుండెలు ఝల్లుమన్నాయి. కృష్ణని నాన్నగారు కలిసారా? కృష్ణ ఏమన్నాడు? మా విషయం చెప్పేసాడా? ఆదుర్దా ఉవ్వెత్తున తరంగాల్లా లేచిపడింది.

"కృష్ణని మీరు కలిసారా?" ఖంగా

రుపి ఎలాగో అదిమిపట్టి అడిగాను.

''కలవలేదు. రెండుసార్లు ఫోన్‌చేస్తే దొరకలేదు. హోటల్‌కి వెళితే రూమ్ తాళంవేసి వుంది. చీటివ్రాసి రిసెప్షన్‌లో యిచ్చివచ్చాను. అందులో తప్పకుండా రమ్మనమని వ్రాసాను. కమలంకూడా వస్తున్న సంగతి వ్రాసాను. వస్తాడు. వాడు నామాట కాదనడు. ఈ విషయం రాజుకికూడా చెప్పాను.'' అన్నారు.

అక్కడనుంచి చప్పున కదిలి ఇవతలకి వచ్చేసాను. నా గుండెలమీద పెద్ద పర్వతం మోస్తున్నంత భారంగా వుంది. ఆఖరి నిముషంలో నాన్నగారు యుక్తిగా అంతా తారుమారు చేసి అమ్మ కోరిక ప్రకారం యీ సారధికి నన్ను కట్టబెట్టరు కదా అనిపించసాగింది.

అందరితోపాటు అన్నం తినాను. నేను చేస్తున్న ప్రతి పనీ యీ యింట్లో యిది ఆఖరుకదా అనిపించసాగింది.

అన్నం తిన్నతర్వాత నా గదిలోకి వచ్చాను. కాగితం, కలం తీసుకుని ముందు నాన్నగారి పేరిట మొదలుపెట్టి కొట్టేశాను. ఆ కాగితం చించేసి వేరే మొదలుపెట్టాను.

''మమ్మీకి,

నేను కృష్ణని పెళ్లి చేసుకుంటున్నాను. నీకు ఆశాభంగం కలిగిస్తే క్షమించవలెను.'' ఆ తర్వాత ఏం వ్రాయాలో ఎంత ఆలోచించినా కుదరలేదు. చివరకి ఆ రెండు వాక్యాలతోనే ముగించి సంతకం పెట్టేసాను. ఆ కాగితం నా వెంటే వుంచుకున్నాను. ముందే ఎక్కడైనా బైటపడితే ఏ తాయారమ్మో చూసివుంటే నా ప్లాన్ అంతా ధ్వంసం అయే ప్రమాదం వుంది. వాకిట్లో షామియానా వేయడం పూర్తి అయింది. లారీలో కుర్చీలు వచ్చాయి. వాటిని దమదమ శబ్దంతో వరుసలుగా అమరుస్తున్నారు. రంగు లైట్లవాళ్ళువచ్చి రంగురంగుల బల్బులు తోరణాలుగా వేళ్లాడ దీస్తున్నారు. యీ సందడి అంతా గమనించిననాకు ఎంత వద్దనుకున్నా కళ్ళు చెమ్మయినాయి. అమ్మ కేవలం ప్రధానం కోసమే యింత ఆర్భాటం చేస్తోందికదా! అసలు పెళ్ళికి యింకెంత చేస్తుందో అనిపించ సాగింది. మా అమ్మ చాలాసార్లు తెలిసినవాళ్ళలోనూ, మిసెస్ లింగం లాటి వాళ్ళతోనూ, ''మా మీనా పెళ్ళి అనేది నాకు ఒక తియ్యటి కల! యీ కలని అందరి హృదయాల్లో చెరిగిపోనంత అందమైన ముద్ర వేసేటంత ఘనంగా దాని పెళ్ళిచేయాలి. యిదొక్కటే నా కున్నకోర్కె.'' అని అనటం చాలా సార్లు విన్నాను. ఈ రోజు ఆ మాటలు పదేపదే నన్ను వెంటాడసాగినాయి. నేను కలిగించిన నిరాశని అమ్మ ఎలా తట్టుకుంటుందా అన్నదే నాకు ప్రశ్నార్థకంగా వుంది.

3 గంటలు దాటుతుండగా నేను మెల్లగా అమ్మ దగ్గరికివచ్చి, ''మమ్మీ! ఒక్క నిముషం నేను గుడికి వెళతాను''

# అద్భుతమైన రుచి
## ఒక లక్షణమైతే



# బలవర్ధకమైన పోషకత్వం మరొక శ్రేష్టమైన లక్షణం

ఆహా! కరకరలాడిస్తూ తినటం పోషణ పొందటం ఎంత బాగుంటుంది! పార్లే గ్లూకో బిస్కట్లలో పాలు, గోధుమ పంచదారలోవి సారం, అత్యధికంగా ప్రోటీన్లు, విటమిన్లూ కూడా ఉన్నాయి.




## పార్లే గ్లూకో బిస్కట్లు
### ప్రత్యేకించి పిల్లలకు ఎంతో మంచివి

భారత దేశంలో అత్యధిక మైన అమ్మకం కలిగిన బిస్కట్లు

everest/71/PP Tel

అని అడిగాను. అమ్మ యీ మాట విన గానే నుదురు కొట్టుకుంటూ 'అయ్యో! నా తెలివి మండిపోనూ! ఉదయమే పంపిద్దామనుకుని, యీ హడావిడిలో మరిచిపోయాను సుమా!' అంది. ఇప్పుడు మాత్రం ఏమైంది! కారులో ఎంతసేపు వెళ్ళిరావాలి. "వెళ్లిరమ్మను" అంది అక్కడే కూర్చున్న కక్కీ.

"ఇప్పుడెలా! ఓ చెంప అవతల టైమ్ అయిపోతుంటే."

"ఫర్వాలేదు మమ్మీ! ఒక్క నిము షంలో వచ్చేస్తాను" అన్నాను.

"సరే! కక్కీని తీసుకుని వెళ్ళు" అంది. నేను భయంగా చూశాను.

"నేనా! రాత్రంతా నిద్ర లేదే అమ్మాయీ! నా కాళ్లు లాగుతున్నాయి. స్వీటీ నువ్వూ వెళ్లిరండి" అంది కక్కీ బద్ధకంగా.

"స్వీటీరా!" అంటూ చెయ్యిపట్టి లాగాను. గుడికి బైలుదేరేముందు నిమ్మ లూరులో కృష్ణ యిచ్చిన జరీ చీర తీసు కుని కట్టుకున్నాను. జాకెట్లోపల వుంచు కున్న ఉత్తరం తీసి టేబిల్ మీద పెట్ట బోయాను. కానీ చేతులు వణికాయి. ఒక వేళ యీ లోపలే అమ్మ చూసేస్తే! నన్ను మధ్యలోనే లాక్కువచ్చే ప్రమాదంవుంది. అందుకని చీటీ అక్కడ వదలకుండా నాతోనే తెచ్చుకున్నాను. నా గుండెల్లో రైళ్లు పరుగెత్తుతున్నాయి. చెవుల్లో వేయి విమానాలు దూసుకుపోతున్న శబ్దంగా వుంది.

స్వీటీ చేయి గట్టిగా పట్టుకుని బైట వేచివున్న కారులో కూర్చున్నాను.

ఈ మధ్యనే కాలాపహాడ్ మీద చలువ రాతితో వెంకటేశ్వరస్వామి దేవాలయం కట్టారు. చిన్న కొండమీద ఎత్తుగా వున్న ఆ గుడి తలుపులు 24 గంటలు తెరిచే వుంటాయి. దేవుడికి పువ్వులు-పళ్లు ఏమీ యివ్వకూడదు. మనస్ఫూర్తిగా దణ్ణం పెట్టి యివతలకి రావటమే!

కారు కొండమీదకి వెళుతుంది. కారు దిగి నేను—స్వీటీ పైకి వెళ్ళాం. కళ్లు మూసుకుని, చేతులు జోడించాను.

"భగవాన్! నేను ఏరికోరి వెళుతున్న యీ మార్గంలో నాకు కష్టాలు—నిట్టూ ర్పులు వుండేలా చేయద్దు! ఒకవేళ నా దురదృష్టంవల్ల అలాటివి ఎదురైతే వాటిని ధైర్యంగా ఎదుర్కోగల ఓర్పు - నేర్పు నాకు ప్రసాదించు!" అని మన స్ఫూర్తిగా ప్రార్థించాను.

స్వీటీ, నేను గుడినుంచి యింటి ముఖం పట్టాం! నరనరంలోనూ విద్యుత్ తరంగాలు ప్రవహిస్తున్నట్టు వర్ణించ నలవికాని ఏదో థ్రిల్! మేఘాల మీద నడుస్తున్న అనుభూతి! ఇంద్ర ధను స్సుని చేత్తో అందుకుంటున్నట్టుగా ఆనందం! స్వతంత్రించి ఒక నిర్ణయం తీసుకోవటంలో యింత ఆనందం వుందని నా కింతవరకూ తెలియదు. తెలిస్తే ఎప్పుడో ఎదురుతిరిగి వుండేదాన్ని! అలా



యువ

# బ్లూలు ఆమె దుస్తులకు అతుకులుగల తెలుపుదనమును యిచ్చేయి

# ఇప్పుడు టినోపాల్ వాటిని కళ్లు మిరుమిట్లు గొలిపేలా తెల్లగా చేస్తుంది





ఆమె తల్లి [illegible] బ్లూలు తన పిల్ల దుస్తులకు అతుకులతో నిండిన తెల్లదనమును యిచ్చినట్లు ఆవిడ కనుగొన్నారు. దుస్తుల మీద నీలి రంగు మచ్చలు పడేవి. కనుక ఆవిడ టినోపాల్ వాడడము ప్రారంభించేరు.

ఇప్పుడు టినోపాల్ వారి దుస్తులన్నిటిని కళ్లు మిరుమిట్లు గొలిపేలా తెల్లగా చేస్తుంది—తెల్లటి తెలుపు అది. బట్టలను ఆఖరుసారి జాడించే ముందు నీళ్లలో టినోపాల్ ప్యాకెట్ వేస్తే దాల్బేడు బట్టలు తెల్లగా అవతాయి.

Tinopal

15 పైసల ఒక ప్యాకెట్ దాల్బేడు బట్టలను కళ్లు మిరుమిట్లు గొలిపేలా తెల్లగా చేస్తుంది

ఇతర సైజులు:
రెగ్యులర్ ప్యాక్ మరియు మితవ్యయ ప్యాకులో లభిస్తోంది

నేడే టినోపాల్ వాడుట ప్రారంభించండి

**సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్!**

®టినోపాల్ జె.ఆర్. గైగి ఎస్.ఎ., బాసిల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహృద్ గైగి లిమిటెడ్, పి. ఒ. బాక్సు 11050, బొంబాయి 20 బి.ఆర్.

Shilpi HPMA 17A/71 tel

ఎప్పుడో ఎదురుతిరిగి వుండే నా జీవితంలో ఎంతో ముఖ్యమైన యీ రోజున యిలా పారిపోవాల్సిన ఖర్మ నాకుండేది కాదు!

మా కారు చుట్టూ తిప్పి మామీవాళ్ళ సందువక్కనుంచి తీసుకువెళ్ళమని కోరాను. మామీవాళ్ళ సందు రాగానే అక్కడ ఆపమని డోర్ తెరుచుకుని దిగుతూ, "డ్రైవర్! నేనిక్కడ ఒక ఫ్రెండ్ దగ్గరకి వెళ్తాను. ఒక గంట తర్వాత కారు తీసుకురా. ఇదుగో చూడు. ఈ గల్లీలో చివర రెండో యిల్లు అని చెప్పాను. డ్రైవర్ తల వూపాడు.

"నేనూ వస్తానుగా!" అంది స్వీటీ.

"నువ్వు వద్దు. ఆ స్నేహితురాలికి నేనొక్కదాన్నే వస్తానని మాట యిచ్చాను. అంతగా అయితే మళ్ళీ కారులో నువ్వూ రా. నన్ను తీసుకువెళుదువు గాని" అన్నాను, స్వీటీ ఆశాభంగంగా చూసి. సరేనన్నట్లు తల వూపింది. కారు కనుమరుగు అవగానే, నేను మెయిన్‌రోడ్డు మీదనుంచి సందులోకి మలుపు తిరిగాను. తిరగగానే దూరంగా మామి యింటి ముందు మధు కారు కనిపించింది. అంటే కృష్ణ వచ్చేసాడన్నమాట! నా అడుగులు గబగబా పడ్డాయి! మామి యిల్లు యింకో నాలుగైదు గజాలు వుందనగా యిక నడవటం నావల్ల కాలేదు. పరుగు పెట్టేసాను. గేటు తెరుస్తుండగా, ఎదురుగా వరండాలో కృష్ణ కనిపించాడు. మామి, మొదలియార్ గారు కూడా అక్కడే వున్నారు. నన్ను చూడగానే కృష్ణ రెండంగల్లో వచ్చినట్టుగా గేటుదగ్గరకి వచ్చాడు.

"నువ్వు రావనే అనుకున్నాను." అన్నాడు. నన్ను చూడగానే అతని ముఖంలో కనిపించిన భావం అపరూపమైనది! వర్ణించ సాధ్యం కానిది! అతని చూపుల్లోవున్న మహత్తు ఏమిటో కాని, నాకు ఒక్కసారిగా వేయి ఏనుగుల బలం వచ్చేసింది!

"నేనుకూడా రాలేనేమో అనుకున్నాను." అన్నాను.

"ఇఫ్ దెరీజ్ ఎ విల్, దెరీజ్ ఎ వే అన్నారు" అన్నాడు.

"నిజం కాబోలు!" నవ్వాను.

"మనతో మామి-మొదలియార్‌గారు కూడా వస్తున్నారు. వీళ్ళకి మధు బాగా తెలుసుట! నా తరపున మధు—నీ తరపున వీళ్ళు" కృష్ణ నవ్వాడు.

మామి నన్ను చూడగానే గబగబా తాళంవేసి వచ్చింది. మామి చేతిలో పెద్ద ప్లాస్టిక్‌బాగ్ వుంది. అందులో తడిగుడ్డ చుట్టి ఏమిటో వున్నాయి. ఆ బుట్ట ముందుసీటులో కూర్చుంటున్న మొదలియార్‌గారికి అందిస్తూ, 'భద్రంగా పట్టుకోండి" అంది. వెనకసీటులో మామి, నేను, కృష్ణ ఎక్కాం.

కారు కదిలింది.

* *

మేం వెళ్ళేసరికి గుడిదగ్గర పెళ్ళికి కావాలిసిన ఏర్పాట్లన్నీ సిద్ధం చేసి వున్నాయి. మధూ యింకో కారులో అక్కడికి వెళ్ళాడు. అతనితోపాటు పురోహితుడూ కాక యింకో యిద్దరు వున్నారు.

మధు మమల్ని చూడగానే ఆదుర్దాగా ఎదురొస్తూ, "యిదేమిటి? యింత ఆలస్యం చేశారేం?" అన్నాడు.

"మీనా రావటం ఆలస్యం అయింది" అన్నాడు కృష్ణ.

మధూ నా వైపు చూసి నవ్వుతూ అన్నాడు. "మీరు వచ్చేవరకూ మాకు నమ్మకంలేదు. మీరు రారేమోనని మా అనుమానం! వస్తారని నా ధైర్యం."

మేం యిద్దరం పందెం వేసుకున్నాం.

మా వెనక వస్తున్న మామి, "ఎంత ఆలస్యం అయినా కాసివ్వండి. మీరు నాకు ఒక పది నిమిషాలు టైమ్ ఇవ్వాలి. నేను కష్టపడి పూలజడ తయారుచేశాను. అది అమ్మాయి జడకి టాకా వేయాలి." అంది.

"ఇప్పుడు అవన్నీ ఎందుకు మమ్మీ!" అభ్యంతరం చెప్పబోయాను నేను.

"నా తృప్తికోసం. మీ యిద్దరూ మా యింటి దగ్గరనుంచి బైలుదేరి వచ్చి వివాహం చేసుకుంటున్నారు. మీకు ఏ లోటూ వుండకూడదు, ఇలారా! ఇక్కడ కూర్చో. రెండు నిముషాలు కూడా పట్టదు ' మామి నన్ను జబ్బపట్టుకుని అక్కడున్న గదిలోకి తీసుకువెళ్ళింది.

ఆ దేవాలయం చిన్న గుట్టమీద వుంది పెళ్లి చేసుకున్నవాళ్లు ఒకటి రెండు రోజులు అక్కడ వున్నా యిబ్బంది లేకుండా గదులు వున్నాయి. దేవాలయంవాళ్ళే వంటకి పాత్రలవీకూడా యిస్తారుట.

మామి, నన్ను గదిలో ఒక స్టూలు మీద కూర్చోమని, సూదీ, దారం తీసి, మొదలియార్‌గారిని నా జడ ఎత్తిపట్టుకోమని పురమాయించి వెంట తెచ్చిన పూల జడ గబగబా టాకాలు వేసింది. ఆవిడ అన్నట్టుగానే ఐదునిముషాల్లో పూర్తి చేసింది. చివరకి పెద్ద దండ తీసి నా తల్లో తురుముతూ, "ఆడపిల్లలు అంటే నా కెంత యిష్టమో మీ మొదలియార్ గారిని అడుగు చెబుతారు. ఆడపిల్లని కనటం, పెంచటం, తగినవాళ్లని చూసి జోడు కుదర్చటం, వాళ్ల పిల్లల్ని కంటే, ఒళ్ళో వేసుకుని ఆడించటం యిదంతా ఎంత మురిపం! ఆడదాని జీవితానికి ఎంత అనుభవం!

అందుకే అన్నారు కాబోలు, "పిల్లలు లేని ఆడది పాషాణంతో సమానం అని." అంటూనే నా నుదుట కళ్యాణ తిలకం పెట్టింది. బుగ్గన కాటుక దిద్దింది.

"అవతల టైమయిపోతూంటే ఏమిటి ఈ ఆలస్యం?' మొదలియార్‌గారు విసుక్కున్నారు.

తర్వాత అరగంట నా జీవితానికి

# మీకు ఏ కారణము వల్ల తల నొప్పి వచ్చినా

# అది ఒకే ఒక సారిడన్‌తో మటుమాయమై పోతుంది

ఒకే ఒక సారిడన్ నొప్పిని త్వరగా పోగొట్టుతుంది. ఇంతే గాక, అందులో వున్న ప్రత్యేక పదార్థముల వలన సారిడన్ తల నొప్పి, ఒంటి నొప్పి లేకవల్ల నొప్పితో బాటు కలిగే భారమును పోగొట్టును మరియు మీకు హాయి నవోత్సాహమును కలిగించును అదే సారిడన్ ప్రత్యేకత!

## సారిడన్

'రోష్'

తరించ లేని గొడవ వలన తల నొప్పి

ఎక్కువగా పని చేయుట లేక మామూలు అలసట వలన తల నొప్పి

అసౌఖ్యము కలిగి బాధగా వుండే రోజులలో తల నొప్పి

ఎండ, వేడి వలన తల నొప్పి

ముక్కు దిబ్బడ వేయుట లేక విపరీతంగా రొంప పట్టుట వలన తల నొప్పి

కళ్ళ భారము లేక ఎక్కువగా చదువుట వలన తల నొప్పి

'రోష్' తయారీ

అత్యంత ముఖ్యమైనది! వివాహపు కార్యక్రమం గబగబా ముగిసింది। దేవుడి సన్నిధిలో, మధు, మామి సాక్షులుగా నిలబడగా, కృష్ణతో నా వివాహం శాస్త్రోక్తంగా జరిగిపోయింది. మధు ఎక్కడ నుంచి సంపాయించుకు వచ్చాడో! సన్నాయివాళ్లుకూడా వచ్చారు.

కృష్ణ మంగళసూత్రాలు పట్టుకుని నాకు అభిముఖంగా నిలబడినప్పుడు అతని చేతులు కొద్దిగా కంపించటం, నుదుటిమీద చిరుచెమటలు అలుముకోవటం నేను గమనించక పోలేదు. నా కిదంతా ఒక అద్భుతమైన కలగా, విచిత్రంగా, నమ్మశక్యం కానట్టుగా, నా ఒంటిమీద తెలివి లేని సమయంలో ఏదో యాంత్రికంగా జరిగిపోతున్నట్టు అనిపించసాగింది.

మంగళ సూత్రధారణ ముగియగానే మధు చెమ్కీ చుట్టిన రెండు పెద్దపెద్ద గులాబీదండలు తెచ్చియిచ్చి మమ్మల్ని వేసుకోమని కోరాడు.

మేం అవి వేసుకోగానే, "భేష్! మీ యిద్దరినీ చూస్తుంటే, కలిమి, లేమిని వరించి వచ్చినట్టుగా వుంది. మనదేశంలో మాటికి కనీసం పది వివాహాలయినా యిలా ధైర్యంగా జరిగితే ఎంత బాగుండును!" అన్నాడు.

మామి శివపార్వతులు కలిసివున్న పలువరాతి విగ్రహం బహూకరించింది. నా బుగ్గ గిల్లుతూ, "నేను ప్రత్యేకంగా యిదే ఎందుకు తెచ్చానో తెలుసా," పార్వతి శంకరుడిని ఎన్నుకున్నట్టు నువ్వు మీ బావని ఎన్నుకున్నావు. అందుకని!" అంది. అందరూ నవ్వారు.

మధు కాఫీ చేయిస్తున్నానని చెప్పాడు. నేను, మామి లోపల గదిలోకి వెళ్లి కూర్చున్నాం. నేను యింకా నమ్మకం కలగనట్టు పైటమీద వున్న మంగళసూత్రాలని చేత్తో తాకి చూసుకోసాగాను. పచ్చగా, తియ్యటి అనుబంధంలా వున్న ఆ పసుపుతాడు రెండు మంగళసూత్రాలూ కనిపిస్తున్న మా యిద్దరి జీవితాలని ఏకం చేసి బంధించి, పక్కపక్కన నిలబెట్టి నట్టుగా వుంది.

మధు మా యిద్దరికీ కాఫీ యిచ్చాడు. మేం కూర్చుని తాగుతుండగా, కృష్ణ గదిలోకి వచ్చాడు. మామి, అతన్ని చూడగానే, "నా కాఫీలో పంచదార తక్కువైంది" అంటూ అక్కడనుంచి వెళ్ళిపోయింది.

ఒక్క నిముషం. నేను-కృష్ణ ఒకరిని ఒకరు చూసుకుంటూ నిలబడిపోయాం. మా యిద్దరి కళ్ళలో ఒకే భావం! ఇది కలా-నిజమా అనే సందేహం. కృష్ణ దృష్టి నా మెడలో వున్న మంగళసూత్రాల మీద నిలిచిపోయింది.

"మీనా!" ఏదో చెప్పబోయాడు.

ఇంతలో మధు గ్లాసుతో కాఫీతెచ్చి కృష్ణకి యిచ్చి వెళ్ళాడు.

కాఫీగ్లాసు నోటిదగ్గర పెట్టుకోబోతున్న అతను, హఠాత్తుగా ఆగి, జేబు తడుము

కుంటూ, విమ్మలూరునుంచి మనిషి వచ్చాడు. అమ్మ రాలేదు. ఉత్తరం వ్రాసి పంపింది.'' అంటూ వుత్తరం తీసి యిచ్చాడు.

''ఏముంది అందులో?'' భయంగా అడిగాను.

''నువ్వే చదువు.''

నేను వుత్తరం తీసుకున్నాను. అందులో యిలా వుంది.

చిరంజీవి కృష్ణకి,

ఆశీస్సులు. నువ్వు వ్రాసిన వుత్తరం అందింది. ఒకటికి పదిసార్లు చదివినా, అందులో విషయం నాకు బొత్తిగా అంతు పట్టలేదు. ఎందుకంటే, ఈరోజు మధ్యాహ్నం, హైదరాబాద్ నుంచి, మామయ్య మనిషిని పంపాడు. ఆ మనిషి తెచ్చిన ఉత్తరంలో, మామయ్య, ''రేపు సాయంత్రం చిరంజీవి మీనాక్షి, సారథితో వివాహ ప్రధానం జరుగుతోంది. కాబట్టి నువ్వు తప్పక రావలెను'' అని వుంది. ''చిరంజీవి, రాజేశ్వరి-కృష్ణాకూడా యిక్కడే వున్నారు. నువ్వుకూడా వస్తే నాకు సంపూర్ణమైన సంతృప్తి లభిస్తుంది నేనే స్వయంగా వచ్చి నిన్ను తీసుకురావలె అనే వుద్దేశ్యంతో ముందుగా వుత్తరం వ్రాయలేదు. చివరి నిముషంలో, అనివార్య కారణాలవల్ల నేను రాలేకపోయాను. నువ్వు ఎలాంటి సంశయాలు లేకుండా వెంటనే బైలుదేరి రావలసిందిగా మరీమరీ కోరుతున్నాను. నువ్వు యిక్కడికి వస్తే, యిక్కడ నాకు తెలిసిన నలుగురైదుగురు కుర్రాళ్లు వున్నారు. నువ్వు వాళ్ళనిచూస్తే. మీకు నచ్చినవాడిని రాజేశ్వరికి ఖాయం చేసి, వచ్చేనెల అయిదవతేదీన యీ రెండు వివాహాలు ఘనంగా నా యింట్లో చేయాలని నా సంకల్పం. నువ్వు రాక పోతే నేను చాలా బాధపడతాను.'' అంటూ వ్రాసాడు. నేను ఆ వుత్తరం చూసి ప్రయాణం అవాలా వద్దా అని తికమక పడుతుండగా, నువ్వు పంపిన మనిషి వచ్చాడు. నీ వుత్తరం చూసిన తర్వాత నా మతి పోయింది. మామయ్యకి - అత్తయ్యకి తెలియకుండా, నువ్వు మీనాని రహస్యంగా, అంత అత్యవసరంగా పెళ్లి చేసుకోవాల్సిన విపత్కర పరిస్థితులు ఏం వచ్చాయో నాకు అర్థం గావటంలేదు. అత్తయ్యకి మనమీద వున్న చిన్నచూపు నీకు తెలియంది కాదు. నువ్వు యుక్తా యుక్త జ్ఞానం బాగా తెలిసినవాడివి. దూరపు ఆలోచన లేకుండా త్వరపడవనే నమ్మకం నాకుంది! ఒకవేళ నువ్వు తప్పని సరిగా మీనాని రహస్యంగా వివాహం చేసుకోవాల్సి వస్తే, మీరు సరాసరి యింటికి రావద్దు. అక్కడనుంచి నేరుగా తిరుపతి వెళ్లి ఆ శ్రీనివాసుడి ఆశీస్సులు పొంది రావలెను. ఇది నా కోరిక. తప్పని సరిగా తీర్చవలెను. నా యీ వుత్తరం నీకు ముందుగా అందితే, యింకోసారి ఈ వివాహం విషయం నువ్వు బాగా ఆలోచించి మరీ నిర్ణయం తీసుకోవలెను.

నువ్వు యీ కుటుంబం గుడిబండగా పడటంతో, చిన్నప్పటినుంచి సుఖం లేకుండా పెరిగావు. కనీసం, నీ వివాహజీవితం అయినా సలక్షణంగా, కళకళలాడుతూ గడిపితే చూసి ముచ్చటపడాలనే కోరిక మినహా నా కింకే ఆశలేదు. నీ గురించి మంచి కోరే అమ్మగా యింతకంటే యింకేం వ్రాయలేను. సకల ఆశీస్సులతో, అమ్మ.''

ఆ వుత్తరం చదివినవెంటనే నేను తల ఎత్తలేకపోయాను.

ఆ వుత్తరంలో అత్తయ్యకొడుకు ఘుఖంపట్ల పడుతున్న బెంగ, భయం అందులో అక్షరక్షరం వెనుక తొంగి చూస్తున్నాయి. దీన్నిబట్టి కృష్ణ నన్ను చేసుకోవటం అత్తయ్యకి ఏమాత్రం యిష్టంలేదని తెలుస్తూనే వుంది. ఇది నాకు మరో ఆశాభంగం!

ఉత్తరం చదివిన వెంటనే తలెత్తక పోవటంతో కాబోలు, కృష్ణ నేను కూర్చున్న బెంచీమీదనే నా పక్కగా కూర్చున్నాడు.

''అమ్మకి నేను నచ్చచెప్పగలను. ఆ ధైర్యం నాకుంది.'' అన్నాడు.

అది కేవలం నన్ను ఓదార్చటానికి అని తెలుస్తూనేవుంది.

క్రింద పెట్టిన కాఫీగ్లాసు తీసి అందిస్తూ, ''తీసుకో. చల్లారిపోతోంది. తాగు!'' అన్నాడు.

ఎందుకోగాని నా కళ్ళలో నేనెంత నిగ్రహించుకున్నా ఆగకుండా, నీళ్లు కమ్ముకోసాగినాయి. అతను వాటిని చూడటం యిష్టం అనిపించక తల వంచుకున్నాను. ఇతనికి మా అమ్మ నోటి దురుసుతనం తెలుసు! అవతల అత్తయ్య సున్నితమైన మనసూ తెలుసు! అయినా సరే! ఆ యిద్దరి అభిప్రాయాల్ని కాదని, నా మాటకి విలువ యిచ్చి, నేను కోరినట్టు పెళ్లి చేసుకున్నాడు. నాన్నగారి ముందు నా పంతం నెగ్గేలా చేసాడు! అత్తయ్య వుత్తరం పెళ్ళికి ముందు అందినా, ఆతను వెనక్కి తగ్గలేదు. ఏమౌతోనే అని తటపటాయించలేదు. కృష్ణ అత్తయ్యకి బాధ కలిగించే ఏ చిన్నవిషయమూ చేయడని నాకు తెలుసు! అతనికి బుద్ధితెలిసిన తర్వాత తల్లి నిర్ణయం కాదన్నది యిదేనేమో!

మధు లోపలకి వచ్చాడు.

''నా పని అయిపోయింది. మధ్యవర్తిగా, సాక్షిగా నా కర్తవ్యం నేను నెరవేర్చాను. ఇక జరగబోయేదేమిటి?'' అన్నాడు.

''జరగబోయేదేముంది? సరాసరి మామయ్య దగ్గరకి వెళ్ళటం. వాళ్ళ తిట్లో, దీవెనలో అందుకుని, రాత్రికి వూరు వెళ్ళటం!''

''మా యింటికా! ఇప్పుడా!'' నేను గుండెలమీద చెయి ఆనించుకున్నాను.

''అవును మీనా! నేనసలు యీ రాత్రికే నిమ్మలూరు వెళ్ళిపోవచ్చు ననుకున్నాను. అమ్మ యీ ప్రయాణం ఒకటి

పెట్టింది. మధూవికూడా మనతో రమ్మన మని నేనే బలవంతం చేస్తున్నాను."

"ఇప్పుడే—యిక్కడనుంచే వూరు వెళ్లిపోదాం. మా యింటికి వద్దు."

"పిరికివాళ్లలా పారిపోదాం అంటావా? పెళ్లికాక ముందయితే కాదంటారేమోనని భయం. ఇప్పుడింక భయం దేనికి?"

"ఇప్పుడు వెళితే ఇంకేమైనా వుందా? మా అమ్మ సంగతి నీకు తెలియదులా వుంది. అక్కడకు వెళితే ఎదురయే అవమానం—ఆ తిట్లు—"

"తెలుసు. తెలుసు కాబట్టే వెళదాం అంటున్నాను. మనం ఎప్పటికైనా వాళ్ల ముందు పడక తప్పదు. అది ఎంత త్వరగా జరిగితే అంత మంచిది. కొత్త నలుగురూ నాలుగు రకాలుగా అనుకున్నా పుకార్లు వుండవు. మనం పెళ్లి చేసుకున్నాం అనే సంగతి తెలుస్తుంది. అత్తయ్యకి-మామయ్యకి. ముందు మనం అవమానం పొందినా. బైట ప్రపంచంనుండి వచ్చే విమర్శనుంచి వాళ్లని తప్పించిన వాళ్లం అవుతాం."

"అనేవాళ్ళు ఎప్పుడూ అంటారు. మనం వాళ్లని ఆపలేం"

"సగం అయినా ఆపగలం! నువ్వు పెళ్ళిచేసుకున్న వార్త వెంటనే తెలియటం వేరు. నువ్వు ఎవరితోనో వెళ్ళిపోయావనే పుకారు పొక్కటం వేరు! అయినా అన్నీ భరించే వాడిని నేనుంటే నీ కెందుకు భయం?"

కృష్ణకినేనునచ్చ చెప్పలేక పోయాను. అతను యెందుకోగాని, యిక్కడనుంచి సరాసరి మాయింటికి వెళ్ళి, మా అమ్మకి నాన్నకి కనిపించి తీరాలని పట్టుపట్టాడు.

"అమ్మ నన్ను నీ వెంట తిరిగి రానివ్వకపోతే? నా కాళ్ళు విరక్కొట్టి యింట్లో కూర్చో బెడితే—"

"మీ అంత తెలివి హీనురాలేంకాదు. మనిద్దరికీ శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. నువ్వు నా భార్యవి! నానుంచి నిన్ను ఎవరూ విడదీయలేరు!"

అతని నోటినుంచి "నువ్వు నా భార్యవి!" అన్నమాట నా చెవుల్లో అమృతం పోసినట్టుగా అయింది.

"సరే! పద! నీకింత తిట్లు తినాలని సరదాగా వుంటే ఇకెందుకు కాదనటం." అన్నాను నేను.

నేను. కృష్ణ ఒకకారులో బైలుదేరాం! రెండో కారులో మధు, మామి. మొదలియార్‌గారు, మిగతావాళ్ళు ఎక్కారు. మామి రాత్రికి మమ్మల్ని భోజనానికి రమ్మనమని మరీమరీ చెప్పింది. కృష్ణ ఇప్పుడు కాదని, యింకోసారి తప్పక వస్తామని నచ్చచెప్పాడు. మామి వెళ్ళే ముందు నా చెవిలో, రహస్యంగా, "అమ్మణీ; ప్రస్తుతానికి నీ మొగుడుకి

లోపలి వెలుపలి గోడల కన్నిటికీ రంగు వేయుటకు—

# డెకోప్లాస్ట్





## క్రొత్త ప్లాస్టరుపై వేయదగ్గ ఒకేఒక రంగు— ప్రైమరుతో పనే లేదు!






రంగులు విరిసిన
రంగారు జీవితానికి
ఏషియన్
పెయింట్స్

AIYARS.A.170 TEL

డబ్బు—దస్కం లేదని, మీ అమ్మ ఎగిరి పడినా, తర్వాత అతని బుద్ధి, వ్యక్తిత్వం చూసి రాజీపడకమానదు. నీ పక్కన నిల బడితే మన్మధుడిలా వున్నాడు. ఇంత మంచి వాడిని నేనెక్కడా చూడలేదు, త్వరగా మనవడినో, మనమరాలినో కని యిచ్చెయ్యి. ఆవిడే దారికి వస్తుంది" అంది.

"ఛీ! పో మామి!" అన్నాను.

"చూస్తుండు నామాటలు నిజమయినా యని ఒకరోజు నువ్వే నాకువచ్చి చెబు తావు." మేం వెళ్ళేముందు ఒకసారి మళ్ళీ కనిపించేలా వాగ్దానం తీసుకుంది మామి. కార్లు కదిలినాయి

*     *

కారు మా యిల్లుని సమీపిస్తుంటే, అవ్యక్తమైన భయంతో నాగుండెలు వుండ చుట్టుకు పోసాగినాయి. ఇల్లు దగ్గర అవుతుంటగా, కృష్ణ నాచేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. నా అరచేయి తడిగా తగలటంతో, దాన్ని ఎత్తి చూస్తూ "బాప్‌రే! యెంత చెమట! యిదంతా భయమే!" అన్నాడు. ఆశ్చర్యంగా నేను నవ్వ బోయాను. కానీ నవ్వురాలేదు. నిజంగా మా అమ్మ అంటే నా కెంత భయమో మొదటిసారి తెలిసినట్టుగా వుంది.

వాకిటిముందు చాలా కార్లు ఆగి వున్నాయి. గేటుమీద తోరణంలా కట్టిన దీపాలు. ఒకసారి ఆకు పచ్చరంగులో "స్వాగతం" అని యింకోసారి ఎఱ్ఱ రంగులో "వెల్‌కమ్" అని మారి, మారి వెలుగుతున్నాయి. చాలామంది వచ్చి నట్టుగా సందడిగా, కోలాహలంగావుంది.

కృష్ణ కారుల నుంచి దిగాడు.

నేను వెంటనే దిగలేదు. నాకు చెయి అందించాడు. నేను దిగటానికి ఇష్టపడ నట్టుగా జంకుగా, భయం భయంగా చూసాను.

కృష్ణ లోపలకివంగి, తగ్గు స్వరంలో "అనవసరంగా భయపడే వాళ్ళంటే నాకు చెడ్డ విసుగు తెలుసా?" అన్నాడు. ఈ మాటలు నామీద మంత్రంలా పనిచేసి నాయి. రోషంలాటిది వచ్చింది. అతను అందిస్తున్న చెయితో నేసి చప్పున క్రిందకుదిగాను. కృష్ణ నాచిటికిన వేలు పట్టుకున్నాడు.

మేం షామియానాలో అడుగు పెడు తుంటే అక్కడ బాంచ్‌వాళ్ళు, కూల్ డ్రింక్స్ సర్వుచేస్తున్న బాయస్ మమ్మల్ని విచిత్రంగా చూడసాగారు. మమ్మల్ని మొట్టమొదట చూసిన వ్యక్తి స్వీటీ! తర్వాత డ్రైవర్! ఆ తర్వాత తాయారమ్మ! ముగ్గురూ ఒకరి వెనక వొకరు భూతాలు తరుము కొస్తున్నట్టు లోపలకు పరుగెత్తారు.

మేము షామియానాలోంచి నడిచి లోపలకి వెళ్ళాం.

పందిరిక్రింద వున్నవాళ్లు తెల్లబోయి నట్టు చూస్తున్నారు. కొంతమంది అర్థం

యు వ

కానట్టు ప్రశ్నార్థకంగా పక్క వాళ్లవైపు తిరుగుతున్నారు. యింకా కొంతమంది కుతూహలంగా చూడు—చూడు మన్నట్టు పక్క వాళ్ళ భుజాలను, చేతులతో గిల్లు తున్నారు.

నేను కావాలనే వాళ్ళందరి వైపు ధైర్యంగా కలియచూసాను. నేను, కృష్ణ మెట్లెక్కి హాలులోకి వచ్చాం.

అప్పటికే వెంటకక్కి, తాయారమ్మ—స్వీటీ వాళ్లురాగా, పరుగెత్తుకుంటు వచ్చిన అమ్మమ్మల్ని చూడగానే సర్పద్రష్టలా ఆగిపోయింది.

మెళ్లో దండలతో, పెళ్లి పుస్తాలుతో చెయ్యి చెయ్యి కలుపుకుని వచ్చిన మమ్మల్ని చూడగానే మతిపోయినదానిలా నిలబడిపోయింది! ఆవిడచూపు కృష్ణమీద నిలిచింది. "నువ్వా! నువ్వు—నువ్వు" ఆపైన మాట్లాడటానికి సాధ్యంకాని దానిలా, గబగబా వూపిరి పీలుస్తూ నిల బడింది.

ఈ కబురు తెలిసింది కాబోలు. ఎక్కడో వున్న నాన్నగారు, ఆయనవెంట బాబాయి, సారధి యింకెవరెవరో గబ గబా అక్కడికి వచ్చారు.

కృష్ణ నాన్నగారిని చూడగానే, అన్నాడు. "మామయ్యా! నేను మీనాని పెళ్లి చేసుకున్నాను!"

నాన్నగారు తన కళ్ళని తాను నమ్మ లేనట్టు, దిగ్భ్రాంతి చెందినట్టూ చూస్తు న్నారు. అక్కడంతమంది నిలబడినా అంతటా అతి విచిత్రమైన నిశబ్దం ఏర్ప డింది.

ఆ నిశబ్దాన్ని చీల్చుకుంటూ, పిలాటి జంకూ, గొంకూ, తడబాటు లేకుండా కృష్ణ స్వరం మృదు గంభీరంగా విని పించింది. "మామయ్యా! మేం పెళ్లి చేసుకున్నాం. ఈ రాత్రికి వూరు వెళ్లి పోతున్నాం. మీ ఆశీస్సులకోసం వచ్చాం. మా అమ్మకిగాని, మీకుగాని ముందుగా తెలిస్తే యీ పెళ్లి జరగనివ్వరనే భయంతో యిలా రహస్యంగా చేసు కోవాల్సి వచ్చింది."

అతని ధైర్యానికి నేను విస్తు పోయాను.

"అబద్ధం!" వొక్కసారిగా అరిచిన అమ్మ చటుక్కున రెండడుగులు ముందుకు వేసి నా చేయిపట్టి తన దగ్గరకు లాక్కుంది.

నా మెళ్ళోవున్న దండ రెండు చేతు లతో తెంపేస్తూ, "పచ్చి అబద్ధం! నాకు తెలియకుండా అయిన పెళ్లి పెళ్ళి కానే కాదు. ఇది మోసం." అంటూ దండని లాగబోయింది. కానీ చెమ్కి చుట్టి వుండ టంతో పూలు నలిగి, రేకులు రాలి క్రింద పడ్డాయే తప్ప దండ తెగలేదు.

చెమ్కి నామెడమీద గీసుకుపోయింది. అమ్మ వేళ్ళు కూడా తెగి రక్తం రాసా గింది.

"అత్తయ్యా!" కృష్ణ ముందుకి వచ్చాడు.

## ఒకే ఉతుకులో 3 దశలుగా పనిచేసి...




# డెట్ బట్టలను ఎక్కువ తెల్లగా ఉతుకుతుంది

—ఏ యితర పౌడరు కంటె

## ఎలా చేస్తుందో ఎందుకు చేస్తుందో చూడండి:

1వ. దశ: డెట్‌లోగల ఒక ప్రత్యేకమైన పదార్థము బట్టలోనికి త్వరగా చొచ్చుకొనిపోయి. బాగా అంటుకొని ఉన్న మట్టిని కూడ వదలిస్తుంది—బట్టలు శుభ్రపడతాయి.

2వ. దశ: డెట్ మట్టిని వదలించిన తరువాత దానిని బట్టకు మళ్లీ అంటుకోకుండా చేస్తుంది— దుస్తులు శుభ్రపడతాయి, శుభ్రముగా ఉంటాయి.

3వ. దశ: డెట్ బట్టలకు అదనపు తెల్లదనమును కలిగిస్తుంది—బట్టలు పూర్వము కంటె ఎక్కువ తెల్లగా ఉంటాయి! (నీలి లేక తెలుపు చేసే పదార్థమును చేర్చనక్కర లేదు).

## డెట్‌ను నేడే కొనండి!

స్వస్తిక్ ఆయిల్ మిల్స్, బొంబాయి

SHILPI HPMA 38A/70 TEL

''ఖబడ్దార్:'' ఆడ పులిలా గర్జించింది అమ్మ. అడుగు ముందుకు వేసావో నీ ప్రాణం తీస్తాను! నా కూతురు నడిచిన చోట నిలబడటానికి కూడా అర్హతలేని పురుగువి!''

''అమ్మా!'' నేను వారిస్తున్నట్టుగా పిలిచాను.

నాచెంప ఛెళ్లుమంది.

''సిగ్గు మాలిన దానా! అమ్మ అనేది బ్రతికి వుందనే జ్ఞానమే నీకుంటే ఈపని చేస్తావా?'' నా చెంపలు అదిరిపోయినాయి.

కృష్ణ ఒక అడుగు ముందుకు వేసి నా చెయి గట్టిగా పట్టుకున్నాడు.

''అత్తయ్యా! మీనా ఒంటి మీద యింకో దెబ్బపడిందంటే నీ మర్యాద దక్కదు.''

''నోర్ముయ్!'' అమ్మ అతని చెయి గుంజి అవతలకితోసింది. ఆడపులిలా చెయి[illegible] చూపిస్తూ, ''వెళ్లు! నీ ప్రాణాలమీద ఏమాత్రం తీపివున్నా, నా నౌకర్లు నిన్ను చిత్రహింస చేయకముందు తక్షణం బైటకివెళ్లు.' అంటు అరిచింది.

కృష్ణ విసురుగా తల తిప్పాడు.

'వెళ్తాను. వెళ్లేటప్పుడు నా భార్యని తీసుకుని మరీ వెళ్తాను. మీనా! రా! వెళ్దాం!''

''భార్య! సిగ్గు లేదూ ఆమాట అనటానికి! తాళికట్టినంతమాత్రాన దాని భర్త అయ్యానని మురిసిపోకు. అభం, శుభం తెలియని నా కూతురుని, డబ్బుమీద

ఆశతో, ఒంటిమీద తెలివి లేకుండా చేసి బలవంతపు పెళ్లి చేసుకున్నావని, నీ మీద కేసు పెడతాను। అది ఋజువుచేసి నిన్ను జైలుకి పంపకపోతె చూడు। నిన్ను ముప్ప తిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించకపోతే నా పేరు కృష్ణవేణీ గాదు. నువ్వెంత సిగ్గుమాలిన వాడివి కాకపోతే పిలవకుండా నా యింటికి వస్తావు। నీలాటి వాళ్ళకి సిగ్గు—శరం కూడానా।''

''కృష్ణవేణీ।'' నాన్నగారు అమ్మని శాంతబరచ పోయారు. ''జరిగిం దేదో జరిగింది. యింతమందిలో మనంకూడా తొందర పడితె ''

ఆయ నమాట పూర్తి।కాలేదు. అమ్మ ఆయనవైపు తిరిగింది. ఆవిడ ముఖంలో చిత్ర విచిత్రమైన భావ సంచలనం కని పించింది మెరపులా ఏదో ఆలోచనతట్టిన వ్యక్తిలా నాన్నగారివైపు. కృష్ణవైపు మార్చి మార్చి చూసింది.

''ఓ! అదా సంగతి। అయితే యిదంతా తమరి ప్రయోజకత్వం అన్నమాట। తెర వెనక వుండి యీ నాటకం ఆడించిన సూత్రధారి మీరేనా। పైనుంచి ఏం తెలియ నట్టు నటిస్తారేం? పిల్ల కనిపించలేదని నేను ఖంగారు పడుతుంటే, ఆది ఎక్కడికి వెళ్లిందో, ఏం చేస్తోందో తెలిసివుండీ కూడా ఏం తెలియనట్టు నా ముందు ఆదుర్దా

వతిస్తున్నారా?"

"కృష్ణవేణీ!" నాన్నగారు అయోమయంగా చూసారు.

ఒకచేత్తో నన్ను గట్టిగా పట్టుకున్న అమ్మ రెండోచేత్తో ఆయన షర్టుని గుప్పెటతో పట్టుకుంది. "చెప్పండి. మాట్లాడరేం? నాకు తెలియకుండా నా పిల్లని యీ గతిమాలినవాడికి కట్టబెడ్తారా? మీరు మొదటినుంచీ, మీ చెల్లెలికి నా యిల్లు దోచిపెట్టాలని చూస్తునే వున్నారు. మీ ఆట నేను సాగనివ్వలేదు. ఆ కసి యీ రూపేణా తీర్చుకున్నారా? మీరు మనిషేనా? తండ్రేనా అసలు?"

"అత్తయ్యా! మామయ్యకేం తెలియదు. ఇందులో ఆయన భాగం ఏం లేదు" కృష్ణ నిర్లిప్తంగా ఉన్నాడు.

"ఏమండీ! మీకేం తెలియదా? ప్రమాణం చేసిచెప్పండి. మీరు చెప్పకుండానే వాడెవరో దానికి తెలిసిందా? మీ ప్రోత్సాహం లేకుండానే అది యింతకి తెగించిందా?"

"కృష్ణవేణీ!" ఆయన వెన్నుపోటు తిన్న మనిషిలా చూడసాగారు.

అమ్మకి హఠాత్తుగా ఏడుపు వచ్చేసింది. ఏడుస్తూ అంది. "మీరు - మీరు - మీకు, నామీద కసి తీర్చుకోటానికి యింతకంటే మార్గం తోచలేదా? ఈ వుద్దేశ్యం మీ మనసులో వుంటే ముందే నాకు ఎందుకు చెప్పలేదు." నన్నిలా అవమానిస్తే మీకేం వస్తుంది! మీరు—ఆఖరికి—రోడ్డున పోయేవాడిని తెచ్చి అంటగట్టినా నాకింత బాధ వుండేది కాదు. కానీ యీ పొగరుమోతుకి—నేనంటే గడ్డిపరకంత విలువకూడా లేని యీ నికృష్టుడికి—"

అమ్మ హఠాత్తుగా నన్నూ-నాన్నగారినీ యిద్దరినీ వదిలేసి, చేయి ఎత్తుతూ కృష్ణ మీదకి వెళ్ళింది. "పిరికి వెధవా! నీకు నిజంగా మగసిరి వుంటే ధైర్యంగా వచ్చి నాకు చెప్పివుండేవాడివి! ఇలా దొంగ చాటుగా, ఎప్పటికీ చేసేవాడివి కాదు" అమ్మ ఎత్తిన చెయ్యి కృష్ణ చెంపమీద ఛెళ్ళుమనేదే! కానీ కృష్ణ మెరుపులా ముఖం పక్కకు తిప్పుకుని వెనక్కి ఒక అడుగు వేయటంతో, వూపుడుగా వెళ్ళిన అమ్మ పట్టుదప్పి, కాలుజారి నేలమీద బోర్లా పడింది. నాన్నగారు చప్పున దగ్గరకు వెళ్ళారు.

క్రిందపడిన అమ్మ లేవలేదు. తల నేలకివేసి బలంగా బాదుకుంటూ "అబద్ధం అబద్ధం!" అని అరవసాగింది. ఆ అరుపు మరు నిముషంలో "నేను నమ్మను. నేను నమ్మను." అంటూ హృదయ విదారకమైన ఏడుపుగా మారిపోయింది.

(ఇంకా వుంది)

Published by A. Thirupathi Rayudu at No. 1, Arcot Road, Madras-26.
and Printed by G. Veera Brahmam at his Anuradha Acchagam,
146, T. H. Road, Madras-21.
Controling Editor : "CHAKRAPANI"

# మా సేవాభిలాష

# స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్

స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌తో మీరు వ్యవహరించేటప్పుడు. మీరు సామాన్యమైన బ్యాంకింగ్ సౌకర్యాలన్నీ పొందుతారు. అంతేకాదు, మరో ప్రత్యేకత కూడా!

మీ గురించీ, మీ ఆర్థిక విషయాల గురించీ వ్యక్తిగతంగా మేము తీసుకునే శ్రద్ధే ఈ ప్రత్యేకత. మేము చూపే శ్రద్ధ విషయంలో, మాకు పోటీకెవ్వరూ తగిన వారనిపించరు. సేవచేయటమే మా లక్ష్యం. ఆ సేవనే సకాలానికి, సామర్థ్యంతో, సగౌరవ ప్రదంగా అందజేస్తాము.




ప్రధాన కార్యాలయ భవనం
హైదరాబాద్.

## స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్